# "అమరజీవి"
# పొట్టి శ్రీరాములు జీవిత చరిత్ర
# Amarajeevi Potti Sree Ramulu - Biography

( పరిశోధనా గ్రంథము )

రచన :

డాక్టరు బాదం శ్రీరాములు, ఎం.ఏ., పిహెచ్.డి.



ప్రచురణ :

**Akhil Bharat Vysya Yuvajana Sangh**

Office : K C GUPTA House, 4-7-324,
Esamia Bazar Hyderabad-500 027

ఆగష్టు 1992 వెల 25/- రూపాయలు

ప్రథమ ముద్రణ – 1000 కాపీలు ఆగస్టు 1992



Dr. Badam Sree Ramulu, M.A., Ph.D
Lecturer, S.V K.P. College,
P. O. Markapuram-523 316,
Prakasham Dist.

**Akhil Bharat Vysya Yuvajana Sangh**

Golden Jubilee Reception Committee

President :
**Gattu Veeresham**
B.Com., F.C.A.

General Secretary :
**Burgu Narasimhulu,** B. E.

Chairman :
'Vysya Ratna'
**Kabalavai Radhakrishna Rao**

Secretary :
**Boggarapu Dayanand,** B Sc.

Printed at :
Sudarshan Printers, Chappal Bazar, Hyd'bad. ☎ 55 29 78

# మనవి

అఖిల భారత వైశ్య యువజన సంఘాన్ని 20 ఏప్రిల్ 1939 తేదీన హైద్రాబాద్‌లో స్వాతంత్ర్య సమరయోధుడు శ్రీ కె. సి. గుప్తాగారిచే ప్రారంభించబడినది.

వైశ్యులనగా దక్షిణాదిన నివసించు ఆర్యవైశ్యులే కాదు దేశమంతా అన్ని రాష్ట్రాలలో వైశ్యులు కలరు. వారు 100 పేర్లతో పిలువబడుచున్నారు.

వైశ్యులు రాజకీయాలలో పాల్గొనుటకు ప్రోత్సహించి స్వసంఘీయులతో పాటు పౌరుల సేవ చేయుచు అన్ని రంగాలలో తోటి పౌరులతో సమానముగా ముందంజ వేసి దేశాభివృద్ధి కార్యక్రమాలలో తోడ్పడుచు దేశ సమైక్యతకు పాటు పడుటకు సిద్ధము చేయడమే ఈ సంస్థ ముఖ్యోద్దేశము.

సారస్వతమే రాబోవు తరముల వారికి ఆధారము కాబట్టి వైశ్యుల ఔన్నత్యాన్ని తెలుపు చరిత్రలు వివిధ భాషలలో 10 పుస్తకాలు ప్రచురించినాము.

ఈసంస్థకు 50 సంవత్సరాలు పూర్తి అయినందున సువర్ణోత్సవము జరుపుకొనుచున్నది. ఈ సందర్భమున అమరజీవి పొట్టి శ్రీరాములు ఆంధ్ర రాష్ట్ర నిర్మాతయే కాక భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడుటకు కృషి చేసిన మహానుభావుడు. వీరి చరిత్రను డాక్టరు బాదం శ్రీరాములు, యం.ఏ., పిహెచ్.డి. అనేక సంవత్సరాలు కృషి చేసి పరిశోధనజరిపి, దారవాడ (కర్నాటక) విశ్వవిద్యాలయము నుండి పిహెచ్.డి.ని పొందినారు. వీరి గ్రంధాన్ని బొంబాయిలో ఆంగ్లములో ముద్రించబడినది. ఈ గ్రంధానికి తెలుగు అనువాదం వారే చేసినారు. ఈ గ్రంధాన్ని 20 వేల రూపాయల వ్యయముతో అఖిల భారత వైశ్య యువజన సంఘం సువర్ణోత్సవ సందర్భమున ముద్రించినాము. ఈ గ్రంథాన్ని ముద్రించుటకు అవకాశాన్ని కలుగజేసిన డాక్టరు బాదం శ్రీరాములు గారికి, విరాళము నొసగిన దాతలకు, మరియు గ్రంధాన్ని ఆవిష్కరించుటకు అంగీకరించిన శ్రీ కొణిజేటి రోశయ్య, వైద్య ఆరోగ్య శాఖామాత్యులు గారికి అభివందనములు తెలుపుచున్నాము.

ఇట్లు

**అఖిల భారత వైశ్య యువజన సంఘం**

# కృతజ్ఞతలు

ప్రేమాస్పదులైన తండ్రి బాదం కోటయ్యగారికి, తల్లి సుబ్బమ్మ గారికి, నా విద్యాభివృద్ధికి తోడ్పడిన సోదరుడు బాదం రాములుగారికి, నన్ను ప్రోత్సహించి ఆదరించిన శ్రీ కన్యకాపరమేశ్వరి కళాశాల, మార్కాపురం పాలకవర్గం మరియు అధ్యాపక మిత్రబృందానికి, ఈ గ్రంథాన్ని అందంగా ప్రచురించిన అఖిలభారత యువజన సంఘం, హైదరాబాదు వారికి నా కృతజ్ఞతలు.

నన్ను నిరంతరం ఆదరించి నాకు గౌరవ పురస్కారం అందజేయడమేగాక నన్ను ఈ కార్యక్రమానికి ప్రోత్సహించి ప్రేరణ నిచ్చిన అఖిల భారత వైశ్య యువజన సంఘమునకు నా ప్రేమపూర్వక ప్రత్యేక కృతజ్ఞతలు.

ఇట్లు

డా॥ బాదం శ్రీరాములు

# ముందుమాట

1983వ సంవత్సరంలో కర్ణాటక యూనివర్సిటి, ధారవాడ వారు పి. హెచ్‌డి. డిగ్రీకి ఆమోదించిన ఆంగ్ల థీసిస్ యొక్క స్వేచ్ఛానువాదమే ఈ గ్రంథం పురాణపురుషుడైన శిబిచక్రవర్తి ఒక పక్షి ఆకలి తీర్చడానికి తన శరీరాన్నే కోసిఇచ్చాడని విన్నాం. అది కేవలం నమ్మకానికి సంబంధించిన విషయం మాత్రమే. కాని పొట్టి శ్రీరాములు తన 58 రోజుల దీక్షాకాలంలో ప్రతిక్షణం తన రక్తమాంసాలను కరిగించి కోట్లాది ఆంధ్రుల శ్రేయస్సుకోసం 33 పౌన్ల రక్తమాంసాలను (119 పౌన్ల నుండి 84 పౌన్లకు తగ్గిపోయాడు) పంచి ఇవ్వడాన్ని మనతరంలోనే చూశాం. ప్రపంచ చరిత్రలోనే అరుదైన త్యాగమూర్తి శ్రీరాములు. వారి గొప్పతనాన్ని హేళనచేసిన సంఘటన నన్ను ఆయన జీవిత చరిత్ర పరిశోధనకు ప్రేరేపించింది.

8 సంవత్సరాల సుదీర్ఘకాలం శ్రమించాను. వారి బంధువులను కలిశాను. వారి స్నేహితులతో మాట్లాడాను. మహాత్మాగాంధి, వినోబాభావే, రాజేంద్రప్రసాద్, కిషోర్‌లాల్, మష్రూవాలా, డి. పి. రామస్వామిరెడ్డియార్, యన్.జి. రంగా, బి. యస్. మూర్తి మొదలైన ప్రముఖులతో శ్రీరాములు జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిని సేకరించాను. ఆయన డైరీని రికార్డులను సంపాదించాను. 40 సంవత్సరములనాటి దిన వార పత్రికలను సంపాదించాను. ఎన్నో ప్రదేశాలను, లైబ్రరీలను సందర్శించాను. కర్ణాటక యూనివర్సిటి అధికార్లను సంతృప్తిపరచాను. నా కృషి ఫలించింది. నా థీసిస్ విన్నిపెగ్ యూనివర్సిటి (కెనడా) సోషియాలజి ప్రొఫెసర్ డి ఎ. చెక్కిగారి ఆమోదం కూడా పొందింది పి.హెచ్‌డి. డిగ్రీ లభించింది. భారత ప్రభుత్వము (ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ సోషియల్ సైన్స్ రీసర్చ్) ఆమోదించింది. బొంబాయిలోని హిమాలయ పబ్లిషింగ్‌హౌస్‌వారు దీనిని ముద్రించి దేశవ్యాప్తంగా విడుదలచేశారు.

ఈ అమూల్య గ్రంథాన్ని ఆంధ్రులందరు చదవాలనే సదుద్దేశ్యంతో ఎంతో శ్రమకోర్చి థీసిస్‌ను ఆంధ్రీకరించడం జరిగింది. తెలుగు ప్రజలు ఈ గ్రంథాన్ని సంపూర్ణంగా చదివి నా కృషిని అభినందించగలరని ఆశిస్తున్నాను.

భవదీయ

**డా॥ బాదం శ్రీరాములు**

# విషయసూచిక





# ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారికి విజ్ఞప్తి

1. అమరజీవి స్వస్థలమైన నెల్లూరు జిల్లాను పొట్టి శ్రీరాములు జిల్లాగా పేరు మార్చవలెను లేదా నెల్లూరు జిల్లాలోన కొంత భాగాన్ని మరికొన్ని ప్రాంతములను కలిపి కొత్త జిల్లా ఏర్పాటు చేయవలెను

2. 16 మార్చి పొట్టి శ్రీరాములు పుట్టిన రోజును ప్రభుత్వము శెలవు దినముగా ప్రకటించవలెను.

3. ప్రతి జిల్లా కేంద్రాలలో మరియు పట్టణాలలో పొట్టి శ్రీరాములు విగ్రహాన్ని ప్రతిష్టించవలెను మరియు ఆ వీధి పేరు పొట్టి శ్రీరాములు వీధి అని పేరు పెట్టవలెను.

4. పొట్టి శ్రీరాములు పేర విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పవలెను లేదా ప్రస్తుతము వున్న విశ్వవిద్యాలయాలలో నొకదాని పేరు మార్చవలెను.

5. పొట్టి శ్రీరాములు అవార్డులను ప్రకటించి రాష్ట్రానికి వివిధ రంగాలలో కృషి చేసిన వారికి యివ్వవలెను

6. పొట్టి శ్రీరాములు చరిత్రను పాఠ్య పుస్తకాలలో చేర్చి విద్యార్థులకు తెలియునట్లు చేయవలెను.

7. పొట్టి శ్రీరాములు చరిత్ర స్వల్ప ధరలకు వివిధ భాషలలో ప్రచురించి ప్రచారము చేయవలెను.

8. పొట్టి శ్రీరాములు ఫొటోలను స్వల్ప ధరలకు ప్రచురించవలెను.

9. జిల్లా కేంద్రాలలో పార్కులు మొదలగు వాటికి పొట్టి శ్రీరాములు పేరు పెట్టవలెను.

10. పొట్టి శ్రీరాములు పోస్టల్ స్టాంపును విడుదల చేయుటకు కేంద్ర ప్రభుత్వమును సిఫారసు చేయవలెను.

—అఖిల భారత వైశ్య యువజన సంఘము

# అమరజీవి పొట్టి శ్రీరాములు స్మారక సమితి
# హైదరాబాదు

అమరజీవి పొట్టి శ్రీరాములు స్మారక సమితి హైదరాబాదు పట్టణములో ఈ సంస్థ అధ్యక్షులు శ్రీ కొత్తూరు సీతయ్య గుప్త సిద్ధాంతశాస్త్రి గారి నాయకత్వమున నిర్వహించిన, నిర్వహించుచున్న కార్యక్రమాలు

1. అమరజీవి పొట్టి శ్రీరాములు విగ్రహాన్ని ఆనాడు ముఖ్యమంత్రి శ్రీ విజయభాస్కర్‌రెడ్డి గారు మా విన్నపములను అంగీకరించి, విగ్రహాన్ని హైదరాబాదు నగరములో సెక్రటేరియట్ వద్ద ప్రతిష్టించడము మా కృషి ఫలితమే.
2. మార్చి 15వ తేది అమరజీవి పొట్టి శ్రీరాములు పుట్టినరోజు మరియు 16 డిసెంబరు తేదిన వర్ధంతి సభలను జరుపుచు వారి త్యాగాన్ని, ఆదర్శాలను ప్రచారము చేయబడుచున్నది.
3 అమరజీవి పొట్టి శ్రీరాములు స్వయముగా వ్రాసిన ఉత్తరాలను వారికి కేంద్ర నాయకులు వ్రాసిన ఉత్తరాలను మరియు వారు ఉపయోగించిన వస్తువులను ప్రదర్శన ఏర్పాటుచేసి ప్రదర్శించుచున్నారు.
4. ఒక గ్రంథాలయాన్ని పఠనాలయాన్ని నడుపుచున్నాము.
5. చలనచిత్రాన్ని క్లుప్తముగా తీయించబడినది.

ప్రతి జిల్లా కేంద్రాలలో మరియు పట్టణాలలో అమరజీవి స్మారక సమితులను ఏర్పాటుచేసి వారి త్యాగాన్ని, ఆదర్శాలను ప్రచారము చేయవలెనని కోరుచున్నాము.

జి. నారాయణరావు, ఐ.ఎ.యస్ (రిటైర్డు)
ప్రధాన కార్యదర్శి

ఆగష్టు 1992

# ప్రథమాధ్యాయం

## పొట్టి శ్రీరాములు గారి బాల్య విద్యాభ్యాసం వారి జీవితంపై ఇతరుల ప్రభావం

ఆంధ్ర రాష్ట్రావతరణ కోసం నిర్విరామంగా శ్రమించి ఆత్మార్పణం చేసిన త్యాగమూర్తి పొట్టి శ్రీరాములు. ఆయన సర్వాంధ్రజన హృదయాలలో అమరజీవిగా నిలిచిపోయాడు. శ్రీరాములు చరిత్రకందని మహాపురుషుల్లో ఒకరు. ఆయన క్రీ॥శ॥ 1902 సెప్టెంబరు 12వ తేదీన మద్రాసు నగరం అన్నాపిళ్ళె వీధిలోని ఆర్యవైశ్య కుటుంబంలో జన్మించాడు. (1) సర్వసాధారణ రూపురేఖలతో నిరుపేద కుటుంబంలో జన్మించిన శ్రీరాములు ఇంతటి ఉన్నత శిఖరాలను అధిరోహిస్తాడని ఎవ్వరూ ఉహించి ఉండరు. (2) అయినా ఆయన అందరిలాంటి సామాన్య వ్యక్తికాడని తన జీవిత కాలంలో నిరూపించాడు. ఆయన చేసిన ఆమరణ నిరశన వ్రతం వల్ల ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర సిద్ధి లభించింది. తరువాత భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడ్డాయి.

---

1) పొట్టి శ్రీరాములుగారి జన్మతేదీని గురించి బిన్నాభిప్రాయాలున్నాయి. ఆయన మద్రాసులో చదివిన ప్రోగ్రెసిస్ యూనియన్ ఉన్నత పాఠశాల రికార్డు ప్రకారము 1902 సెప్టెంబరు 12వ తేదీన జన్మించారు. శ్రీరాములు గారి తమ్ముడు రంగయ్య కూడా ఈ తేదీనే నిర్ధారించారు. **The Emergence of Andhra Pradesh** అనే పరిశోధనా గ్రంథంలో శ్రీరాములు 1901 మార్చి 10వ తేదీన జన్మించినట్లు కె. వి. నారాయణరావు వ్రాశారు. " ఆంధ్ర జ్యోతి " అమరజీవి గ్రంథ రచనలో చిప్పాడ సూర్యనారాయణ పై అభిప్రాయంతో ఏకీభవించారు. శ్రీరాములుపై వెలువడిన అనేక వ్యాసాల్లో శిలాఫలకాల్లో ఆయన 1901 మార్చి 15వ తేదీన జన్మించినట్లు కనిపిస్తోంది. ఈ తేదీ బహుళ ప్రచారంలో వుంది.

2) శ్రీరాములు గారి మేనల్లుడు, సబర్మతీ ఆశ్రమములో ఆయన సహపాటి శ్రీ యన్. ఆర్. గుప్తాగారితో 1975 జూన్ 9 నుండి 21వ తేదీ వరకు జరిపిన సమావేశం ఆధారంగా.

# పొట్టి శ్రీరాములుగారి పితృ వంశవృక్షము






# పొట్టి శ్రీరాములుగారి మాతృ వంశవృక్షము

గోనుగుంట్ల సీతమ్మ









ఇలా భారతదేశ రాజకీయ చిత్రపటాన్నే మార్చివేశాడు శ్రీరాములు. ఆయన రాజకీయాలకు నైతిక విలువలు కలుగచేశాడు. మానవతావాదిగా భారతీయులకు చిరస్మరణీయుడు. (1)

శ్రీరాములు తల్లి మహాలక్ష్మమ్మ. తండ్రి గురవయ్య. వీరు నిరుపేదలైనా ఆర్ష సంప్రదాయాన్ని పుణికి పుచ్చుకొన్న పుణ్య దంపతులు. వీరికి గురమ్మ అనే కుమార్తె, నారాయణ, శ్రీరాములు, రంగయ్య అనే కుమారులు జన్మించారు. (2)

పొట్టి శ్రీరాముల పూర్వీకులు నెల్లూరు మండలంలోని కనిగిరి తాలూకాకు చెందిన పడమటిపల్లె అనే గ్రామానికి చెందినవారు. (3) ఈ గ్రామం ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌లోని ప్రకాశం జిల్లాలోనికి చేర్చబడింది. శ్రీరాములు తండ్రి గురువయ్య వంశపారంపర్యంగా వస్తున్న వ్యాపారంతో కుటుంబాన్ని పోషించేవాడు. ఆయన గొప్ప విద్యావంతుడు కాదు. అయినా సహృదయుడుగా, నిజాయితీ పరుడుగా ఆ ప్రాంతంలో గుర్తింపు పొందాడు. ఆయన సాధు స్వభావం కలవాడు గనుక వ్యాపార నిర్వహణలో అనేక కష్టాలను ఎదుర్కోవలసి వచ్చింది. (4) మూలగే నక్కమీద తాటికాయ పడ్డట్లు 1876లో ఆంధ్రలో ధాత కరువు సంభవించింది. దీనితో గురువయ్య కుటుంబం మరీ చిక్కుల పాలయింది. ఆర్థికస్థితి క్షీణించింది. స్వస్థలంలో వ్యాపారం కొనసాగలేదు. కుటుంబ పోషణ దుర్లభమయింది. ఈ పరిస్థితుల్లో గురువయ్య భార్య ప్రోత్సాహంతో మద్రాసు నగరానికి చేరాడు. అక్కడ జారిజటౌన్‌లో వున్న అన్నాపిళ్ళె వీధిలో 163 నెంబరు ఇంటిని అద్దెకు తీసుకున్నాడు. కాయకష్టంతో జీవనయాత్ర సాగించాడు. అక్కడే శ్రీరాములు జన్మించాడు.

---

1) Prakasam, Tanguturi "Funderal Speech" The Indian Express 17, December, 1952.

2) శ్రీరాములుగారి సోదరుడు రంగయ్య భద్రపరచిన వంశవృక్షం ఆధారంగా.

3) రాఘవయ్య, డి. సి., "విక్రమ సింహపురి సర్వస్వం" పంచాయితీరాజ్ తృతీయ వార్షిక సంచిక. నెల్లూరు జిల్లా పరిషత్ : 1963 ఆగస్ట్ పు .1.

4) యన్. ఆర్. గుప్తాగారితో 1975 జూన్ 9 నుండి 21వ తేదీ వరకు జరిపిన సమావేశంలో.

శ్రీరాముల తల్లిదండ్రులు తమ బిడ్డలందర్ని సమానంగా చూసుకొనేవారు. అయినా సున్నిత స్వభావంగల శ్రీరాముల్ని విశేషానురాగంతో చూసేవారు. శ్రీరాములు చిన్నప్పటినుండి తల్లిదండ్రుల పట్ల వినయ విధేయతలు కలిగివుండేవాడు. కానీ తల్లిపట్ల ఆయనకు ప్రత్యేకాభిమానం ఏర్పడింది. (1) అందుచేత శ్రీరాములు ఆమె దైనందిన కార్యక్రమాన్ని శ్రద్ధగా గమనించేవాడు. ఆమె దైవభక్తి సదాచార సంపత్తి అతన్ని ఎంతగానో ఆకర్షించేవి. ఆమె కుటుంబ సభ్యుల సుఖ దుఃఖాలను సమానంగా పంచుకోగలిగిన ఆదర్శ గృహిణి. పేదల యెడ కనికరం, కర్తవ్యపాలనం, ధృఢ నిశ్చయం, పరిస్థితుల సదవగాహన మున్నగు సుగుణాలవల్ల ఆమె అందరి ఆదరణకు నోచుకొంది. సచ్ఛీలవతియైన తన మాతృదేవి నుండి ఎంతో ప్రేరణ పొందాడు శ్రీరాములు, తుది శ్వాస విడిచేవరకూ తన తల్లి ఉదాత్త గుణాలను శ్రీరాములు విస్మరించలేదు. (2)

ఆర్థిక పరిస్థితులు దిగజారడంవల్ల మహాలక్ష్మమ్మ మిక్కిలి పొదుపుగా కుటుంబాన్ని నిర్వహించేది. ఈ దుస్థితిలో ఆమె కొంతకాలం వడ్లు దంచింది. ఇరుగుపొరుగు ఇళ్లలో చాకిరి చేసింది. దీనితో లభించిన కొద్ది ధనంతో సంసారాన్ని గడిపింది. వయోవృద్ధుడు అనారోగ్యవంతుడు అయిన భర్తకు ఆమె ఏమాత్రం ఇబ్బంది కలిగించలేదు కుటుంబ నిర్వహణ భారాన్ని తానొక్కతే మోసింది.

గురవయ్య, మహాలక్ష్మమ్మ స్వభావాల్లో ఎంతో తేడా వుంది. గురవయ్య కుటుంబ సమస్యలను పట్టించుకొనేవాడు కాదు. "నారు పోసినవాడు నీరు పోయడా" అని అంతా భగవంతుని మీద భారంవేశేవాడు.

ఒక్కమాటలో చెప్పాలంటే గురవయ్య నిరాశాజీవి. మహాలక్ష్మమ్మ ఆశాజీవి ఆమె భర్తవలె కాక కుటుంబ సమస్యలను వాస్తవ దృష్టితో పరిశీలించేది. ఆమెకు కర్మసిద్ధాంతం మీద నమ్మకం లేదు. స్వయంకృషే మానవుల భవిష్యదున్నతిని నిర్ణయిస్తుందని ఆమె ధృఢ విశ్వాసం. (3) ఇలా భార్యాభర్తల భావాల్లో వైవిధ్యం

1) రంగయ్యగారితో జరిపిన సంభాషణ ది. 12 నవంబర్, 1974.

2) యన్.ఆర్. గుప్తాగారితో జరిపిన సమావేశం. 1975 జూన్ 9 నుండి 21వరకు

3) యన్.ఆర్. గుప్తాగారితో జరిపిన సమావేశం ది. 9-6-75 నుండి 21 జూన్ వరకు.

పుష్టిచేకీ ఆమెకు భర్త మీద అపారమైన గౌరవం వుండేది. భర్తయిచ్చిన సలహా దూరదృష్టితోకూడి ఆచరణయోగ్యంగా వుంటే ఆమె దాన్ని వెంటనే పాటించేది. (1) కాని దురదృష్టంవల్ల రోగగ్రస్తుడైన భర్త 1908లో మరణించడంతో భర్త సహాలను పొందే అవకాశాన్ని ఆ నిర్భాగ్యురాలు కోల్పోయింది. (2)

భర్త మరణానంతరం మహాలక్ష్మమ్మ తన నివాసాన్ని ఆచారప్పన్ వీధిలోని 99వ నెంబరు యింటికి మార్చింది. అక్కడ ఆమె కొద్ది మొత్తంతో కందులు కొని వాటిని తిరుగలిపై పప్పుగా విసిరి వాటిని విక్రయించగా వచ్చిన కొద్దిపాటి ఆదాయంతో కుటుంబాన్ని పోషించసాగింది. ఆ చిన్న వ్యాపారంలో కూడా ఆమె కొన్ని ఇబ్బందుల నెదుర్కొనవలసి వచ్చింది. పప్పుల ధర నిలకడగా వుండనందువల్ల ఆ వ్యాపారాన్ని చేసే వర్తకులు కొందరు దివాలా తీయసాగారు. కష్టతరం మరియు ప్రమాదభరితమైన ఆ వ్యాపారాన్ని కొనసాగించవద్దని కుమారులు మహాలక్ష్మమ్మకు సలహా యిచ్చారు. కానీ ఇతర వ్యాపారంలోనికి దిగే ఆర్థిక స్తోమతలేనందువల్ల ఆమె కష్టనష్టాలతో కూడిన ఆ వ్యాపారాన్నే సాగించవలసివచ్చింది.

కష్టతరమైన ఆవ్యాపారంలో కూడా ఆమె విజయాన్ని సాధించింది. నీతి, నిజాయితీ, వ్యాపార నైపుణ్యం, ఖాతాదారులను మెప్పించే చాకచక్యం మున్నగు సుగుణాలవల్ల ఆమె వ్యాపారం మూడు పువ్వులు ఆరుకాయలుగా విలసిల్లింది. రానురాను ఆమె పట్ల ప్రజలకు విశ్వాసం కుదిరింది. ఆ పేటలోని ప్రజలేగాక మద్రాసు నగరంలోని వివిధ కళాశాలల హాస్టళ్ల నిర్వాహకులు కూడా తమకు కావలసిన వస్తువులను మహాలక్ష్మమ్మ వద్ద కొనుగోలు చేసేవారు. (3)

ఆమె విద్యావంతురాలు కాకపోవడంవల్ల దైనందిన వ్యాపారపు పద్దులను జాగ్రత్తగా గుర్తుంచుకొని రాత్రిపూట తన కుమారులతో వ్రాయించుకొనేది.

---

1) పి. రంగయ్యగారితో జరిపిన సంభాషణ 1974 సెప్టెంబరు 11, 12 తేదీలు

2) యస్ ఆర్. గుప్తాగారితో జరిగిన సమావేశంలో 1975 జూన్ 9నుండి 21వరకు

3) పి రంగయ్య గారితో 1974 సెప్టెంబరు 11, 12వ తేదీలలో జరిగిన సమావేశంలో.

కష్టాలన్నీ ఒకేమారు వస్తాయనే లోకోక్తి మహాలక్ష్మమ్మ పట్ల నిజమయింది. వ్యాపార నిర్వహణలో చేదోడు వాదోడుగా వుంటున్న ఆమె పెద్ద కుమారుడు నారాయణ 1917లో మరణించాడు. చిన్నతనంలో వితంతువైన నారాయణ భార్య చెంచమ్మ బాధ్యత కూడా ఆమె మీదనే పడింది. పుండుపై కారంచల్లినట్లు ఆ తరువాత కొద్దికాలంలోనే ఆమె ఏకైక పుత్రిక గురమ్మ మరణించింది. అప్పుడు గురమ్మ కొడుకు 18 నెలల బాలుడు. ఆ పిల్లవాణ్ణి పెంచే బాధ్యత కూడా మహాలక్ష్మమ్మ మీదేపడింది. (1)

కష్టాలన్నీ ఒకేసారి చుట్టుముట్టాయి. అయినా ఆమె మనస్థైర్యము కోల్పోలేదు. కర్తవ్య నిర్వహణకు ఎట్టి ఆటంకమూ కలుగ నివ్వలేదు. ఓర్పు ధృఢ నిశ్చయాలతో ఎంతటి కష్టాలనయినా ఎదుర్కొనవచ్చని ఆమెకు మొదటినుండి నమ్మకం వుంది. ఇలాంటి మానసికోన్నతతో విధవయైన తన కోడల్ని కన్న బిడ్డలా చూసుకొంది. దౌహిత్రుడైన నరసింహగుప్తాను ముద్దుగా పెంచి తల్లిలేని లోటును తీర్చగలిగింది.

మహాలక్ష్మమ్మ క్రమశిక్షణతో కూడిన జీవితానికి అలవాటుపడింది. తన బిడ్డలను కూడా అదే మార్గంలో తీర్చిదిద్దింది. వారిని దురభ్యాసాలకు దూరంగా ఉంచగలిగింది. కష్టసుఖాలను సమానంగా చూడగలిగిన ఓర్పును వారికి నేర్పగలిగింది. తన బిడ్డలు సమాజంలో నీతిమంతులు నిజాయితీపరులు కావాలని నిరంతరం ఆకాక్షించింది. (2)

మహాలక్ష్మమ్మగారి కుటుంబం సనాతన భారతీయ సంప్రదాయానికి నిలయం గనుక ఆమె ఇంట్లో హిందూమతానికి, పురాణాలకూ సంబంధించిన అనేక గ్రంధాలు వుండేవి. సదాచార సంపన్నురాలైన ఆమె నిత్యం పూజలు జపాలు క్రమంతప్పక నిర్వహించేది. ముఖ్యంగా పర్వదినాల్లో పచ్చి మంచినీళ్లయినా ముట్టక కఠోర నియమ నిష్టలతో ఉపవాసాలుండేది.

---

1) యన్.ఆర్. గుప్తాగారితో 1975 జూన్ 9 నుండి 21వ తేదీ వరకు జరిపిన సమావేశం ఆధారంగా.

2) పి. రంగయ్యతో 1974 సెప్టెంబరు 11, 12 తేదీన జరిపిన సంభాషణ.

తాను తిన్నా తినకపోయినా అభాగ్యులను, అతిధులను ఆదరించి భోజనం పెట్టేది. ఏ సమయంలో అతిధులు వచ్చినా విసుగు చెందక కన్నతల్లిలా వాళ్లను ఆదరించేది. (1)

ఇరుగు పొరుగు వారితో కలుపుగోలుతనంగా ప్రవర్తించేది. అప్పుడప్పుడు వారి మధ్య వచ్చే స్వల్ప వివాదాలను సునాయాసంగా పరిష్కరించేది. ఆమె ప్రవర్తన పట్ల గౌరవ భావం ఉండడంవల్ల ఆమె తీర్పులను వాళ్ళు మారుమాటాడక శిరసావహించేవాళ్ళు.

మహాలక్ష్మమ్మగారి మానవతా దృక్పథం ప్రశంసనీయం. "ఆత్మవత్ సర్వ భూతాని" అనే విశాల భావంతో ఆమె వ్యవహరించేదని ఈ క్రింది సంఘటన ఋజువు చేస్తోంది.

ఒకేసారి ఆమె చిన్న కుమారుడు రంగయ్య జబ్బున పడ్డాడు. ఒక గుమ్మడికాయ మంత్రించి ఎదురింట్లో వేలాడదీస్తే అదే వయస్సులో వున్న ఎదురింటి పిల్లవాడికి ఈ జబ్బు సంక్రమిస్తుందని ఎవరో సలహా చెప్పారు. కుత్రితమైన ఈ సలహా మహాలక్ష్మమ్మను ఎంతో భాదించింది. తన బిడ్డకోసం ఎదుటివారి బిడ్డను బలిచేయడం తనవల్ల కాదనీ అలాంటి ఆలోచనే మహాపాతకమని ఆమె ఖండితంగా చెప్పింది. (2) ఎదుటివారి బిడ్డను తన బిడ్డను సమాన ప్రేమతో చూడగలిగిన యిలాంటి పవిత్ర మాతృమూర్తి కడుపున పుట్టి శ్రీరాములు ధన్య జీవి అయ్యాడు.

శ్రీరాముల జీవితాన్ని ప్రభావితం చేసిన మరొకవ్యక్తి అతనికి అక్షరాభ్యాసం చేయించిన గురువు నారాయణయ్య. ఈయన మద్రాసులోని గోవిందప్ప నాయకర్ వీధిలో వున్న బంగ్లావల్లి కుటం అనే వీధి బడిలో ఉపాధ్యాయుడు. శ్రీరాములు

---

1) ది. 9 జూన్ 1975 నుండి 21 వరకు యస్.ఆర్. గుప్తాగారు చెప్పిన అంశాలు.

2) ది. 9 జూన్ 1975 నుండి 21 జూన్ వరకు యస్.ఆర్. గుప్తా చెప్పిన విషయాలు.

3)

ఈ బళ్ళోనే విద్యాభ్యాసం ప్రారంభించాడు. (1) శ్రీరాములు సహజంగా లజ్జా స్వభావం కలవాడు. బళ్ళో తోటి విద్యార్థులతో స్వేచ్ఛగా మాట్లాడేవాడు కాదు. ప్రతి విషయంలోనూ బిడియం ప్రదర్శించేవాడు. ఉపాధ్యాయుడు నారాయణయ్య అజాను బాహుడు. అతణ్ణి చూస్తేనే విద్యార్థులు గడగడలాడుతూ వుండేవాళ్ళు. ఆయన విద్యార్థులను చక్కని విద్యతో తీర్చి దిద్దాలనే అభిలాష కలవాడు. అందుచేత విద్యార్థుల క్రమశిక్షణ విషయములో ప్రత్యేక శ్రద్ధ చూపేవాడు. చాడీలు చెప్పేవాళ్లను, బాగా చదవని వాళ్లను, అబద్ధాలు చెప్పేవాళ్లను, పాఠశాలకు సక్రమంగా రాని వాళ్లను ఆయన కఠినంగా శిక్షించేవాడు. అక్కడి విద్యాభ్యాసకాలం రెండు సంవత్సరాలు.

ఈ రెండు సంవత్సరాల్లో అక్కడి విద్యార్థులకు చక్కని నైతిక ప్రవృత్తి అలవడేది. దీనితోపాటు పెద్ద బాలశిక్ష, సుమతి, కృష్ణ, దాశరథి, నారాయణ శతకాలు, అమరకోశం, బాలరామాయణం, మున్నగు గ్రంథాల్లోని పద్యాలు, శ్లోకాలు కంఠస్థమయ్యేది. (2)

విద్యార్థులకు సోదరభావం, ఐకమత్యం, సునిశిత బుద్ధి మొదలగు సుగుణాలు పెంపొందేవి. అహంభావం, న్యూనతాభావం మున్నగు దుర్గుణాలను దూరంచేయడానికి శ్రద్ధ తీసుకొనేవాడు నారాయణయ్య.

నారాయణయ్య తన శిష్యుడైన శ్రీరాములుకు భారత భాగవతాది గ్రంథ విషయాలను ఆసక్తికరంగా బోధించేవాడు. వేదనాభరిత జీవిత గాథలు విన్నప్పుడల్లా శ్రీరాముల నేత్రాలు అశ్రుపూరితాలయ్యేవి. లక్ష్మణుని సోదరభక్తి, కర్ణుని త్యాగనిరతి అతణ్ణి ఎంతో ఆకర్షించాయి. కర్ణుణ్ణి ఆదర్శమూర్తిగా స్వీకరించాడు శ్రీరాములు. కర్ణుని జీవిత ఘట్టాలు అతడినెంతగానో ప్రభావితం చేశాయి. (3) శ్రీరామ చంద్రునికి లక్ష్మణునిలా తాను ముందుముందు గాంధీజీకి నమ్మిన బంటుగా మారవలసి వుంటుందని గానీ, కర్ణునిలా ముక్కోటి ఆంధ్రుల శ్రేయస్సుకోసం ఆమరణ నిరసన వ్రతం ద్వారా తన అమూల్య జీవితాన్ని బలిచేయవలసి వుంటుందని గాని శ్రీరాములు ఆనాడు కలలోనైనా ఊహించి వుండడు. విధిబలీయమైంది కదా. !

---

1) 1974 నవంబర్ 11, 12 తేదీలలో పి. రంగయ్యగారు చెప్పిన అంశాలు.
2) యస్.ఆర్. గుప్తా గారితో 9 జూన్ 1975 నుంచి 21 జూన్ వరకు జరిపిన చర్చ
3) 1974 నవంబర్ 11, 12 తేదీలలో శ్రీ పి. రంగయ్యగారి సంభాషణ ఆధారంగా

శ్రీరాములు ఏస పదోఏట ఆదియ్యప్పనాయకర్ వీధిలోని ప్రోగ్రెసివ్ యూనియన్ సెకండరీ స్కూలులో చేరాడు. ఆర్థిక యిబ్బందులవల్ల. అతడు అంత చిన్న వయస్సులోనే శ్రీకన్యకా పరమేశ్వరీ దేవస్థానం వారి హాస్టల్లో చేరి ఉచిత భోజన సౌకర్యం పొందవలసి వచ్చింది. (1) వేకువ జామున్నే నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకొని దైవప్రార్థన చేసుకొన్న అనంతరం శ్రద్ధగా చదువుకోవడంతో అతని దైనందిన కార్యక్రమం ప్రారంభమయ్యేది. ఆరోజుల్లో చదువుమీద శ్రద్ధలేని సోమరులైన పోకిరి విద్యార్థులు కఠినంగా శిక్షపొందడం సర్వసాధారణం. కానీ ఏనాడు శ్రీరాములును శిక్షించే అవసరం ఉపాధ్యాయులకు కలుగలేదు. శ్రీరాములు ఉపాధ్యాయుల సలహాలను తూ. .చా... తప్పక పాటించేవాడు.

ఇలాంటి సంస్కారవంతుడైన శ్రీరాములు దుష్ట స్నేహాలకూ దురభ్యాసా లకూ దూరంగా వుండేవాడు. గోవిందరాజులు బలరాం అనే యిద్దరు సహవ్రతులు మాత్రమే శ్రీరాములుకు ప్రాణమిత్రులుగా వుండేవాళ్లు. (2) శ్రీరాములుకు కలుపు గోలు తనంలేకపోవడం సహజ స్వభావమైన నిగర్విగా వుండేవాడు. పరోపకారానికి పరుగులు తీసేవాడు. స్నేహితులను జీవితాంతం గుర్తుంచుకొనే శ్రీరాముల మిత్ర భావాన్ని అతని సహవ్రతులు అనేక పర్యాయాలు ఇతరులతో చెప్పి ప్రశంసించేవారు.

ప్రోగ్రెసివ్ యూనియన్ సెకండరీ పాఠశాల్లో సెకండు ఫారం పూర్తి చేశాడు శ్రీరాములు. తరువాత మింట్ స్ట్రీట్‌లో వున్న హిందూ థియోలాజికల్ ఉన్నత పాఠశాల్లో చేరాడు. అక్కడ మూడు సంవత్సరాలు చదివాడు. ఈ సమయములో శ్రీరాములుకు స్నేహితుల సంపద పెరిగింది. గొల్లపూడి రాధాక్రిష్ణయ్య, టి. పట్టాబి రామగుప్త కొత్త మిత్రులలో ముఖ్యమైన వాళ్లు. ఇంజనీరు పదవి నిర్వహించి ప్రస్తుతం భాగ్యనగరంలో విశ్రాంతి తీసుకుంటున్న శ్రీరాములు సహపాఠి కె.జి. రాజులు చిన్ననాటి తమ పాఠశాల అనుభవాలను ఇలా తెలియజేశారు.

పొట్టి శ్రీరాములు వయస్సులో చిన్న వాడయినా ప్రతిభా విశేషాల్లో సహవ్రతుల మధ్య మిన్నగా విరాజిల్లాడు. అతడు చరిత్ర, గణిత శాస్త్రాల్లో

1) పి. రంగయ్య గారితో సమావేశంలో ది. 1974 నవంబర్ 11, 12 తేదీలు
2) కె. జి రాజులతో జరిపిన సమావేశం ది. 15-11-1974.

చురుకుగా వుండేవాడు. ఆంగ్లంలో వెనుకబడి వుండేవాడు. అయినప్పటికి తరగతిలో ప్రథమ, ద్వితీయ స్థానాలను కొద్దిలో పోగొట్టుకొనేవాడు. కర్తవ్య నిర్వహణలో కరకుగా వున్నప్పటికి ఇతర విషయాల్లో స్నేహితులతో చనువుగా వ్యవహరించేవాడు. (1) శ్రీరాములు థియోలాజికల్ పాఠశాలలో చదివే రోజుల్లో యమ్.వి. దొరైస్వామి అనే ఉపాధ్యాయ డు వుండేవాడు ఆయన ఆ పాఠశాల సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించేవాడు. శ్రీరాములుకు ఆయనతో సాన్నిహిత్యం ఏర్పడింది. అందువల్ల శ్రీరాములుకు సాంస్కృతిక కార్యక్రమాల్లో అభిరుచి ఏర్పడింది. ఆ పాఠశాలలోని "షేక్స్ పియర్ క్లబ్బు" అధ్వర్యంలో నిర్వహింపబడే నాటకాల్లో చిన్నచిన్న పాత్రలు ధరించేవాడు. పాఠశాల్లో జరిగే వక్తృత్వ పోటీల్లోనూ, బిలియార్డ్సు, కారమ్స్ మొదలైన ఆటల్లోనూ చురుగ్గా పాల్గొనేవాడు.

తానొకటి తలిస్తే దైవమొకటి తలంచిందనే సామెత శ్రీరాములు విషయంలో అర్ధవంతమైంది. దురదృష్ట వశాన అతడు ఫిఫ్తు ఫారమ్ పరీక్షల్లో కృతార్థుడు కాలేకపోయాడు. (2) అప్పుడు బొంబాయి నగరంలోని విక్టోరియా జూబిలీ టెక్నికల్ ఇన్స్టిట్యూట్ వారు ఫిఫ్తు ఫారం తప్పిన విద్యార్థులను కూడా తమ సంస్థలో చేర్చుకొంటామని ప్రకటించారు. ఈ వార్త శ్రీరాములుకు ఆశా కిరణమై ఉత్తేజాన్ని కలుగజేసింది.

కుమారుణ్ణి బొంబాయి వంటి దూర ప్రాంతానికి పంపడం మహాలక్ష్మమ్మకు బాధాకరమే అయినప్పటికి తన బిడ్డ ఉజ్వల భవిష్యత్తు ఊహించి ఎంతటి త్యాగంచేయడానికైనా సిద్ధపడింది శ్రీరాములును బొంబాయి పంపేటప్పుడు ఆమె "నాయనా! నీవు ఉన్నత విద్యకోసం బొంబాయికే కాదు ఎక్కడికి వెళ్లినా నాకు సంతోషమే. నీ తండ్రి సంపాదించిన ఆస్తి పాస్తులులేవని నీవు సంకోచించవద్దు. అష్టకష్టాలుపడైనా నిన్ను చదివించడమే నా ధ్యేయం." అని చెప్పింది. తల్లి చెప్పిన అనురాగభరితమైన ఈ మాటలు బొంబాయిలో చదివినంతకాలం శ్రీరాములు చెవిలో మారుమ్రోగుతూ వుండేవి. కష్టపడి చదివి విద్యలో విజయం సాధించి మాతృ రుణం తీర్చడమే తన జీవిత ధ్యేయంగా భావించాడు శ్రీరాములు (3)

---

1) కె.జి. రాజులతో చర్చ. ది. 15-12-1974.

2) పి. రంగయ్యతో జరిపిన సమావేశం. 1974 నవంబర్ 11, 12 తేదీలు.

3) పి. రంగయ్య గారితో సమావేశంలో. 1994 డిసెంబరు 11, 12 తేదీలు.

బొంబాయిలోని విక్టోరియా జూబిలీ టెక్నికల్ ఇనిస్టిట్యూట్‌లో టి. బి. బి. యస్. గుప్త అనే విద్యార్థి ఉన్నాడు. అతని సహాయముతో శ్రీరాములు శానిటరీ ఇంజనీరింగు డిప్లొమా కోర్సులో సీటు సంపాదించాడు. ఆ కోర్సు నాల్గు సంవత్సరాలు చదవాలి. బొంబాయి వంటి మహానగరంలో ఎంత పొదుపుగా ఖర్చు పెట్టినప్పటికి తల్లి పంపే డబ్బు శ్రీరాములుకు చాల లేదు. అందువల్ల మద్రాసులోని శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవస్థాం ఛారిటీస్, పప్పిబెట్టి రాఘవయ్య ఛారిటీస్, అతింధులుబెట్టి ఛారిటీస్ మొదలైన ధార్మిక సంస్థల సహాయాన్ని అతడు పొందవలసివచ్చింది. బొంబాయిలోని వసతి గృహంలో వి.యమ్. పట్టాభిరామగుప్త, కంచర్ల కనకరాజు, కె. గోవిందరాజులు, డి. బలరాం మొదలగు మిత్రులతో శ్రీరాములు కలిసివున్నాడు. శ్రీరాములు చదివే ఇనిస్టిట్యూట్ బొంబాయిలోని ప్రముఖ పారిశ్రామిక వేత్తలు స్థాపించారు. ఆ సంస్థలో ఆంగ్లేయులు ప్రధానాచార్యులుగా ఉండి సంస్థకు కీర్తి ప్రతిష్టలు సాధించారు. దాసన్, టర్నర్ ప్రధానోపన్యాసకులుగా వున్న రోజుల్లో క్రమశిక్షణకు నైతిక విలువలకు కళాశాల నిలయమైంది. టర్నర్ పరిపాలనా దక్షతలోనేగాక బోధనలో కూడా సమర్థుడే. ఆయన ఉత్తమ విద్యార్థిని ప్రశంసించడానికిగానీ తప్పు చేసిన విద్యార్థిని దండించడంలో గాని సంకోచించేవాడు కాదు. అందువల్లే ఆయనంటే విద్యార్థులకు భయము భక్తీ వుండేవి. అదే కళాశాలలో కన్నింగ్ హమ్ అనే ఆంగ్లేయుడు పనిచేస్తున్నాడు. అతనితో శ్రీరాములుకు సాన్నిహిత్యం ఏర్పడింది విద్యాభివృద్ధి విషయములో అతని సలహాలను శ్రీరాములు క్రమం తప్పక పాటించేవాడు ఆ కళాశాలలోని ఆంగ్ల దేశీయులైన అధ్యాపకులు పొట్టి శ్రీరాములును "పి. యప్. గుప్త" అని ముద్దుగా పిలిచేవాళ్లు. (1)

పొట్టి శ్రీరాముల జీవితాన్ని ప్రభావితం చేసిన మరొక మహావ్యక్తి మహాత్మాగాంధి. విద్యార్థి దశలోనే శ్రీరాములు దేశరాజకీయ పరిస్థితులను, రాజకీయ నాయకుల కార్యకలాపాలను నిశితంగా పరిశీలించేవాడు. నాటి రాజకీయ నాయకులందరికంటే గాంధీజీ పట్ల ప్రత్యేక అభిమానాన్ని పెంచుకున్నాడు. గాంధీజీ ఆశయాలమా సిద్ధాంతాలనూ సదవగాహన చేసుకొన్నాడు. వాటిని ఆచరణ యోగ్యం

1) జి. సూర్యనారాయణ, ఆంధ్రజ్యోతి అమరజ్యోతి, గాంధీ సాహిత్య ప్రచురణాలయం హైదరాబాద్. తొలికూర్పు. 1980. పు. 10.

చేయడానికి హృదయ పూర్వకంగా ప్రయత్నం చేశాడు. (1) గాంధీజీ సాహిత్యాని శ్రద్ధగా చదివాడు. మహాత్ముడు నడిపిన 'యంగ్ ఇండియా' అనే ఆంగ్ల పత్రిక, నవ జీవన' అనే గుజరాతీ పత్రికలను నిత్యమూ పఠించేవాడు. శ్రీరాములు బొంబాయిలో చదివేరోజుల్లో గాంధీజీ ప్రారంభించిన స్వాతంత్రోద్యమం ముమ్మరంగా కొనసాగుతూ విద్యార్థిలోకాన్ని అమితంగా ఆకర్షించింది. శ్రీరాములు కూడా చదువుకు స్వస్తి చెప్పి స్వతంత్ర సమరంలో కాలుపెట్టడానికి సిద్ధపడ్డాడు. కానీ ఆప్తబంధువుల, సన్నిహితుల సలహా మేరకు ఉద్యమంలో పాల్గొనుటకు శానిటరీ ఇంజనీరింగు డిప్లొమా కోర్సు పూర్తి చేశాడు (2)

శ్రీరాములు డిప్లొమా కోర్సు చివరి సంవత్సరంలో ఉన్నాడు. అప్పుడే అతని వివాహం నిశ్చయమైంది. నెల్లూరు జిల్లా దర్శి తాలూకా మారెళ్ల గ్రామవాసి గునుపూటి నరసయ్య సెట్టి శ్రీరాములు మేనమామ. ఆయన కుమార్తె సుబ్బమ్మ ఉరఫ్ సీతమ్మను శ్రీరాములు వివాహమాడాలని పట్టు పట్టాడు. సీతమ్మ సన్నగా నల్లగా సాధారణ రూపురేఖలతో వుంటుంది. ఆమె నిరక్షరాసి. అయినా సనాతన సంప్రదాయాలను పాటించడంలో శ్రద్ధవహించేది. శ్రీరాములు ఉన్నత విద్యాభ్యాసం చేస్తుండడంవల్ల ఇతర కన్యల తల్లిదండ్రులు అధికంగా కట్నము ఇస్తామని ఆశ చూపించారు. కానీ శ్రీరాములు తల్లి అభిమతాన్ని అనుసరించాలనుకున్నాడు. ఆర్థికంగా చితికిపోయిన మేనమామను ఆదుకోవాలనుకున్నాడు. వరదక్షిణ ప్రమేయము లేకుండా సీతమ్మను వివాహ మాడాలని నిశ్చయించాడు. (3) పెళ్లి ఖర్చులకోసం మద్రాసులోని కలవల కన్నయ్యచెట్టి ఛారిటీస్ అనే ధార్మిక సంస్థ ఆర్థిక సహాయాన్ని అందచేయడానికి సిద్ధపడింది. తన వివాహం అతి నిరాడంబరంగా జరగాలని నిశ్చయించిన శ్రీరాములు వెంటనే ఆ ధార్మిక సంస్థ చేయదలచిన ఆర్థిక సహాయాన్ని సవినయంగా నిరాకరించాడు. అందువల్ల ఆయన వివాహం అతి నిరాడంబరంగా జరిగింది. అందువల్ల ఆయన జీవితాంతం నిరాడంబరత్వాన్ని పాటించాడు.

---

1) యన్.ఆర్. గుప్తాగారితో సంభాషణ. 1975 జూన్ 9 నుండి 21 వరకు.

2) యన్.ఆర్. గుప్తాగారితో సంభాషణ. ది. 9 నుండి 21 జూన్ 1975.

3) పి. రంగయ్య గారితో సమావేశంలో 11 నుండి 12 నవంబరు 1974.

1924లో శానిటరీ ఇంజనీరింగు పూర్తయింది. వెంటనే శ్రీరాములు మద్రాసు తిరిగి వచ్చాడు. అక్కడే ఉద్యోగం సంపాదించి స్థిరపడ ప్రయత్నించసాగాడు. ఆయనకు పరిచితమైన మునిసిపల్ రెవిన్యూ అధికారి వున్నాడు. ఆయనను కలిసి ఉద్యోగం ఇవ్వమని అర్థించాడు ఆయన శ్రీరాములు పరిస్థితికి సానుభూతి చూపించి చిన్న ఉద్యోగం ఇప్పించగలనన్నాడు. నెలకు 45 రూపాయలు జీతం. తక్కువ జీతం అయినందువల్ల ఆ ఉద్యోగం తన విద్యార్హతలకు తగనందువల్ల శ్రీరాములు మరొక ఉద్యోగం చూసుకోవాలనుకున్నాడు. బొంబాయి వెళితే తన విద్యార్హతలకు తగిన ఉద్యోగం లభిస్తుందని మిత్రులు సూచించారు. వెంటనే శ్రీరాములు బొంబాయి వెళ్లాడు. (1) అక్కడ తన మిత్రుడు గోవిందరాజులు ఇంట్లో బసచేస్తూ ఉద్యోగ ప్రయత్నాలు చేయసాగాడు. (2) ఒకటి రెండు నెలల్లోనే శ్రీరాములుకు గ్రేట్ ఇండియా పెనిన్సులర్ రైల్వేలో అసిస్టెంట్ ప్లంబర్ ఉద్యోగం లభించింది (కొళాయి గొట్టాలు బాగుచేసేపని) ఆ సంస్థలోనే ప్లంబర్‌గా పనిచేస్తున్న గోవా దేశపు క్రైస్తవుడు సమూన్ సిఫారసుపైన ఈ ఉద్యోగము లభించింది. జీతభత్యాలన్నీ కలిసి శ్రీరాములుకు నెలకు రూ. 130/- లు లభించేవి. పరేల్‌లోని ఆర్.కె. బిల్డింగ్స్ ఉద్యోగ కేంద్రంగా కల్యాణ్ బొంబాయి స్టేషన్లమధ్య అసిస్టెంటు ప్లంబర్‌గా శ్రీరాములు తన ఉద్యోగ విధులను ప్రారంభించాడు

పొట్టి శ్రీరాములు విధి నిర్వహణలో నీతి నిజాయితీలతో ప్రవర్తించేవాడు. ఉద్యోగంలో చేరిన తొలి రోజుల్లోనే నైతిక విలువలతో కూడిన జీవిత వైశిష్ట్యాన్నీ స్వార్థపూరిత జీవిత వైభ్యాన్నీ గురించి తోటి ఉద్యోగులతో నిరంతరం చర్చించేవాడు. పెద్దలయెడ వినయ విధేయతలు ప్రదర్శించాలనీ స్వచ్ఛంద జీవనం గడపాలని తహతహ లాడేవాడు. ఆయన ధైర్యం, పట్టుదల, నిగ్రహశక్తి మున్నగు గుణాలు మిత్రుల ప్రశంసలు పొందేవి విధి నిర్వహణలో ఎటువంటి వత్తుడులకూ ఆయన లొంగలేదు. శ్రీరాములు చెప్పే ప్రతి విషయము మిత్రులకు నూతనంగా, ఆకర్షణీయముగా వుండేది. శ్రీరాములు పై అధికారి సమూన్ అవినీతిపరుడు. అందుచేత అతడు నిజాయితీ పరుడైన శ్రీరాములును చూసి జంకవలసివచ్చేది. (3)

---

1) 1974 డిశంబర్ 15న కె.జి. రాజులుగారితో సంభాషణ.

2) పి. రంగయ్యగారితో సంభాషణ ది. 11 మరియు 12 నవంబర్ 1974.

3) 1974 నవంబర్ 11, 12 తేదీలలో పి. రంగయ్యగారితో సమావేశం.

పై అధికారిలా శ్రీరాములు స్వలాభాపేక్షకు ఏ మాత్రము అవకాశమిచ్చినా వేలకువేలు సంపాదించి వుండేవాడు. పై పదవులు లభించి వుండేవి.

పాట్టి శ్రీరాములు వైవాహిక జీవితంకూడా సుఖప్రదమైంది కాదు. మొదటినుండీ అతడు ఎన్నో చిక్కులనూ, ఇబ్బందులనూ ఎదుర్కోవలసి వచ్చింది. తన భార్యను ప్రాణప్రదంగా ప్రేమించేవాడు. గృహస్థ జీవితం ఆనందదాయకం కావాలని ఆకాంక్షించేవాడు. తానొకటి తలిస్తే దైవమొకటి తలచింది సీతమ్మకు బొంబాయి నగర వాతావరణం సరిపడలేదు. ఆమె తరచుగా రక్త విరేచనాలతో బాధపడేది. అందుచేత శ్రీరాములు ఉద్యోగ నిర్వహణతోపాటు గృహకృత్యాలుకూడా చూడవలసివచ్చేది. ఇంగ్లీషు మందులంటే ఆమెకు సరిపడదు. అందువల్ల ఆమె కోరిక మేరకు శ్రీరాములు అనేక కషాయాలు కాచి యిచ్చేవాడు. ఎన్ని ఇబ్బందులు పడినప్పటికీ ఆమెపట్ల ఏమాత్రం విసుగు చూపేవాడు కాదు.

శ్రీరాములులాంటి చిన్న ఉద్యోగి బొంబాయి లాంటి మహా నగరంలో జీవించడమే కష్టం. పైగా తనను అపురూపంగా పెంచిన తల్లిని వృద్ధాప్యంలో ఆదుకోవడం తన ప్రధాన కర్తవ్యంగా భావించాడు. సరిగ్గా ఇదే సమయంలో శ్రీరాములు తమ్ముడు రంగయ్య డాక్టరు కోర్సు చదువుతున్నాడు. మేనల్లుడు నరసింహగుప్తకూడా పాఠశాలకు వెళుతున్నాడు. ఈ పరిస్థితుల్లో శ్రీరాములు తన కొద్దిపాటి జీతంలోనే కొంత తల్లికి పంపవలసి వచ్చింది. భార్య అనారోగ్యంతో వున్నా తన ఖర్చులకు 80 రూపాయలు వుంచుకొని మిగతా పైకం తల్లికి పంపేవాడు (1) ఐనా ఆయన కష్టాలు తీరలేదు. తల్లి మహాలక్ష్మమ్మ వృద్ధాప్యం కారణంగా తరచుగా అస్వస్థురాలయ్యేది. ఎన్ని మందులు వాడినా ప్రయోజనం కనిపించనేలేదు. ఆమె కొన్నాళ్లు ఉదరకోశ వ్యాధితో బాధపడి కృషించింది. చివరకు 1928లో తన భౌతిక దేహాన్ని చాలించింది. ఆమె మరణం శ్రీరాములు కుటుంబానికి విద్యుద్ఘాతమైంది. ఆ కుటుంబ సభ్యులు నిరాశా నిస్పృహలకు గురై నిస్సహాయులయ్యారు. ఆమె తరువాత కుటుంబానికి పెద్ద దిక్కైన శ్రీరాములు తల్లి మరణానికి బాధపడుతూనే కుటుంబ సభ్యులను ఓదార్చ వలసి వచ్చింది.

---

1) పి. రంగయ్యగారు చెప్పినది. 1974 నవంబర్ 11, 12 తేదీలు.

మహాలక్ష్మమ్మ మరణించడంతో పప్పుధాన్యముల వ్యాపారం నిర్వహించే బాధ్యత ఆమె పెద్ద కోడలు చెంచమ్మపై బడింది. చెంచమ్మ ఒంటరిగా ఈ వ్యాపారాన్ని నిర్వహించలేదని భావించాడు శ్రీరాములు. వెంటనే వ్యాపారాన్ని మూసివేయాలని సూచించాడు. నడుస్తున్న వ్యాపారాన్ని నిలపడం నష్టదాయకమని, కొనసాగించడమే శ్రేష్టమనీ చెంచమ్మ వాదించింది. కొందరు ఖాతాదారులు, సన్నిహితులు వ్యాపారం సాగించడం మేలనీ అందుకు తమ సహకార ముంటుందనీ ప్రోత్సహించారు. ఒకవేళ వ్యాపారంలో ఏదైనా పొరపాటు జరిగితే అది తనతల్లి పేరు ప్రతిష్టలకు భంగకరమవుతుందని శ్రీరాములు భావించాడు. అందువల్ల ఎవరెంతచెప్పినా వ్యాపారాన్ని విరమించడానికే నిశ్చయించాడు. వెంటనే నిల్వలన్నింటినీ అమ్మివేసి కొన్ని బాకీలు తీర్చాడు. మిగతా బాకీలను తీర్చే బాధ్యత తనదేనని బాకీదారు లందరినీ ఒప్పించాడు. ఐతే బాకీలన్నింటినీ ఒకేమారు తీర్చడం తనకు సాధ్యపడదనీ నెలసరి వాయిదాల ప్రకారం చెల్లించే అవకాశ మివ్వవలసిందనీ అప్పులవాళ్లను అర్థించాడు. వాళ్లకు శ్రీరాములు కుటుంబ సంప్రదాయము నిజాయితీ తెలుసు. అందువల్ల సహృదయతతో అంగీకరించారు. బాకీలను తీర్చే బాధ్యతతోపాటు తమ్ముడ్ని డాక్టరు కోర్సు పూర్తి చేయించే బాధ్యతను కూడా స్వీకరించాడు. (1)

శ్రీరాములు ఎంతో కష్టపడి కొంత కాలానికి చాలావరకు బాకీలను తీర్చ గలిగాడు. ఆయన నిజాయితీని గుర్తించిన అప్పులవాళ్ళు మిగతా కొద్దిపైకం యివ్వకపోయినా ఫరవాలేదులే అని చెప్పారు. అయినా శ్రీరాములు వాళ్ల మాటలను అంగీకరించలేదు. తన నిత్యావసరాలను సైతం మానుకొని బాకీలన్నింటిని పూర్తిగా తీర్చివేశాడు. ఇలా శ్రీరాములు తల్లి ఋణాన్ని తీర్చుకొని కుటుంబ గౌరవాన్ని కాపాడాడు. (2)

మహాభారతంలో కర్ణుడు అనేక శాపాలకు గురై అష్టకష్టాలు అనుభ వించాడు. అతణ్ణి ఆదర్శంగా భావించిన శ్రీరాములుకూడా అలాగే కష్టపడ్డాడు గర్భవతియైన అతని భార్య సీతమ్మ దగ్గు జ్వరాలతో బాధపడసాగింది. శ్రీరాములు స్నేహితుడు డా॥ ఎస్.ఎస్. రావు ఆమె మలేరియా వ్యాధితో బాధపడుతున్నదనుకొని

---

1) ది. 1975 జూన్ 9 నుండి 21 వరకు యన్.కె. గుప్తా చెప్పినది.

2) పి. రంగయ్యగారు, 1974 నవంబర్ 11, 12 తేదీలలో చెప్పినది.

4)

తగిన చికిత్స చేశాడు. కానీ ప్రసవానంతరం ఆమెకు క్షయవ్యాధికూడా వుందని నిర్ధారణైంది. సోమవారంనాడు ఆమె ప్రసవించిన మగబిడ్డ ఐదురోజులు మాత్రం జీవించి శుక్రవారంనాడు మరణించాడు. తరువాత సీతమ్మ ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. పుట్టింటికి వెళ్లాలని సీతమ్మ కోరింది. ఆమెతో బయలుదేరి వస్తూ మద్రాసులో దిగాడు. అక్కడ డా॥ పురుషోత్తమ్‌గారితో వైద్య పరీక్ష చేయించాడు. ఆమెకు ఊపిరితిత్తులు పూర్తిగా చెడిపోయాయని ఆమె బ్రతకడం కష్టమని డాక్టరు చెప్పాడు. వెంటనే ఆమెను పుట్టింటికి తీసుకువెళ్లాడు. జన్మస్థలమైన మూరెళ్లలోనే ఆమె 1929లో భర్తను ఏకాకినిచేసి స్వర్గస్తురాలైంది. (1) ఇలా ఒక్క సంవత్సరంలోనే శ్రీరాములు తల్లిని భార్యా బిడ్డలను కోల్పోయాడు. తగిలిన చోటనే దెబ్బ తగిలినట్లు ఇలా వెంటవెంట తనవారు దూరం కావటంతో ఆయన హృదయం నిరాశా, నిస్పృహలకు నిలయమైంది. అంతా క్షణికమనే వేదాంత దోరణి అతనిలో మొదలయింది. (2)

గాలికి వాన తోడైనట్లు ఈ కష్టాలకు తోడు పై అధికారి సనూన్‌కూడా తన దుశ్చర్యలతో శ్రీరాములును బాధించసాగాడు. తనకు ఉద్యోగ సాధనకు తోడ్పడిన సనూన్ అంటే శ్రీరాములుకు మొదట్లో మిక్కిలి గౌరవముండేది. అయితే అవినీతిపరుడైన సనూన్ బద్ధకంతో దర్పం ప్రదర్శించేవాడు. నిజాయితీ పరుడైన శ్రీరాములు సనూన్ స్వార్థపూరిత నిరంకుశత్వాన్ని భరించలేకపోయాడు. అతని అడుగులకు మడుగులు వత్తలేకపోయాడు. సనూన్ స్వార్థపరత్వానికీ శ్రీరాములు విశిష్టతత్వానికీ రాజీ కుదరలేదు. ఆ స్థితి శ్రీరాములు ఉద్యోగానికే సవాలుగా పరిణమించింది. (3)

1930వ సంవత్సరం భారతీయ జాతీయోద్యమ చరిత్రలోనే మరపురానిది. ఈ సంవత్సరమే జాతిపిత గాంధీజీ ఉప్పు సత్యాగ్రహాన్ని ప్రారంభించాడు.

---

1) పి. రంగయ్యగారితో సమావేశం. ది. 1974 11, 12 తేదీలు.

2) కె.వి. నారాయణరావుగారి "ది ఎమర్జెన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్" అనే పరిశోధనా గ్రంథంలోనిది. పు. 330.

3) యన్.ఆర్. గుప్తాగారితో సమావేశం. 1975 జూన్ 9 నుండి 21 వరకు

ఈ ఉద్యమం కోట్లాది భారతీయుల నాకర్షించింది. సరిగ్గా ఇదే సమయంలో శ్రీరాములు వ్యక్తిగత బాధలకు లోనైయున్నాడు. జీవితం మీద విరక్తిచెంది మనశ్శాంతికోసం పరితపించుచున్నాడు. స్వార్థ ప్రయోజనాల నాశించి అవినీతి పరుడైన అధికారిని సేవించి ఉద్యోగం నిలుపుకోవడమా ? లేక దేశ ప్రయోజనాల కోసం స్వార్థ త్యాగం చేసి దేశసేవకోసం ఉద్యోగం వదలుకోవడమా ? అనే సంఘర్షణ శ్రీరాములులో కలిగింది. చివరకు త్యాగమే స్వార్థాన్ని జయించింది. వెంటనే శ్రీరాములు ఉద్యోగాన్ని వదలి దేశసేవలో పాల్గొనడానికి నిశ్చయించు కున్నాడు. (1)



1) యస్.ఆర్. గుప్తాగారితో సంభాషణ. జూన్ 9 నుండి 21 వరకు 1975.

# ద్వితీయాధ్యాయం

## గాంధీజీతో పొట్టి శ్రీరాములు సహచర్యం

ప్రసిద్ధ భారతీయ రచయిత నరేంద్రనాథగుప్త నాటి భారత జాతీయోద్యమాన్ని ఇలా విశ్లేషించాడు. గాంధీజీ నడిపిన జాతీయోద్యమ పోరాట ఫలితంగా నివురుగప్పిన నిప్పులాంటి మేధావులెందరో ఒక్కొక్కరే వెలుగులోకొచ్చారు. వీళ్లంతా ప్రజ్ఞాప్రాభవంగలవాళ్లే. విశ్వవిఖ్యాతి గడించగల సమర్థులే. ప్రవక్తలాంటి గాంధీజీకి వీళ్లు అనుయాయులయ్యారు. స్వతంత్ర్య సంగ్రామంలో దూకడానికి నడుంకట్టారు.

భారత జాతీయోద్యమాన్ని స్థూలంగా రెండుదశలుగా విభజింపవచ్చు. గాంధీజీ నాయకత్వం వహించడానికి పూర్వరంగం ప్రప్రథమ దశగాను ఆయన నేతృత్వం వహించినది రెండవదశగాను చెప్పవచ్చు. ప్రథమ దశలో కాంగ్రెస్ నాయకులు కేవలం ఉపన్యాసాలద్వారా అలజడి కలిగించారు. స్వరాజ్యం మా జన్మహక్కని నినాదాలు చేశారు. ప్రభుత్వ చర్యలను తీవ్రంగా విమర్శించారు. రాజ్యాంగంలో మార్పులను పరిపాలనా సంస్కరణలు కోరడం వరకే వాళ్ల ఉద్యమం పరిమితమైంది. ఈ దశలో కొంతమంది అసాధారణ వ్యక్తులు మాత్రమే కార్యరంగంలోకి దిగి కష్టాలు అనుభవించడానికి సిద్ధపడ్డారు. సామాన్య ప్రజల్లో దేశభక్తివున్నా నాయకుల చర్యలను గమనిస్తూ ఉద్యమానికి దూరంగావున్నారు. ఈ స్థితిగతుల్లో గాంధీజీ రంగంలోకి ప్రవేశించాడు. లేకపోతే ఈ ఉద్యమం నిశ్శబ్దంగా వుండేది. దీనికితోడు గాంధీజీ ఆధ్యాత్మిక దృక్పథం, నిరాడంబరత్వం అకుంఠిత కార్యదీక్షతో నాయకత్వం వహించడంతో ఉద్యమం కొత్తమలుపు తిరిగింది. ఉద్యమంలో దుమకడానికి ఉద్యుక్తులై వున్న ఎందరో దేశభక్తులకు గాంధీజీ నాయకత్వం ప్రేరణ కలిగించింది. ఆనాటినుంచి జాతీయోద్యమం పటిష్టమైన పరాకాష్ట నందుకొంది. స్వాతంత్రోద్యమ బలిపీఠమెక్కడానికి తమ సర్వస్వాన్ని సమర్పించడానికి స్త్రీ పురుష భేధంలేకుండా పోటీపడి ముందుకు వచ్చారు.

ప్రజల్లో పిరికితనం తొలగి జైళ్లంటే భయం తీరింది. ఆత్మార్పణ చేయాలనే భావం పరవళ్లు తొక్కింది. ఆహింసాత్మక శాంతి పథంలో తమ లక్ష్యసాధన జరుగుతుందనే ప్రగాఢ విశ్వాసం ప్రజల్లో ప్రబలింది." (1)

గాంధీజీచేత ప్రభావితుడైన దేశభక్తుల్లో పొట్టి శ్రీరాములు అగ్రగామి. భారత జాతీయోద్యమ చరిత్రలో 1930వ సంత్సరం ఒక ప్రత్యేకత సాధించు కొంది. ఈ యేడే గాంధీజీ బ్రిటిష్ ప్రభుత్వమునకు వ్యతిరేకంగా ఉప్పు సత్యాగ్రహాన్ని ప్రారంభించాడు. ఈ ఉద్యమం ఆంగ్ల ప్రభుత్వ దమన నీతిపై గట్టి దెబ్బ తీసింది. ధనికులతోపాటు దరిద్రులు కూడా ఉప్పు పన్ను వ్యతిరేకిస్తూ గాంధీజీ నిర్వహించిన దండి సత్యాగ్రహం "ప్రాతినిధ్యం లేనిదే పన్నులు చెల్లించరాదు" అనే చారిత్రాత్మక సిద్ధాంతానికి ప్రతీక అయింది. ఆందోళనను ఉధృతం చేసి ఆంగ్లప్రభుత్వాని స్తంభింపచేయడం మేలని భావించాడు గాంధీజీ. వెంటనే తమతమ పదవులకు రాజీనామా చేసి సంపూర్ణ స్వరాజ్యసమరంలో పాల్గొనవలసిందని గాంధీజీ ప్రభుత్వోద్యోగులకు పిలుపునిచ్చాడు. ఆ పిలుపు శంఖారావమై పొట్టి శ్రీరాముల హృదయములో ప్రతిధ్వనించింది. వెంటనే అతడు గాంధీజీతో సమావేశం కావడానికి బయలుదేరాడు. ఆసమయములో దండి సత్యాగ్రహ నిమిత్తం గాంధీజీ సూరత్ నగరంలో వున్నాడు. అక్కడ 1930 ఏప్రియల్ 1వ తేదీన శ్రీరాములు గాంధీజీని కలిశాడు తన జీవిత సర్వస్వాన్ని మానవసేవలో గడిపేందుకు అనుజ్ఞ యివ్వవలసిందిగా గాంధీజీని కోరాడు అతడు చెప్పిందంతా శ్రద్ధగా విన్నాడు బాపూజీ. ప్రస్తుతానికి సబర్మతీ ఆశ్రమంలో చేరవలసిందిగా సలహాయిచ్చాడు. (2) ఆత్మబలిదానం ద్వారా అమరజీవికానున్న శ్రీరాములుకు యిలా గాంధీజీ తొలిపరిచయమేర్పడింది. ఈ పరిచయం వీడని బంధమై ఆయన జీవితాంతం కొనసాగింది.

గాంధీజీ ఉపదేశంతో ప్రభావితుడైన శ్రీరాములు బొంబాయికి తిరిగివచ్చాడు. తన మిత్రులను సహ్రతులను కలిశాడు తనకు స్వతంత్ర సమరంలో

---

1) Quoted in "Leaders of the Nationalist Movement" by V. D. Mahajan.
Sterling Publishers, New Delhi p p. 202, 203.

2) పి రంగయ్యతో సమావేశంలో ది. 11 మరియు 12 నవంబర్ 1974.

ప్రవేశించాలని వుందని చెప్పాడు. ఆయన ఆప్తమిత్రులు డా॥ యస్.యస్. రావు, ఎ. కె. రావు, ఈ. యల్. నరసింహం, డి. బలరాం, కె. గోవిందరాజులు జి.యస్. సెట్టి మున్నగు వారంతా తొందరపడి ఏ నిర్ణయమూ తీసుకోవద్దని హెచ్చరించారు. ఉజ్వల భవిష్యత్తును ప్రసాదించే కేంద్ర ప్రభుత్వ ఉద్యోగాన్ని వదలడం శ్రేయోదాయకం కాదన్నారు. పునర్వివాహం చేసుకొని గృహస్థ జీవితానికి అంకితం కావడం అన్ని విధాలా శ్రేయస్కరమని నచ్చజెప్పడానికి ప్రయత్నించారు. కానీ పొట్టి శ్రీరాములు కార్యదీక్ష ధృఢ నిశ్చయం కలవాడు. తనకు మంచిదని తోచిన ఏ పనినైనా నిస్సంకోచంగా చేసేవాడు. ఎవరెంత నిరుత్సాహపరిచిన లొంగేవాడు కాడు. స్నేహితుల సంహాలను సవినయంగా తిరస్కరిస్తూనే ఉద్యోగ విరమణకు సంసిద్ధుడయ్యాడు. ఉద్యోగ విరమణ విషయంముందుగా ప్రభుత్వానికి తెలియజేయాలి. అలా చేయడం వల్ల పూర్తి ప్రావిడెంట్‌ఫండు లభిస్తుందని మిత్రులు సలహా చెప్పారు. ప్రావిడెంటుఫండు రెండువేల రూపాయలు వస్తుంది. ఇలాంటి స్వల్ప ప్రయోజనాలకు లొంగేవాడు కాడు శ్రీరాములు. కాలహరణంవల్ల కార్యదీక్షకు భంగం వాటిల్లుతుందని శ్రీరాములు భావించాడు. వెంటనే ఉద్యోగానికి రాజీనామా చేశాడు. ఆప్త మిత్రుడైన ఎ కె. రావుకు ఇంటి తాళాలు అప్పజెప్పాడు. ఇంట్లో వస్తువులన్ని పేదలకు పంచి యివ్వవలసిందని కోరాడు. అప్పుడు ఆఫీసునుండి ఆయనకు రూ. 700/-లు లభించాయి. ఆ ధనంతో శ్రీరాములు 1930 ఏప్రియల్ 16వ తేదీన సబర్మతీ ఆశ్రమానికి వెళ్లాడు (1)

పవిత్రమైన సబర్మతీ ఆశ్రమ వాతావరణం, ఉదాత్తమైన గాంధీజీ ఉపదేశాలు శ్రీరాములు జీవితంలో విప్లవాత్మకమైన మార్పులను తెచ్చాయి. అక్కడ ఆయన గడిపిన మూడు సంవత్సరాల కాలం అతని జీవిత గమ్యాన్నే మార్చివేసింది. గాంధీజీ సహచర్యం ఆయనకు ధైర్యస్థైర్యాలను కలిగించింది. అధర్మాన్ని ధర్మంతో జయించడం, పరిస్థితుల ప్రాబల్యానికి బానిస కాకపోవడం మొదలైన ఉత్తమ మానవతా భావాలు శ్రీరాములలో వేళ్లూనునాయి. శ్రీరాములు అనతికాలం లోనే బాపూజీ శిష్యకోటిలో ప్రథమస్థానం సంపాదించాడు. శ్రీరాములు త్యాగమయ జీవితాన్నిచూచి గాంధీజీ ముగ్ధుడయ్యాడు.

---

1) పి. రంగయ్యతో జరిపిన సంభాషణలో, 11 మరియు 12 నవంబర్ 1974.

మద్రాసు నగరంలో 1946లో దక్షిణ భారత హిందీ ప్రచారసభ రజతోత్సవాలు జరిగాయి. ఆ సభలకు గాంధీజీ అధ్యక్షత వహించాడు. అప్పుడు శ్రీ రాములు సంఘసేవా కార్యక్రమంలో నెల్లూరులో వున్నాడు. తాను సాధించిన కృషిని గాంధీజీకి నివేదించడానికి మద్రాసు వచ్చాడు. సభాస్థలికి చేరుకున్నాడు. ఆయన వేషం అతినిరాడంబరంగా వుంది. 'హరిజనోద్ధరణ' అనే నినాదంగల అట్టముక్క మెళ్లో వేళ్లాడుతుంది. నాటి సభను మోటూరు సత్యనారాయణ, హరిహరశాస్త్రి ప్రభృతులు నిర్వహిస్తున్నారు. వాళ్లు శ్రీరాములును ఒక సామాన్య వ్యక్తిగా భావించారు. గాంధీజీని కలవాలని ఆయన అడిగితే అందుకు నిరాకరించారు గత్యంతరం లేక శ్రీరాములు సభాప్రాంగణంలో అటూ ఇటూ తిరగసాగాడు. అది గమనించిన గాంధీజీ వెంటనే శ్రీరాములును సభావేదికవద్దకు పిలిపించుకున్నాడు శ్రీరాములుకు జరిగిన అపకార్యానికి ఎంతో బాధపడ్డాడు. సభలో శ్రీరాములును గురించి ప్రసంగిస్తూ "పొట్టి శ్రీరాములువంటి నిస్వార్థపరులైన దేశభక్తులు పదిపన్నెండుమంది నా అనుచరులుగా వుంటే స్వరాజ్యాన్ని ఏనాడో సాధించి వుండేవాణ్ణి" అని శ్రీరాములపై తనకుగల ప్రగాఢ విశ్వాసాన్ని వ్యక్తంచేశాడు. (1)

సబర్మతీ ఆశ్రమవాసులు గాంధీగారి ఏకాదశ సూత్రప్రవర్తనా నియమావళిని విధిగా పాటించాలి. 1) సత్యం 2) అహింస 3) బ్రహ్మచర్యం 4) స్వార్జితం లేకుండడం 5) ఇంద్రియనిగ్రహం 6) దొంగతనం చేయకుండడం 7) నిర్భయత్వం 8) అస్పృశ్యతా నివారణ 9) స్వయంకృషిపై జీవించడం 10) సర్వమత సమానత్వం 11) స్వదేశీ వస్తువులనే వాడడం అనేవి పదకొండు నియమాలు. ఈ ఆశయాల ఆధారంగానే గాంధీజీ దేశమంతటా ఆశ్రమాలు స్థాపించాడు. అనేక కార్యక్రమాలు నిర్వహించాడు. సబర్మతీ ఆశ్రమంలో చేరే ప్రతివ్యక్తి ఈ నియమోల్లంఘనం చేయనని ప్రమాణం చేయాలి. నియమబద్ధంగాని జీవితం లంగరులేని పడవలాంటిదని గాంధీజీ అభిప్రాయం. నియమ రహితుడైన వ్యక్తి అనుక్షణం ప్రలోభానికి గురయ్యే అవకాశం వుంది. (2)

---

1) Gupta, N. R. An article published, in the Deccan Chronicle, Hyderabad on 1st November, 1956 on the Eve of the formation of Andhra Pradesh

2) Anand T. Hingorani, in his preface to "My philosophy of life" by M K. Gandhi, Pearl publications.

కఠోర నియమ పాలనవల్ల వ్యక్తి పతనాన్ని తప్పించుకొంటాడు. నియమ పాలనవల్ల మానవుల్లో ధృడ నిశ్చయం, కార్యదీక్ష, సంపూర్ణ వ్యక్తిత్వం పెంపొందుతాయి. స్థిరత్వమే లేకుంటే భారతదేశ మనుగడకే ముప్పు వాటిల్లేది. సూర్య చంద్రాది గ్రహాలు నియమంగా సంచరిస్తున్నాయి. గృహగతులను బట్టే మన పంచాంగాలు గుణించబడుతున్నాయి. సూర్య చంద్రోదయాస్తమయాలను బట్టే కాలగతిని నిర్ణయించుకొంటున్నాము. ఇలాంటి స్థిరమైన ప్రకృతి న్యాయమే మానవులకు కూడా వర్తిస్తుంది.

మానవ జీవితత్వాన్ని గురించి గాంధీజీ వ్యక్తం చేసిన అభిప్రాయాలు పొట్టి శ్రీరాముల మనస్సుపై చెరగని ముద్ర వేశాయి. గాంధీజీ స్వానుభవ వేదాంత ప్రవచనాలు శ్రీరాములుకు జీవిత సత్యాలుగా అగుపించాయి. నిరంతర సత్యాన్వేషణా, జిజ్ఞాస ఆజన్మాంత కష్ట సహిష్ణుతాది గుణాల నలవరచుకొంటే సాధారణ వ్యక్తి కూడా గాంధీజీ సిద్ధాంతాలను ఆచరణయోగ్యం చేయగలడని శ్రీరాములు విశ్వసించాడు. ఈ అంశాన్ని శ్రీరాములు తన జీవిత కాలంలోనే ఋజువుచేశాడు.

శ్రీరాములు ప్రత్యేకాంధ్ర రాష్ట్రంకొరకు ఆమరణ నిరశనవ్రతం పూనాడు. 58 దినాల కఠోర వ్రతంతో అమరజీవి అయ్యాడు. ఈ సమయములో శ్రీరాముల నిరశన వ్రత దీక్షా పర్యవేక్షక వైద్య నిపుణుల సంఘాధ్యక్షుడు డా॥ కస్తూరి నారాయణమూర్తి యిలా చెప్పారు "నిరాహారదీక్షా సమయములో శ్రీరాములు శారీరక బాధలను ఏ మాత్రం లెక్కచేయలేదు. సర్వదా చిరునవ్వులు చిందిస్తూ ఉండేవాడు. తన చర్యలను ఎవరెంత విమర్శించినా దిగులుతో క్రుంగిపోయేవాడు కాదు. నిరంతరం ప్రశాంతంగా వుండేవాడు. పరిపూర్ణమైన మనోనిగ్రహం పాటించేవాడు. టెలిగ్రాములు, జాబులు, రాయబారాలు, సన్నిహిత మిత్రుల విజ్ఞప్తులు ఆయన ప్రాణప్రదంగా ప్రేమించే మనుమరాలి ప్రార్థనలు - యివేవీ ఆయన్ను కఠోర దీక్ష నుండి విరమింపచేయలేక పోయాయి. ఎవరెన్ని చెప్పినా లక్ష్య సాధనపట్ల అచంచల విశ్వాసం అతనిలో స్ఫురించేది. చరిత్రాత్మకమైన తన నిరశన వ్రతం గురించి ఎవరే విధంగా అనుకున్నప్పటికీ ఒక ఉన్నత లక్ష్యాన్ని సాధించగలననే ధృడ విశ్వాసం అతనిలో వ్యక్తమయ్యేది". (1)

1) Narayana Murthy, K. the editor and publisher of "Sri Potti Sreeramulu the martyr that fasted for 58 days to death" 1953, P. 48.

## సబర్మతీ ఆశ్రమవాసులు పాటించవలసిన 11 సూత్రాల ప్రవర్తనా నియమావళిని ఆచరణయోగ్యం చేయడానికి ఈ క్రింది కార్యక్రమాలు నిర్వహింపబడేవి :

**1. ప్రార్థన :** సబర్మతీ ఆశ్రమ కార్యక్రమాలు ఉదయం సామూహిక ప్రార్ధనా సమావేశంతో ప్రారంభింపబడి సాయంకాల ప్రార్థనా సమావేశంతో ముగుస్తాయి. నిత్యం ప్రాతఃకాల ప్రార్థన 4-15 ని.ల నుండి 4-45 ని ల వరకు జరుగుతుంది. సంధ్యవేళ 7 గంటలనుండి 7-30 ని.ల వరకు ప్రార్థన జరుగుతుంది. ఆశ్రమవాసు లందరూ ఆ ప్రార్థనా సమావేశాల్లో తప్పక పాల్గొనాలి సర్వం భగవదర్పణంచేసి ఆత్మశుద్ధి పొందడానికి ఈ ప్రార్ధనా సమావేశాలు ఉత్తమ సాధనాలుగా ఉద్దేశింపబడ్డాయి.

**2. పారిశుద్ధ్యం :** పారిశుద్ధ్యం కోసం బయటి వ్యక్తులను నియమించడం ఆశ్రమ నియమాలకు పూర్తిగా విరుద్ధం. అందుచేత ఆశ్రమ సభ్యులే వంతుల వారిగా ఈ విధులను నిర్వహించాలి. సాధారణంగా ఆశ్రమంలో కొత్తగా చేరినవారికి ఈ పని అప్పగించబడుతుంది. 9 అంగుళాల లోతున గుంతలను త్రవ్వి మల మూత్రాదులను అందులో విసర్జించి కప్పివేస్తారు అలా చేస్తే అది సారవంతమైన ఎరువుగా తయారవుతుంది. ఆశ్రమవాసులంతా నిర్ణీత స్థలాల్లోనే కాలకృత్యాలు తీర్చుకోవాలి. ఆశ్రమ ఆవరణాన్ని పరిశుభ్రంగా ఉంచటానికి అన్నివేళలా శ్రద్ధ వహించాలి.

**3. నూలు వడకటం :** ఆశ్రమంలో జరిగే ప్రధాన కార్యక్రమాల్లో నూలు వడకటం ఒకటి. ఆశ్రమవాసులంతా నూలువడకే కార్యక్రమాన్ని దేశసేవగా భావిస్తారు. నూలు వడకే విభాగంలో ఈ క్రిందిపనులు నిర్వహింపబడతాయి. 1) పత్తినుండి విత్తనాలు వేరుచేయడం 2) దూదిని శుభ్రపరచడం 3) నూలు వడకటం 4) బట్టలు నేయడం 5) బట్టలమీద అద్దకం వేయడం 6) రాట్నాలు, కదుళ్ళు మున్నగు పరికరాలను మరమ్మత్తు చేయడం.

**4. వ్యవసాయం :** ఖద్దరుబట్టలకు అవసరమైన పత్తిని ఉత్పత్తిచేయడం, పశుగ్రాసాన్ని సిద్ధంచేయడం ఆశ్రమవాసుల కవసరమైన పండ్లను కూరగాయలను పండించడం వ్యవసాయ విభాగంలోని ప్రధాన కార్యక్రమాలు.

**5) పాల ఉత్పత్తి :–** సబర్మతీ ఆశ్రమంలో పాల ఉత్పత్తి కేంద్రం వుంది. దీన్ని ఆదర్శవంతంగా తీర్చిదిద్దడానికి ప్రయత్నం జరిగింది. దీని నిర్వహణకు భారత గోరక్షణ సంఘం వారి ఆర్థిక సహాయం లభించింది. ఈ కేంద్రం గోరక్షణ సంఘం వారి ఆదేశాల మేరకు నడుచు కొనేది. అయినా యిది సబర్మతీ ఆశ్రమంలో అంతర్భాగంగా పరిగణింపబడింది.

**6) చర్మపరిశ్రమ :** సబర్మతీ ఆశ్రమంలో ఒక చర్మ పరిశ్రమ కేంద్రం కూడా వుంది. ఇది అఖిల భారత గోసంరక్షణ సంఘ నియామావళి ననుసరించే ఏర్పాటు చేయబడింది. మృత పశువుల చర్మాన్ని ఒలిచి శుద్ధిచేయడం ఈ విభాగంలోని ప్రధాన కార్యక్రమం. దీనికి అనుబంధంగా పాదరక్షోత్పత్తి కేంద్రం స్థాపించబడింది గోరక్షణ హిందువుల పవిత్ర కర్తవ్యంగా భావింపబడినప్పటికీ ఆచరణాత్మక కృషి జరగడం లేదు. పశుపోషణలో, వాటి పారిశుధ్యంలో తగినకృషి జరగనట్లయితే పశుసంపద క్రమంగా క్షీణించి పోతుందని గాంధీజీ భావించారు. అందుచేత క్షీరోత్పత్తి కేంద్రం, చర్మ పరిశ్రమ సబర్మతీ ఆశ్రమంలో భాగంగా స్థాపించబడ్డాయి.

**7) జాతీయ విద్య :** జాతీయ వికాసానుగుణమైన విద్యను ఆశ్రమంలో ప్రవేశపెట్టే ప్రయత్నం జరిగింది. మానసిక వికాసంతో పాటు శరీర సౌష్టవం పుస్తక పఠనంతో పాటు కష్టించి పనిచేసే మనస్తత్వం అలవరచుకొనే అవకాశం కల్పింపబడింది. ఆశ్రమ వాసుల నడవడికి సంబంధించిన ప్రతి సూక్ష్మాంశములోను అత్యంత శ్రద్ధ తీసుకోబడింది. అస్పృశ్యులైన బాలురకు ఉచితంగా విద్య నేర్పబడింది. సబర్మతీ ఆశ్రమం స్త్రీ పురుషులకు సమానావకాశాలు కల్పించడంలో శ్రద్ధ వహించింది. గుజరాతీ విద్యాపీఠం అంగీకరించిన నియమావళిని సబర్మతీ ఆశ్రమం కూడా అమలు జరిపింది.

**8. ఖాదీ పాఠశాల :** సబర్మతీ ఆశ్రమంలో ఒక సాంకేతిక పాఠశాల నెలకొల్ప బడింది. అఖిలభారత చేనేత పనివారి సంఘం దీనికి అధ్యక్షత వహించింది. ఈ పాఠశాల ఖాదీకి సంబంధించిన సాంకేతిక పరిజ్ఞానాన్ని బోధిస్తుంది. ఈ పాఠశాల పాఠ్య ప్రణాళిక ఇలా వుంటుంది.

21 వారాలు నూలు వడకడం.
7 వారాలు పత్తిని శుభ్రపరచడం.
2 వారాలు పత్తినుండి విత్తనాలు తొలగించడం.

వీటితోపాటు వడ్రంగం మొదలైన పనులు వుంటాయి. ఎన్ని కార్యక్రమాలు నిర్వహించినప్పటికీ ఆశ్రమవాసులు నియమాలను తు. చ. తప్పక పాటించేవారు. సబర్మతీ ఆశ్రమవాసుల దైనందిన కార్యక్రమాలిలా వుండేవి.

| | | | | |
|---|---|---|---|---|
| ఉదయం 4-00 | | గంటలకు | – | నిద్రలేవడం. |
| 4-15 | – | 4-45 | – | సామూహిక ప్రార్ధన. |
| 5-00 | – | 6-10 | – | వ్యాయామం - స్నానం. |
| 6-10 | – | 6-30 | – | అల్పాహారం. |
| 6-30 | – | 7-00 | – | స్త్రీల ప్రార్థనా సమావేశం. |
| 7-00 | – | 10-45 | – | ఆశ్రమ పారిశుద్ధ్యం ఇతర కార్యక్రమం |
| 10-45 | – | 11-15 | – | మధ్యాహ్న భోజనం. |
| 11-15 | – | 12-00 | – | విశ్రాంతి. |
| 12-00 | – | 4-30 | – | శ్రమదానం. |
| 5-30 | – | 6-30 | – | సాయంత్ర భోజనం. |
| 6-30 | – | 7-00 | – | విశ్రాంతి. |
| 7-00 | – | 7-30 | – | సామూహిక ప్రార్ధన. |
| 7-30 | – | 9-00 | – | వినోదం - విశ్రాంతి. |
| | – | 9-00 | – | నిద్రించడం. (1) |

ఆశ్రమవాసు లందరిలాగే శ్రీరాములు కూడా ఖాదీ పరిశ్రమలోని సాంకేతిక పరిజ్ఞానంలో ఆరితేరాడు. ఈ విషయంలో ఆశ్రమ కార్యదర్శి నారాయణదాస్ గాంధీ ఆశ్రమవాసి మగన్‌లాల్ గాంధీ శ్రీరాములుకు ఎంతో తోడ్పడ్డారు. (2) శ్రీరాములు వడ్రంగం, గోసంరక్షణ, పశు చర్మాన్ని శుభ్రపరచడం, పాదరక్షల తయారీ మున్నగు పనులు చేసేవాడు. ఈ ప్రత్యేక కార్యక్రమాలే కాకుండా విధులు

---

1) Gandhi, M. K. Ashram observances in action, Navajeevan publishing House, Ahmedabad, P.P. 116-123.

2) అభిలాష రచించిన "మన రథసారథులు" అను గ్రంథము నుండి

ఊడ్వడం, పిదిదీపాలు మూసెతో వెలిగించడం, రాత్రివేళ ఆశ్రమాన్ని కాపలా కాయడం, వంట చేయడం, పాత్రలు శుభ్రపరచడం, బావినీళ్ళు తోడడం, ఆశ్రమానికి కావలసిన సరుకులు కొనుక్కొని రావడం, ఆశ్రమ జమా ఖర్చులు చూడడం. మున్నగు కార్యక్రమాలను తన సహవ్రతులతో కలిసి చేసేవాడు. (1) ఆశ్రమవాసులు ధనం కన్నా కాలాన్ని విలువగా భావిస్తారు అందుచేత ఎవరు ఎప్పుడు ఏ పని చేసింది తెలియజేసే దిన చర్యను విధిగా వ్రాయవలసి వుంటుంది. వాళ్లంతా గాంధీజీ 11 సూత్రాల నియమావళిని క్రమంగా పాటిస్తూ గ్రామోద్ధరణకు కృషి చేయవలసి వుంటుంది. "ప్రతి వ్యక్తి స్వార్థ త్యాగం చేసి ప్రజా సేవకు అంకితం కావాలి. ప్రతిఫల రహితమైన సంపూర్ణ త్యాగానికి సిద్ధపడాలి. ఇటువంటి వ్యక్తి మాత్రమే నిజమైన ప్రజా సేవకుడు" (2) అని గాంధీజీ విశ్వసించేవారు.

పొట్టి శ్రీరాములు గాంధీజీ అభిప్రాయాన్ని తు.చ. తప్పకుండా పాటించాడని ఈ క్రింది సంఘటన ఋజువు చేసింది. నెల్లూరులో హరిజనోద్ధరణ కార్యక్రమాన్ని చేపట్టాడు. అప్పుడు వర్ణాంతర పంక్తి భోజనాలను నిర్వహించాడు. తద్వారా ప్రజల్లో చైతన్యాన్ని కలిగించాడు. వీధులవెంట తిరిగి భిక్షాటన చేశాడు. అగ్ర కులాలవారు ఎంత విమర్శించినా ఎన్ని బాధలు పెట్టినా ఆయన అణుమాత్రం లెక్క పెట్టలేదు. పాకీవాళ్లతో కలిసి వాళ్ల యిళ్లలోనే నివసించాడు.

గాంధీజీ ప్రబోధించిన బ్రహ్మచర్యవ్రతం కూడా శ్రీరాములును మిక్కిలి ఆకర్షించింది. బ్రహ్మచర్యాన్ని గూర్చి గాంధీజీ "బ్రహ్మచారి ప్రముఖంగా జిహ్వ చాపల్యాన్ని విస్మరించాలి. కఠోర ఆహార నియమాన్ని పాటించాలి. దీనివల్ల బ్రహ్మచర్యాన్ని అనుష్ఠించడం అతి సులువు అవుతుంది. శాకాహారం బ్రహ్మచర్యాన్ని కాపాడుతుంది. అందుకే నేను శాఖాహారినయ్యాను. బ్రహ్మచారులు ఉప్పు, కారం, మసాలా లేని ఆహారం తీసుకోవాలి. ఇది నా స్వానుభవంతో గ్రహించాను. సాధ్యమైనంతవరకు ఉడికిన పదార్థాలు తినాలి. పరిమితంగా భుజించాలి". (3) ఆశ్రమవాసులంతా ఈ నియమాలను విధిగా పాటించవలసి వచ్చేది. ఆశ్రమంలో

---

1) యన్. ఆర్. గుప్తాగారితో సంభాషణలో 1975 జూన్ 9 నుండి 21 వరకు.

2) గాంధీజీ రచించిన **"My Experiments with Truth"** అను గ్రంథం **P. 615**

3) గాంధీజీ రచించిన **"My Philosophy of Life"** అను గ్రంథం నుండి

సంస్థలో ఆఖరు స్థాయి వుద్యోగులైన పాకీవాళ్ళను వీధులు ఊడ్చేవాళ్లనూ ఖాదీ వస్త్రధారణను నిర్బంధం చేయడం ఏవిధంగా చూసినా సమంజసంకాదు.

ఖాదీ పట్ల నేటి ప్రభుత్వాధినేతలకు నిజంగా విశ్వాసం వున్నట్లయితే పోలీసు ఉద్యోగులతో సహా ప్రభుత్వోద్యోగులందరికీ ఖాదీ వస్త్రధారణను నిర్బంధం చేయాలి. ఖద్దరు ఉత్పత్తి విషయంలోను, సరఫరా విషయంలోనూ ప్రభుత్వమే పూర్తి బాధ్యత వహించాలి. ఇతర ఉద్యోగులను వదలివేసి కేవలం ఒక్క స్థానిక సంస్థల్లోని చిన్నచిన్న ఉద్యోగులు మాత్రమే ఖాదీ వస్త్రాలను ధరించాలనడం ప్రభుత్వం తన బాధ్యతను విస్మరించి పెత్తనం చెలాయించడం అవుతుంది. ఎక్కడా అమ్ముడుపోక మిగిలిపోయిన ఖాదీ వస్త్రాలను తెచ్చి ఇష్టంలేని చిన్న ఉద్యోగులు కొందరిచేత బలవంతంగా ధరింపచేయడం ఖాదీ ఉద్యమానికి అపకారం చేయడమే అవుతుంది. ఇది గాంధీజీ ఆశించిన విధానంకాదు పెద్దపెద్ద రాజకీయ నాయకులు, ఉన్నతోద్యోగులు తాము స్వయంగా ఖాదీ వస్త్రాలను ధరించడం ద్వారా ఇతర ఉద్యోగుల్లో ఖాదీ పట్ల గౌరవాభిమానాల్ని పెంపొందించాలి. (1) తన అభిప్రాయంతో ఏకీభవించేవారందరు పై ఉత్తర్వును ఉపసంహరించుకోవలసిందిగా మద్రాసు ప్రభుత్వంపై ఒత్తిడి తేవలసిందని పొట్టి శ్రీరాములు విజ్ఞప్తిచేశాడు.

ఆశయాలకంటే ఆచరణకే ప్రాముఖ్యం ఇచ్చేవాడు శ్రీరాములు. ఖాదీ ప్రచారాన్ని తన దైనందిన కార్యక్రమంలో ఒక భాగంగా భావించాడు అందువలన తన బంధుమిత్రాదులందరిలోను ఖాదీ పట్ల ఆసక్తి పెంపొందించగలిగాడు. ఎక్కడికి పోయినా అతడు ఖాదీ ప్రచారాన్ని మరచిపోయేవాడు కాదు. తన ప్రోత్సాహంతో వర్ణాంతర వివాహం చేసుకొన్న దంపతులకు అతడు ఎరవాడ చరఖాను బహూకరించాడు.

నెల్లూరు జిల్లా కలెక్టరుగా పనిచేసిన మలయప్పన్ దంపతులతో కూడా శ్రీరాములుకు పరిచయం ఏర్పడింది. క్రమేణా వారిద్దరికే ప్రతిరోజూ నూలు వడకడం పట్ల శ్రద్ధ కలిగించాడు. ఈ విషయాన్ని సబర్మతి ఆశ్రమం మాజీ కార్యదర్శి అయిన నారాయణదాస్ గాంధీకి వ్రాసిన లేఖలో శ్రీరాములు ఇలా

---

1) నిర్మాణ కార్యక్రమ నిర్వాహకులకు, సాంఘిక సేవా కార్యకర్తలకు 1949 ఆగస్టు 27వ తేదీన శ్రీరాములు పంపిన ప్రకటనా పత్రము ఆధారంగా.

వ్రాశాడు. "మలయప్పన్‌గారు ఒక సాధారణ వ్యక్తి. వారు నన్నెంతో ఆదరించారు. క్రమేణా నేను వారిని వారి సతీమణిని ప్రతిరోజు నూలు వడకవలసిందిగా కోరాను. వారి సతీమణికి నేను నూలు వడకటం నేర్పుతున్నాను. మలయప్పన్ గారు కూడా నూలు వడకటం పట్ల ఆసక్తి చూపిస్తున్నారు. కాని వారికి తమ విధి నిర్వహణలో నిద్రపోవడానికే సమయం దొరకటంలేదు. ఐనప్పటికీ అవకాశం ఉన్నప్పుడు నూలు వడకడం నేర్చుకోవడంలో వారెంతో శ్రద్ధ కనబరుస్తున్నారు."

అబిద్ హసన్ సఫ్రానీ అనే ఒక మిత్రుడు ఖాదీ ప్రచారం విషయంలో పొట్టి శ్రీరాములు కనబరుస్తున్న ఆసక్తిని ప్రశంసించేవాడు. అతడు కెయిరో రాయబార కార్యాలయంలో నియమింపబడిన తరువాత 1949 జూన్ 27వ తేదీన పొట్టి శ్రీరాములుకు ఇలా లేఖ వ్రాశాడు. "నేను ఇక్కడికి వచ్చేముందు ఈజిప్టియన్ ప్రత్తితో ప్రతిదినం నూలు వడక వలసిందిగా మీరు సలహాయిచ్చారు. మీ సలహాపట్ల నాకెంతో గౌరవం వుంది. దురదృష్టవశాత్తు నాకు ఇంతవరకు నూలు వడకటానికి తీరిక లభించలేదు. వీడ్కోలు సమయంలో మీరు నాకు ఖాదీ వస్త్రాలను బహూకరించారు. అందుకు నా కృతజ్ఞతలు. నిజం చెప్పాలంటే ఇంతవరకు నేనా వస్త్రాన్ని ధరించలేదు. కానీ మీరిచ్చిన వస్త్రంపట్ల గౌరవ భావంతో దాన్ని దిండుక్రింద భద్రపరచాను. ఇందువల్ల మీకూ నాకూ గల సాన్నిహిత్యం ప్రతి దినం గుర్తుకు వస్తుంది". (1)

గాంధీజీకి తగిన శిష్యుడైన పొట్టి శ్రీరాములు తప్పుచేసిన వ్యక్తి ఎంత ఉన్నత పదవిలో ఉన్నప్పటికీ అతణ్ణి విమర్శించడంలో వెనుకాడేవాడు కాదు. అదేవిధంగా తనతప్పు ఏదైనా వుంటే నిస్సంకోచంగా అంగీకరించేవాడు. ఒకసారి తన నిస్సహాయస్థితిని వ్యక్తం చేస్తూ నారాయణదాస్ గాంధీకి ఇలా లేఖ వ్రాశాడు. "...ఖాదీ ప్రచారం కోసం తగిన కృషి చేయలేకపోయాననే విషయం నాకు తెలుసు. ఆ చేసిన కొద్దిపాటి కృషి కూడా ఎంతో అసౌకర్యమైన పరిస్థితికి తట్టుకుంటూ చేయవలసివస్తుంది. ఖాదీ ప్రచారం సక్రమంగా జరగాలనే ఆపేక్షతో చరఖాలు, ఏకులు నా భుజాలపై మోసుకొని వెళ్లి నూలు వడకడం పట్ల ఆసక్తి గల వారికి

---

1) 27-6-1949న కైరోనుండి అబిద్‌హసన్ పొట్టి శ్రీరాములుకు వ్రాసిన లేఖ.

13)

అందజేసేవాణ్ణి. నేను ఈ చిన్నచిన్న ఇబ్బందులకు ఏమీ బాధ పడటంలేదు. ఖాదీ ప్రచారంకోసం అవసరమైతే నా ప్రాణాలను త్యాగం చేయడానికైనా సిద్ధమే. (1)

గాంధీజీ ఖాదీ పరిశ్రమను వికేంద్రీకరింప జేయాలని తద్వారా గ్రామీణ స్థాయిలోని పిల్లలకు సైతం తగిన ఉపాధి కల్పించాలని ఆశించాడు. కానీ మనకు స్వాతంత్ర్యం లభించిన తరువాత కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల్లో గాంధీజీ అనుయాయులే అధికారంలో ఉన్నప్పటికీ వారు ఖాదీ పరిశ్రమ వికాసం పట్ల శ్రద్ధ చూపకపోవడం పొట్టి శ్రీరాములుకు బాధ కలిగించింది. ఈ అభిప్రాయాన్ని సమర్ధిస్తూ ఆతడు నారాయణదాస్ గాంధీకి వ్రాసిన లేఖలో కొన్ని ఉదాహరణలిచ్చాడు". చరఖా సంఘం ఉన్నచోట్ల యితరులెవ్వరూ ఖాదీని ఉత్పత్తి చేయరాదు అమ్మరాదు. అనే నిబంధన విధించడం ద్వారా మద్రాసు ప్రభుత్వం ఖాదీ పరిశ్రమను క్షీణింప జేస్తుంది. ఇది సరియైన విధానం కాదు. దీనికి పరిష్కారంగా నేను ఒక సూచన చేయదలచాను. చరఖా సంఘం వారి సహకారంతో ఖాదీ నేయడంపట్ల ఆసక్తి గలవారికి శుద్ధమైన ఖాదీ నూలు అందజేస్తే ఖాదీ పరిశ్రమ ప్రాముఖ్యం పెరగడమేగాక ఉత్తమ ఖాదీ వస్త్రం తగినంతగా తయారవుతుంది.

చర్ఖా సంఘం నిర్లక్ష్యంవల్ల ఖాదీ పరిశ్రమకు ఎలాంటి చిక్కులు ఏర్పడిందీ పై లేఖలో శ్రీరాములు ఇలా వివరించాడు.

1. మార్కెట్టులో తగినన్ని మంచి ఏకులు లభ్యం కావడం లేదు.
2. నూలు నుండి బట్టలు నేయడానికి అనుకున్న దానికంటే ఎక్కువ వ్యవధి పడుతుంది.
3. చరఖాల ధర సామాన్య జనానికి అందుబాటులో లేనంతగా పెరిగింది. ఉదాహరణకు వార్ధాలో రూ. 8-50 లకు లభించే చరఖాకు నెల్లూరులో రూ. 14-50 లు చెల్లించవలసి వస్తుంది.
4. ఎంత ధర పెట్టినప్పటికీ మంచి చరఖాలు లభించడంలేదు. (జిల్లా కలెక్టరు మలయప్పన్ గారి కోసం వెదకగా పొట్టి శ్రీరాములుకు ఒక మంచి చరఖా కూడా లభించలేదు).

---

1) Potti Sreeramulu's letter dated 3rd Oct. 1949 addressed to Narayanadas Gandhi.

ఖాదీ ప్రచారం విషయంలో మద్రాసు చరఖా సంఘం తగిన కృషి చేయాలి. మంత్రులు వారివారి యిండ్లలోనూ, బహిరంగ స్థలాల్లోనూ స్వయంగా నూలు వడికేలా చరఖా సంఘం వారిపై వత్తిడి తేవాలి. మంత్రులు ఇతరులకు మార్గదర్శకులు కావడంద్వారానే ఖాదీ ప్రచారానికి తోడ్పడాలి. అంతేకాని ఖాదీ ప్రచారానికి కేవలం కొన్ని లక్షల రూపాయలు మంజూరుచేయడం ద్వారాకాని లేదా కొందరు ఉద్యోగులకు ఖాదీ వస్త్రాలు ధరించడం నిర్బంధం చేయడంవల్ల కాని నిజమైన ఖాదీ ప్రచారం జరుగదు. (1)

గాంధీజీ సహచరుడైన ఎర్నేని సుబ్రహ్మణ్యం గారు కృష్ణా జిల్లాలోని అంగలూరులో గాంధీజీ ఆశయాల సాధనకు ఒక ఆశ్రమాన్ని స్థాపించారు. వారు 'దరిద్రనారాయణ' అనే పేరుతో ఒక తెలుగు వారపత్రికను నడిపారు. ఆ పత్రికకు శ్రీరాములుగారు తరచుగా వ్యాసాలు వ్రాశారు. 1950 ఫిబ్రవరి 9వ తేదీన "ఖాదీ మరియు మిల్లు వస్త్రాలు" అనే శీర్షికతో వ్రాసిన వ్యాసంలో ఖాదీ వస్త్రాలను మిల్లు వస్త్రాలతో పోల్చడం సమంజసం కాదని వారిలా వివరించారు.

1. ఖాదీ పరిశ్రమ ఒక కుటీర పరిశ్రమగా అభివృద్ధి చెందడంవల్ల కోట్లాది పేదలైన గ్రామీణులకు జీవన భృతి కలుగుతుంది. కానీ నూలు మిల్లులు పేదవారికి జీవన భృతి కల్పించకపోగా నిరుద్యోగుల సంఖ్యను అధికం చేస్తున్నాయి.

2. సామాన్య ప్రజలు ధరించే నేత వస్త్రాలకు పోటీగా నూలు మిల్లులు వస్త్రాలను ఉత్పత్తి చేయడాన్ని ప్రభుత్వం నిశేధించాలి అలా జరగక పోతే నూలు మిల్లుల పోటీకి తట్టుకోలేక చేనేత పరిశ్రమ క్షీణించే అవకాశముంటుంది.

3. మిల్లు వస్త్రాల దర తక్కువగా కనబడినప్పటికీ అందులో పనిచేసే కార్మికుల సంఖ్యను కొన్ని కోట్ల రూపాయలు ఖరీదుచేసే యంత్ర సామాగ్రి నిర్వహణకయ్యే వ్యయప్రయాసలను నూలు మిల్లులు సృష్టించే నిరుద్యోగ సమస్య మొదలగు అంశాలను పరిగణలోనికి తీసుకున్నప్పుడు చేనేత వస్త్రాలకన్నా నూలు వస్త్రాలు చౌకగా ఉత్పత్తి కాగలవని చెప్పలేం. ఇందుకు కారణం ఖాదీ పరిశ్రమ కొద్దిపాటి పెట్టుబడితోనే ఎంతో మందికి ఉద్యోగం కల్పిస్తుంది.

---

1) Potti Sriramulu's letter to Narayandas Gandhi dated 1950, February, 9.

4 ప్రజాస్వామ్య వ్యవస్థలో జాతీయ శ్రేయస్సుకు భంగకరం కాని పరిస్థితిలోనే ఏ వస్తువునైనా ఉత్పత్తి చేయవలసి వుంటుంది. అందుకు భిన్నంగా జరిగే ఉత్పత్తి ఎంత గొప్పదయినా అభిలశించదగింది కాదు.

5. దేశీయ లేదా విదేశీయ మిల్లు వస్త్రాలు ఖాదీ పరిశ్రమకు పోటీగా తయారయినప్పుడు ఖాదీ పరిశ్రమ ఆ పోటీని తట్టుకొనలేదు. ఈ దృష్టితోనే గాంధీజీ విదేశీ వస్త్రధారణను వ్యతిరేకించాడు.

6. ఈనాడు అధికారంలో వున్న గాంధీజీ అనుచరులు ఖాదీ పరిశ్రమ యొక్క పవిత్రతను గుర్తించి దాని అభివృద్ధికి తోడ్పడడము తమ జీవిత లక్ష్యంగా భావించనంతకాలం ఖాదీ ప్రచారం సమర్ధవంతంగా జరగదు.

"బలవంతునిదే న్యాయం" అనే అనాగరిక సిద్ధాంతాన్ని పొట్టి శ్రీరాములు హర్షించలేకపోయాడు. ఒక ధనికుడు అనేక మంది పేదవాళ్ళను కొల్లగొట్టి మరింత ధనం సంపాదించవచ్చు. అదే విధంగా ఒక భారీ పరిశ్రమ అనేక చిన్న పరిశ్రమలను నామరూపాలు లేకుండా సర్వనాశనం చేయవచ్చు. ఇలాంటి పరిణామాన్ని నాగరిక చర్యగా లేదా అభివృద్ధి కార్యక్రమంగా వర్ణించడం సమంజసంకాదు. (1)

ఈ కారణంగా పొట్టి శ్రీరాములు శాస్త్రీయ, సాంకేతిక పద్ధతుల ప్రాధాన్యతను విస్మరించాడనడానికి వీల్లేదు. ఉత్పత్తిని పెంచడంలో యంత్రాలను సాంకేతిక పరిజ్ఞానాన్ని వినియోగించడం మంచిదని ఆయన అభిప్రాయం. అయితే శాస్త్ర సాంకేతిక విజ్ఞానం కేవలం అధిక స్థాయిలో వస్తువులను ఉత్పత్తిచేసి కార్మికుల పనిని పోగొట్టి వాళ్లను పస్తులుంచడాన్ని ఆయన హర్షించలేక పోయాడు. సాంకేతిక పరిజ్ఞానం అందరికీ అందుబాటులోనికి వచ్చినప్పుడే దాని విశిష్టత గుర్తింపబడుతుంది.

## మునిసిపల్ కార్మికుల సమస్యలు

నెల్లూరులో వున్న కాలంలో మునిసిపల్ కార్మికుల పరిస్థితులను చక్కదిద్దడానికి పొట్టి శ్రీరాములు తీవ్రమైన కృషి చేశాడు. పాకీవాళ్లు మొదలైన చిన్న చిన్న ఉద్యోగుల స్థితిగతులను మెరుగుపరచడానికి తోడ్పడ్డాడు దర్గా మిట్టలో

---

1) రథ సప్తమి సందర్భంగా నెల్లూరు జిల్లా కొరుటూరు గ్రామంలో శ్రీరాములు ఇచ్చిన ఉపన్యాసం ఆధారంగా

ఉన్న పాకీవారు నివసించే యిండ్ల మధ్య నివసిస్తూ వారి సర్వతోముఖాభివృద్ధికి అనేక కార్యక్రమాలు చేపట్టాడు. వారికి నూలు వడకడంలో శిక్షణ యిచ్చాడు. వారి మధ్యగల తగాదాలను పరిష్కరించాడు. త్రాగుడు, కొట్లాటలు మొదలైన దుర్వ్యసనాలను మాన్పించాడు. నిరక్షరాస్యులైన వయోజనులకు రాత్రిపూట పాఠశాలలు నిర్వహించాడు.

పొట్టి శ్రీరాములు ఆనాటి మద్రాసు రాష్ట్ర స్థానిక వ్యవహారాలశాఖ మంత్రి, మునిసిపల్ అధ్యక్షుడు, కమీషనర్, ఇంజనీరు, హెల్త్ ఆఫీసర్, లేబర్ ఆఫీసరు మొదలగు అధికారుల దృష్టికి నెల్లూరు మునిసిపల్ కార్మికుల సమస్యలను తెచ్చి వాటిని పరిష్కరించ వలసిందిగా ఒత్తిడి చేయసాగాడు ఈ సందర్భంగా 22-11-1946వ తేదీన నెల్లూరు మునిసిపల్ కమీషనరుకు ఈ విధంగా జాబు వ్రాశాడు. "ఈనాటికి మన మునిసిపాలిటీ పారిశుధ్యపు పనివాళ్లు వీధుల్లో పోగయిన చెత్తా చెదారాన్ని ఏలాంటి వాహనం లేకుండానే వారంతట వారే స్వయంగా మోసుకొనివెళ్లి ఊరివెలుపల పడవేస్తున్నారు. ఈ పద్ధతి ఏ మునిసిపాలిటీలోను లేదు. ఈ విషయాన్ని మునిసిపల్ కార్మికులు లోగడ సమ్మెద్వారా హెచ్చరించారు ఈ విషయాన్ని మేము మునిసిపల్ హెల్త్ ఆఫీసర్‌తోగూడా చర్చించడం జరిగింది. ఈ పనికి మునిసిపాలిటీవారు రెండు ట్రక్కులను సమకూర్చితే బాగుంటుంది. ట్రక్కులయితే సందు గొందుల్లోని చెత్తనుకూడా తీసివేయడానికి వీలుంటుంది. అందువల్ల మీరు వెంటనే మా విజ్ఞప్తిని ఆమోదిస్తారని ఆశిస్తున్నాను..."

మునిసిపల్ అధికారులు తగిన చర్య తీసుకోనందువల్ల ఇదే విషయాన్ని 6-1-1947న పొట్టి శ్రీరాములు నెల్లూరు కలెక్టరు దృష్టికి తెచ్చాడు. ఆ లేఖలో చెత్తా చెదారాన్ని తీసివేయడానికి ట్రక్కుల ఆవశ్యకతను నొక్కి చెప్పాడు. దర్గా మిట్టలోని మునిసిపల్ పాకీ పనివారి కాలనీలో వీధి దీపాలు సమకూర్చవలసిన అవసరాన్ని కూడా వివరించాడు. ఈ విషయమై మునిసిపాలిటీ కార్మికులు సమ్మెకు దిగాలని భావిస్తున్నందున పరిస్థితులు విషమించకముందే మీలాంటి పెద్దలు జోక్యం చేసుకొని సమస్యలు పరిష్కరించడం మంచిదని భావిస్తున్నాను. నేను 22-11-1946న నెల్లూరు మునిసిపాలిటి కమీషనర్‌కు గుర్తుచేస్తూ లేఖ వ్రాశాను. ఆ లేఖ ప్రతిని మీకు కూడా వ్రాశాను. కానీ యింతవరకు ఆ విషయమై ఎలాంటి చర్య తీసుకొనబడలేదు. సుమారు సంవత్సరం నుండి ఎంతో ఓర్పుతో పాకీ పనివారు ఈ విషయమై విజ్ఞప్తి చేస్తున్నారు. ఇటీవల ప్రభుత్వంవారు ఒక విధాన

ప్రకటన చేస్తూ పురపాలక సంఘాల ప్రగతి అట్టడుగుస్థాయి ఉద్యోగుల ఉన్నతిపై ఆధారపడి ఉంటుందని తెలిపారు. అలాంటప్పుడు వారి కనీసపు కోర్కెలను కూడా ఆమోదించకుండటం సమంజసంకాదు. (1) పురపాలకశాఖా మంత్రి కె. కోటిరెడ్డి గారి సమక్షంలోనే 3-1-1947 తేదీన నేను ఈ విషయాన్ని మీతో ప్రస్తావించి ఉన్నాను. అందువల్ల ఈ విషయం పట్ల తగిన శ్రద్ధ తీసుకోగలరని ఆశిస్తున్నాను.

పొట్టి శ్రీరాములు గొప్ప పట్టుదల కలిగిన వ్యక్తి. ఒక కార్యక్రమాన్ని చేపట్టినపుడు ఎన్ని ఆటంకాలు ఎదురు అయినా లక్ష్యాన్ని సాధించేవరకూ తన పట్టును వదలేవాడుకాదు. నెల్లూరు మునిసిపల్ పనివారి సమస్యలను కమీషనర్, జిల్లా కలెక్టరు మొదలైన అధికారుల దృష్టికి తెచ్చినప్పటికీ అవి పరిష్కరింప బడలేదు. అందువల్ల వారి సమస్యలను నేరుగా స్థానిక వ్యవహారాల మంత్రి దృష్టికి తెస్తూ 15-1-1947న వ్రాసిన లేఖలో ఈ క్రింది అంశాలను ప్రస్తావించాడు.

1. తోటపాలెం పాకీ పనివారి కాలనీలో వీధి దీపాల ఏర్పాటు.
2. ఇతర మునిసిపల్ ఉద్యోగులకు ఇచ్చినట్లుగానే పాకీ పనివారికి కూడా 25% జీత బత్తాలను పెంచడం.
3. చెత్తా చెదారాన్ని తొలగించడానికి అవసరమైన ట్రక్కులను సమకూర్చడం.
4. ఇప్పటికే రాష్ట్ర ప్రభుత్వం ఆమోదించిన నిబంధనలకు అనుగుణంగా మునిసిపల్ కార్మికులందరికి ఉచితంగా దుస్తులు సరఫరా చేయడం.(2)

నిజాయితీపరుల కృషి ఏనాటికైనా సఫలమై తీరుతుంది. మునిసిపల్ పనివారి సమస్యల విషయమై పొట్టి శ్రీరాములు వివిధ స్థాయిలలోని అధికారులతో ఉత్తర ప్రత్యుత్తరాలు, సంభాషణలద్వారా చేసిన కృషి ఫలించింది. మునిసిపల్ కమీషనర్ శ్రీ పిచ్చిరెడ్డిగారు శ్రీరాములు చేసిన ప్రతిపాదనలకు అనుకూలంగా ఇలా లేఖ వ్రాశారు.

---

1) 6-1-1947 తేదీన పొట్టి శ్రీరాములు నెల్లూరు జిల్లా కలెక్టరుకు వ్రాసిన లేఖ ఆధారంగా.

2) Potti Sreeramulu's letter dated 15-1- to Minister of Local Govt., Madras.

"L Dis No. 2689 / 47 dated 25-3-1947
Sir, Sub : Demands of Nellore Municipality Health Staff (Scavengers and Sweepers)

1. మునిసిపల్ పనివారికి ఇవ్వవలసిన దుస్తుల విషయంలో ప్రభుత్వం మాత్రమే తగిన నిర్ణయం చేయాలి. ఆ విషయంలో ప్రభుత్వం ఆదేశాల మేరకు మేము వాటిని అమలు చేయగలం.

2. వీధుల్లో పోగైన చెత్తా చెదారాన్ని తీసివేయడానికి ఒక లారీని వెంటనే సమకూరుస్తున్నాము. రెండవ లారీని ఖరీదు చేయడానికి కూడా మునిసిపల్ కౌన్సిల్ నిర్ణయం తీసుకొన్నది.

3. మునిసిపల్ సిబ్బందిని పెంచి వారి పనిభారాన్ని తగ్గించే విషయం కూడా తీవ్రంగా ఆలోచిస్తున్నాము. 1943-44 సంవత్సరాల మధ్య కాలంలో 20 మంది పనివారిని అదనంగా చేర్చుకున్న విషయం మీకు తెలిసే వుంటుంది. (1)

పాకీ వాళ్ళు, వీధులు ఊడ్చేవాళ్ళు, మురికి కాలువలు శుభ్రం చేసేవాళ్ళు, డ్రైవర్లు మొదలైన మునిసిపల్ ఉద్యోగుల స్థితిగతులు పెంచడానికి అహర్నిశలు కృషి చేస్తున్నప్పటికి గాంధేయవాదిగా, కాంగ్రెసు అనుచరునిగా శ్రీరాములు తన కర్తవ్యాన్ని ఏనాడూ విస్మరించలేదు. 4-6-1947న అప్పటి మద్రాసు రాష్ట్ర స్థానిక వ్యవహారాల మంత్రి శ్రీ కె చంద్రమౌళిగారికి వ్రాసిన లేఖలో తన ఆవేదనను ఇలా వ్యక్తం చేశాడు. "గత సంవత్సరం ఆగష్టు నెలలో నెల్లూరు మునిసిపాలిటీ పనివారి సమ్మె జరిగినపుడు దాన్ని అవకాశంగా తీసుకొని కమ్యూనిష్టులు సమ్మెను బలపరచడం ద్వారా కొత్తగా ఏర్పడిన కాంగ్రెసు ప్రభుత్వాన్ని అప్రతిష్టపాలు చేయాలని చూశారు. వారికి అలాంటి అవకాశం యివ్వకుండా కాంగ్రెస్ కార్యకర్తలు ప్రజల సహకారంతో నగర పరిశుభ్రతను కాపాడటంలో ఎంతో కృషి చేశారు.

ఈ సందర్భంగా కాంగ్రెస్ వాదుల బలహీనతలను ఇలా పేర్కొన్నాడు. ఎన్నికల సమయంలో దాదాపు కాంగ్రెస్ వారంతా అక్రమమార్గాలనే అనుసరిస్తున్నారు.

---

1) 22-3-1947వ తేదీన నెల్లూరు మునిసిపల్ కమీషనర్ పొట్టి శ్రీరాములుకు వ్రాసిన లేఖ

డబ్బిచ్చి ఓట్లను కొనడం, బ్యాలెట్ పెట్టెలను తారుమారు చేయడం మొదలైన అవినీతి చర్యలకు పాల్పడటంలో వెనకాడటంలేదు. ఎన్నికల అనంతరం దేశ శ్రేయస్సుకన్నా వ్యక్తిగత ప్రయోజనాలకే ప్రాధాన్యత ఇస్తున్నారు. ఇలాంటి అవినీతి పద్ధతులను అనుసరించడం ద్వారా వారు కాంగ్రెస్ సంస్థ యొక్క పవిత్రతనే చెడగొడుతున్నారు. గాంధీజీతోసహా కాంగ్రెస్ అగ్రనాయకులంతా కాంగ్రెస్ పార్టీని స్థాపించడంలో గల ప్రధాన లక్ష్యం దేశానికి స్వాతంత్ర్యం సాధించడమేగాని అధికారం చేపట్టి వ్యక్తిగత ప్రయోజనాలు పొందడం కాదనే విషయాన్ని అనేకమార్లు గుర్తుచేశారు. కాబట్టి కాంగ్రెస్ కార్యకర్తలంతా జిల్లా బోర్డులు, మునిసిపాలిటీలు మొదలైన స్థానిక సంస్థల ఎన్నికల్లో పాల్గొనడం మానుకొని గాంధీజీ ఆదేశించిన నిర్మాణాత్మక కార్యక్రమాల్లో పాల్గొనడం మంచిది. కొందరు కాంగ్రెస్ వాదులు ఎన్నికల్లో పోటీ చేసినప్పటికి యోగ్యులైన అభ్యర్థుల్ని మాత్రమే కాంగ్రెస్ కమిటీలో ఎన్నిక చేయాలి. అంతేకాని సంకుచిత రాజకీయాల ఆధారంగా అసమర్థుల్ని, అవినీతిపరులను ఎన్నికచేసి వారిని గుడ్డిగా బలపరచమని వివిధ స్థాయిలలోని కాంగ్రెస్ విభాగాలపై వత్తిడి తేవడం సమంజసంకాదు. ఇలాంటి పద్ధతులను అనుసరించి నపుడు రాజకీయాలలో ఆరోగ్యకరమైన వాతావరణం ఏర్పడుతుంది.

నెల్లూరు మునిసిపాలిటీలో పనిచేస్తున్న 31 మంది పాకీవాళ్లు, మురుగు కాల్వలను పరిశుద్ధి చేసేవాళ్లు ఎదుర్కొంటున్న ఒక సమస్య పొట్టి శ్రీరాములు దృష్టికి వచ్చింది. ఇతర మునిసిపల్ ఉద్యోగులకు 25% మూల వేతనం పెంచినప్పటికీ దానిని ఆ 31 మంది పనివారికి వర్తింపచేయలేదు. అదే విధంగా వారికి రావలసిన మొత్తం నెలకు ఒక రూపాయి వంతు ప్రావిడెంటు ఫండుకు జమచేయలేదు. ప్రభుత్వం నుండి తగిన ఆదేశాలు రాలేదనే మిషతో మునిసిపల్ అధికారులు ఈ అంశాన్ని అలక్ష్యం చేశారు. వారి స్థితిపట్ల జాలిగలిగి పొట్టి శ్రీరాములు వారి సమస్యలను మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి, ఆర్థికమంత్రి, రెవిన్యూమంత్రి, స్థానిక స్వపరిపాలనా మంత్రి, మునిసిపాలిటి చైర్మన్, కమీషనర్, రాష్ట్ర, పట్టణ కాంగ్రెస్ సంఘాల దృష్టికి తెచ్చాడు. ఈ విషయంలో నెల్లూరు మునిసిపల్ కమీషనరును శ్రీరాములు స్వయంగా కలిసినపుడు పై ప్రయోజనాలు పాకీ పనివంటి తక్కువస్థాయి ఉద్యోగులకు వర్తింపజేయడం వీలుకాదని ఆయన చెప్పాడు. 1946 ఆగష్టు 9వ తేదీన జరిగిన సమ్మెకు ప్రతిఫలంగా నెల్లూరు మునిసిపాలిటీలో పనిచేస్తున్న 213 మంది ఉద్యోగస్థులకు ప్రయోజనం కలిగింది.

అలాంటి ప్రయోజనాన్ని కేవలం 31 మంది పాకీవారికి, వీధులు శుభ్రం చేసేవారికి మాత్రం వర్తింప జేయక పోవడం భావ్యం కాదని పొట్టి శ్రీరాములు మునిసిపల్ కమీషనర్‌తో వాదించాడు. అప్పుడు కమీషనర్ తన అశక్తతను వ్యక్తంచేశాడు.

ఈ విషయాన్ని శ్రీరాములు 4-6-1947వ మద్రాసు రాష్ట్ర స్థానిక వ్యవహారాల మంత్రి శ్రీ కె చంద్రమౌళి గారికి వ్రాసిన లేఖలో తన ఆవేదనను ఇలా వ్యక్తం చేశాడు. "ప్రస్తుతం కాంగ్రెస్ మంత్రులూ కాంగ్రెసు సంఘాలు ఇతర ప్రముఖ కార్యకర్తలంతా ఎన్నికల కార్యక్రమంలో నిమగ్నులయ్యారు. అందుచేత ఈ చిన్న సమస్య పట్ల శ్రద్ధ చూపే తీరుబడి వారికి లేదు. జాబుల ద్వారా ఈ సమస్య పరిష్కరింపబడుతుందని నేను అనుకోవడం లేదు. ఇప్పటికీ ఈ నిర్భాగ్యులు పది నెలలుగా బాధపడుతున్నారు. ఇంకా వారిని ఈ గడ్డు రోజుల్లో బాధపెట్టడం భావ్యంకాదు. ఇంత చిన్న విషయం సమ్మెకు దారి తీయడం అందువల్ల ఉద్యోగులు, ప్రజలు బాధలకు గురికావడం సమంజసం కాదు. అందువల్ల నేనొక్కణ్ణే ఈ బాధనంతా భరించి ఈ సమస్యను పరిష్కరించాలని కోరుతున్నాను. నాకు ఆరోగ్యం సరిగా లేనప్పటికి వేరే గత్యంతరం లేక ఈ నిర్భాగ్యులకు న్యాయం కలిగించే దృష్టితో నేను 7-7-1947 నుండి నెల్లూరు మునిసిపల్ ఆఫీసు ఎదుట నిరాహారదీక్ష ప్రారంభిస్తున్నాను.

పొట్టి శ్రీరాములు ఎంత పట్టుదలగల వ్యక్తి అయినప్పటికీ కాలానుగుణ్యంగా వ్యవహరించేవాడు. ఏ విషయంలోను మొండి వైఖరి అవలంబించేవాడు కాదు. నెల్లూరు మునిసిపల్ కార్మికుల సమస్యను పరిష్కరించడంలో ప్రభుత్వాధికారులు మొండి వైఖరి ప్రదర్శించారు. అందుచేత ఆయన నిరసనవ్రతం ప్రారంభించవలసిన పరిస్థితులు ఏర్పడ్డాయి. కొన్ని అనివార్య కారణాలవల్ల ఆయన తన నిరాహార దీక్షను వాయిదా వేసుకోవలసి వచ్చింది. ఈ విషయాలన్నీ వివరిస్తూ 21-7-1947వ తేదీన గాంధీ గారికిలా లేఖ వ్రాశాడు.

"పరమ పూజనీయ బాపూజీ ! నమస్తే ! మీ అమూల్య సమయాన్ని వృథాచేసి మిమ్మల్ని యిబ్బంది పెట్టడం నాకిష్టంలేదు. అయినా కొన్ని అనివార్య పరిస్థితులవల్ల ఈ విషయాన్ని మీ దృష్టికి తేవలసి వచ్చింది.

1946 ఆగస్టు నెలలో నెల్లూరు మునిసిపల్ పాకీ పనివారి సమ్మె జరిగింది. కొత్తగా ఏర్పడిన కాంగ్రెస్ ప్రభుత్వాన్ని అప్రతిష్టపాలు చేయాలనే ఉద్దేశంతో

14)

కమ్యూనిష్టు వర్గాలు వారి సమ్మెను ప్రోత్సహించారు. అందుచేత నాలాంటి కాంగ్రెస్ కార్యకర్తలంతా కలిసి పట్టణ పారిశుద్ధ్యాన్ని కాపాడటంలో అధికారులకు తోడ్పడ్డాము. సమ్మె విజయవంతముగా ముగిసింది. మునిసిపల్ ఉద్యోగులందరికీ 25% మూలవేతనం పెంచబడింది. ఒక్కొక్కరికి నెలకు ఒక రూపాయి ప్రకారం ప్రావిడెంటుఫండు మంజూరు చేయబడింది. 213 మంది ఉద్యోగులకు 1-8-1946 నుండి ఈ ప్రయోజనాలు అమలు చేయబడ్డాయి. కానీ 31 మంది పాకీవాళ్లకు, కాలువలూడ్చేవాళ్లకూ కొన్ని కుంటి సాకులతో ఈ ప్రయోజనాలను నిరాకరించారు. ఈ అంశాన్ని గురించి ప్రభుత్వాధికారులతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి. ఆఖరుకు ఆ నిర్భాగ్యులకు ఆ ప్రయోజనాలు ఇవ్వడానికి ప్రభుత్వం నిరాకరించింది.

ఈ సమస్య పరిష్కరింపబడడానికి రెండే రెండు మార్గాలు కనబడుతున్నాయి. మొదటిది సంబంధిత ఉద్యోగులు సమ్మెకు దిగడం. రెండవది నాలాంటి వ్యక్తి ఒక్కడే అన్ని కష్టాలు భరించి ఆందోళన కొనసాగించడం. రెండవ మార్గాన్ని నేను ఎన్నుకొన్నాను. అందువల్ల 7-7-1947 నుండి నేను నిరాహారదీక్షకు పూనుకొనవలసి వస్తుందని సంబంధిత ఉన్నతోద్యోగులందరికీ తెలిపాను. ముగ్గురు రాష్ట్ర మంత్రులను స్వయంగా కలిశాను. అయినప్పటికీ ఇంతవరకూ వారినుండి ఎలాంటి సమాధానమూ లేదు.

నేను నిర్ణీత కార్యక్రమం ప్రకారం ఈ రోజు (7-7-1947) నుండి నిరాహారదీక్ష కొనసాగించవలసి వుంది. అయితే నెల్లూరు పట్టణంలో మతకలహాల వల్ల ప్రస్తుతం ఉద్రిక్త వాతావరణం నెలకొని వుంది. నేను నిరాహారదీక్ష ప్రారంభిస్తే వాతావరణం ఇంకా కలుషిత మవుతుందని కొందరు మిత్రులు సలహా ఇచ్చారు. కనుక 21-7-1947వ తేదీకి నా దీక్షను వాయిదా వేసుకొన్నాను. ఏ మాత్రం అవకాశం వున్నా నిరాహారదీక్ష లేకుండానే సమస్యను పరిష్కరించే ప్రయత్నం చేస్తాను. అధికారంలో వున్న కాంగ్రెస్ వాదులు, సమర్థులైన కాంగ్రెస్ కమిటీ సభ్యులు ఇలాంటి విషయాల్లో శ్రద్ధ చూపనపుడు నాలాంటి సామాన్య కార్యకర్తకు, నిరాహారదీక్ష తప్ప గత్యంతరం లేదు. ఈ విషయాన్ని మీరు సహృదయంతో గమనిస్తారని ఆశిస్తున్నాను.

ఇట్లు
మీ విధేయుడు
పొట్టి శ్రీరాములు

లోగడ 1946లో నెల్లూరులోని వేణుగోపాలస్వామి వారి దేవాలయంలో హరిజనులకు ప్రవేశం కల్పింపవలసిందిగా పొట్టి శ్రీరాములు నిరాహారదీక్ష చేసినప్పుడు గాంధీజీ ఆయన చర్యను సమర్థించారు. ఆ విషయాన్ని ఈనాటికీ పురప్రముఖులు, పత్రికావిలేఖరులు, రాజకీయవేత్తలు, ప్రభుత్వాధికారులు మరచిపోలేదు. అందుచేత శ్రీరాములు మళ్ళీ దీక్ష ప్రారంభిస్తే గాంధీజీ ఈ విషయంలో తప్పక ఆసక్తి చూపిస్తాడు. ఇలా జరగకముందే పరిష్కరించడం మంచిదని అధికారులు భావించారు. అందువలన శ్రీరాములును దీక్ష విరమించవలసిందిగా ప్రాధేయపడ్డారు. ఈ విషయాన్ని పరిష్కరించవలసిందని స్థానిక వ్యవహారాల మంత్రి పై కూడ ఒత్తిడి తెచ్చారు. దీని ఫలితంగా 31 నుండి మునిసిపల్ పాకీ పనివారి సమస్యను పరిష్కరించడం జరిగింది. తన కృషి ఫలించిన విషయాన్ని తెలుపుతూ 8-7-1947వ తేదీన గాంధీజీకి ఇలా లేఖ వ్రాశాడు.

"పరమ పూజ్యనీయ బాపూజీ ! నమస్తే,

నిన్న మీకు నేను ఒక లేఖ వ్రాశాను. అదే అంశాన్ని గురించి మళ్లీ జాబు వ్రాయవలసి వచ్చింది. మద్రాసు రాష్ట్ర ఆరోగ్యశాఖామాత్యులైన ఎ. బి. శెట్టిగారి కృషివల్ల నెల్లూరులోని 31 మంది పాకీ పనివారికి న్యాయం జరిగింది. వారికి ఈ రోజు నుండి 25% మూల వేతనము పెంచుతూ ఒక్కొక్కరికి నెలకు ఒక రూపాయి చొప్పున ప్రావిడెంటు ఫండు మంజూరుచేస్తూ ప్రభుత్వం ఆదేశాలు జారీ చేసింది. అందువల్ల నేను నిరాహారదీక్ష ప్రారంభించవలసిన అవసరము లేకుండా పోయింది. నెల్లూరు మునిసిపల్ కమీషనర్, పురప్రముఖులు, రాష్ట్ర ఆరోగ్య మంత్రి మొదలైన వారి కృషి ఫలితంగా ఈ విషయం సాధించగలిగారు.

1946 జనవరి నెలలో నేను మిమ్మల్ని మద్రాసులో కలిసినప్పుడు పాకీ పనివాళ్ల గృహాల్లో నివసిస్తూ వారి మధ్య ఒక పనివానిగా జీవించడమే నా లక్ష్యమని మీకు మనవి చేశాను. అలాగే నేను వారితో గత రెండు సంవత్సరాలుగా కలిసిమెలిసి జీవిస్తున్నాను. భారతదేశంలో అంటరానితనాన్ని నిర్మూలించటానికి ఇంతకన్నా వేరే మార్గంలేదు. కుల ప్రాతిపదికగా హెచ్చుతగ్గు లున్నంతకాలం భారతదేశంలో సమసమాజ వ్యవస్థ సాధ్యం కాదుగదా; హిందూ ముస్లిం తగాదాలు తగ్గి మతకలహాలు శాంతించినప్పుడే భారతదేశ సమైక్యత వర్ధిల్లుతుంది. ఇట్లు

మీ విశ్వాసపాత్రుడు

పొట్టి శ్రీరాములు

## మధ్యపాన నిషేదం :-

గాంధీజీలాగే పొట్టి శ్రీరాములు కూడా దేశప్రజలంతా ఆరోగ్య సౌభాగ్యాలతో జీవించాలని కోరేవాడు. ఆరోగ్య జీవితానికి భంగకరంగా ఉన్న మత్తుపదార్థాలలో త్రాగుడు మొదలైన దురభ్యాసాల నుండి ప్రజలు విముక్తులు కావాలని ఆశించాడు. త్రాగుడు లాంటి దురలవాట్లకు మనిషి ఒకసారి బానిసయితే వాటి నుండి విముక్తి పొందడం దుర్లభం. ముఖ్యంగా కష్ట జీవులైన పేదవారు త్రాగుడుద్వారా తమ బాదల్ని మరచిపోవాలని కోరుకుంటారు. అలాంటప్పుడు వారు తాగుడు మానివేయడం కష్టమవుతుంది. అలాంటి నిర్భాగ్యులు వారి సంపాదనంతా త్రాగుడుకే వినియోగిస్తారు. ఎప్పుడు చేతిలో డబ్బుంటే అప్పుడు వారికి యింటి కన్నా సారాయి దుకాణాలే గుర్తుకు వస్తాయి దీని ఫలితంగా ఆ కుటుంబం దుర్భర దారిద్ర్యానికి గురి అవుతుంది. త్రాగుడుకు బానిసయిన వ్యక్తి తన విచక్షణాజ్ఞానాన్ని కోల్పోయి పశు ప్రాయుడవుతాడు. (1)

ప్రజల వ్యక్తిగత జీవితంలో జోక్యం చేసుకొనే అధికారం ప్రభుత్వానికి లేదనే వాదనతో శ్రీరాములు ఏకీభవించేవాడుకాదు. సమాజ శ్రేయస్సుకు భిన్నంగా ఏ వ్యక్తికీ స్వేచ్ఛగాని హక్కులుగాని ఉండటం సమంజసంకాదు. ఈ సందర్భములో గాంధీజీ అభిప్రాయాలను ఆయన స్మరించేవాడు. "వ్యక్తిగత స్వాతంత్ర్యాన్ని గురించి మాట్లాడేవారికి భారతదేశ స్వరూప స్వభావాలు తెలియవు. త్రాగుడు అనేది తన వ్యక్తిగత హక్కని వాదించడంలో తప్పు లేకపోతే తమ కామహంచ తీరడం కోసం ప్రభుత్వమే స్త్రీలను సమకూర్చాలని కోరడం కూడా తప్పుకాదు".

మద్రాసు ప్రభుత్వం మధ్యపానాన్ని నిషేధించినందుకు శ్రీరాములు సంతోషించాడు. ఈ చర్యవల్ల ప్రభుత్వానికి 17 కోట్ల రూపాయల వార్షిక ఆదాయం పడిపోతుంది. ఈ విధానాన్ని అమలు చేయడానికి కూడా ప్రభుత్వానికి ఖర్చు అవుతుంది. ఈ పథకాన్ని విజయవంతం చేయడానికి రాష్ట్ర ప్రభుత్వం 442 మంది గాందేయులను ప్రచారకులుగా నియమించాలని నిర్ణయించింది. మధ్యపాన నిషేధ కార్యక్రమంలో మునిగివున్న శ్రీరాములు ఈ నిర్ణయంపట్ల

---

1) పొట్టి శ్రీరాములు "దరిద్రనారాయణ" వారపత్రికలో ప్రచురించిన వ్యాసం ఆధారంగా.

హర్షాన్ని వ్యక్తంచేశాడు. మధ్యపాన నిషేధ చట్టం అమలు వలన కలిగిన పరిస్థితిని అంచనా వేయడానికి శ్రీరాములు స్వయంగా అనేక గ్రామాల్లో పర్యటించాడు. మధ్యపాన నిషేదానికి ముందు గ్రామానికి ఒక సారాయి దుకాణం వుండేది. నిషేధం తరువాత ప్రతి ఇంటికీ ఒక సారాయి దుకాణం వెలిసింది. ఈ అంశం ఆయనకు దిగ్భ్రాంతిని కలిగించింది. ప్రభుత్వ విధానంలోనే ఏదో లోపముందని ఆయన భావించాడు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ నిర్మాణ కార్యక్రమ నిర్వాహకునిగా (1) శ్రీరాములు మధ్యపాన నిషేధాన్ని సక్రమంగా అమలు పరచడానికి నియమించబడిన ప్రచారకులకు ప్రభుత్వ అధికారులకు ఎన్నో సలహాలిచ్చాడు.

## ప్రచారకులకు పొట్టి శ్రీరాములు ఇచ్చిన సలహాలు :-

1. ప్రచారకులు మంత్రుల, కాంగ్రెస్ పెద్దల సహకారాన్ని సంపాదించాలి. అలాగే గాంధేయ మార్గాన్ని ప్రజల ముందుంచాలి. ఇలా చేయకపోతే ప్రచారకుల కృషి ఫలించదు.

2. మధ్యపాన నిషేధం కేవలం శాసనాలద్వారా పోలీసుబలం వల్ల అమలు జరుపడం సాధ్యంకాదు. గాంధీజీలాగా మధ్యపాన నిషేధాన్ని ప్రజల్లో ప్రచారం చేయాలి. మధ్యానికి అలవాటుపడిన వ్యక్తులు ప్రచారకులు ఎంత చెప్పినా మానుకోరు. కనుక ఈ పని ప్రచారకులు ఎంతో చాకచక్యంగా నిర్వర్తించాలి.

3. సామాన్య ప్రజలకు తాగుడు వలన కలిగే దుష్ఫలితాలను వివరించి మాన్పించడం సులభము కానీ విద్యావంతులు, ఉద్యోగస్థులైన తాగుబోతువారిని మాన్పించడం కష్టతరం. సామాన్య ప్రజల్లో ప్రచారకులు కలిసిపోయి వారి మన్ననలను పొంది వారినీ దురలవాటుకు దూరం చేయడం సులభం.

4. మధ్యపాన నిషేధ ప్రచారకులు కేవలం ఉద్యోగ ధర్మంగా ప్రచారం చేయడమే తమ విధి అని భావించక సమాజంలోని అట్టడుగువారిని ఉద్భోదించాలనే ఉత్తమాశయంతో ప్రచారం చేయాలి. అప్పుడే ప్రచారకుల కృషి ఫలిస్తుంది.

---

1) పొట్టి శ్రీరాములు పూనిన రెండు నిరాహారదీక్షలు విజయవంతం కావడంతో వెలుగులోకి వచ్చాడు. ఈ నేపథ్యంలో 1947 సం॥ నవంబర్ నెలలో ఆంధ్ర ప్రాంత నిర్మాణాత్మక కార్యక్రమ నిర్వాహకుడుగా నియమింపబడ్డాడు.

5. ప్రచారకులంతా గాంధీజీ నిర్మాణ కార్యక్రమాలపట్ల అచంచల విశ్వాసం కలిగుండాలి. విదేశీ పాలనలో నిర్లక్ష్యం చేయబడిన నిర్భాగ్య సోదరులను ఉద్ధరించడం ప్రథమ కర్తవ్యంగా భావించాలి.

## మధ్యపానాన్ని గూర్చి ప్రభుత్వాధికారులకు పొట్టి శ్రీరాముల సలహాలు :-

1. మంత్రులు, కాంగ్రెస్ నాయకులు, ప్రభుత్వాధికారులు మధ్యపాన నిషేధపు అమలు విషయంలో సదా తమ సహకారాన్ని అందించాలి.

2. ప్రచారకుల్లో బంధుప్రీతి, ఆశ్రిత పక్షపాతం అనేవి లేకుండా ప్రభుత్వాధికారులు చూడాలి.

3. త్రాగుబోతు మూర్ఖులు కొన్ని సమయాల్లో ప్రచారకులను దూషించి హింసకు పాల్పడవచ్చు ఇలాంటి సమయాల్లో ప్రభుత్వాధికారులు ప్రచారకులను కాపాడటానికి తగిన జాగ్రత్తలు తీసుకోవాలి.

4. మధ్యపాన ప్రచారకులను వినియోగించడంలో ప్రభుత్వం శ్రద్ధ తీసుకోవాలి. గాంధేయ సిద్ధాంతాలను నమ్మిన వారిని, కల్లు దుకాణాలముందు పికెటింగ్ చేసి ఎన్నో అవమానాలను పొందినవారిని మాత్రమే ప్రచారకులుగా నియమించాలి.

5. అన్నింటికంటె ప్రధానమైన విషయం ప్రచారకుల కార్యక్రమాన్ని పర్యవేక్షించే అధికారులు త్రాగుడుకు బానిసలు కాకూడదు. అలాగయితే మద్యనిషేధ కార్యక్రమానికే దెబ్బ తగులుతుంది.

నిజాయితీ పరులైన పొట్టి శ్రీరాములు తప్పు చేసిన ప్రభుత్వోద్యోగులు ఎంతహోదా కలవారయినప్పటికి విమర్శించడానికి వెనుకాడేవాడు కాదు. మధ్యపాన నిషేదాన్ని అమలు చేయడానికి అవసరమైన ఉద్యోగులు ప్రభుత్వ యంత్రాంగంలో ఉన్నప్పుడు దాన్ని ప్రచారం చేయడానికి ఎంతో ధనాన్ని దుర్వినియోగం చెయ్యడం ఆయనకిష్టంలేదు. ధనికులకు మధ్యపానాన్ని అమ్మే లైసెన్సు జారీ చేసి వారిని ఇంకా ధనవంతులుగా చేయడం సమంజసమేనా ? అలాంటి వారిని ప్రచారం దాారా

అజమాయిషీ చేయడం సాధ్యమేనా ? అని ఆయన ప్రభుత్వాధికారులను ప్రశ్నించేవాడు. మధ్యపాన నిషేదాన్ని అమలు చేయడంలో ప్రచారకులకన్నా డాక్టర్లు, స్త్రీలు, విద్యార్థులు, కాంగ్రెస్ పెద్దలు ఎక్కువ సేవ అందిస్తారని శ్రీరాములు తరచుగా చెప్పేవాడు.

నెల్లూరు జిల్లా కలెక్టరయిన మలయప్పన్ మద్యపానాన్ని సేవించే దురలవాటును నిర్మూలించడంలో నిర్విరామంగా కృషిచేసి జిల్లా అంతటా పేరుపొందాడు. ఆయన కాలంలో జరిగిన ఒక సంఘటనను పొట్టి శ్రీరాములిలా ఉదహరించాడు. నెల్లూరుకు సమీపంలో కటూరి పాలెం అనే గ్రామం వుంది. అక్కడ హరిజనుల సంఖ్య ఎక్కువ. సారాయి దుకాణాలకు ఆ గ్రామం ప్రసిద్ధి పొందింది. ప్రొహిబిషన్ చట్టం అమల్లో వున్నా అక్కడి ప్రజలు నిర్భయంగా కల్లుసారా దుకాణాలను నడుపుతూండేవారు. పొట్టి శ్రీరాములు ఇతర కార్యకర్తల ప్రోత్సాహంతో కలెక్టర్ 1949 ఏప్రిల్ మొదటివారంలో ఆకస్మికంగా కటూరిపాలెం వెళ్లాడు. అపరాధులంతా పట్టుబడి తీవ్ర శిక్షలకు గురి అయ్యారు (1) కలెక్టరు తీసుకున్న ఈ చర్యవల్ల సంఘసేవా కార్యకర్తల్లో నూతనోత్తేజం కలిగింది. ఉత్సాహంతో వారు ప్రతీ గ్రామానికీ వెళ్లి రహస్యంగా దాచబడ్డ కల్లు కుండలను ఇతర ముడి పదార్థాలను బైటికి లాగసాగారు. ఈ చర్యవల్ల మద్య విక్రయానికి చెందిన ఏ బేరమూ జరగలేదు. ఈ చర్య అంతా అహింసా పద్ధతిలోనే జరిగింది.

పొట్టి శ్రీరాములు మనస్సుకు అప్పుడిలా స్ఫురించింది. ఒక కలెక్టరు పట్టుదలతో కృషిచేసి ఇంతటి ఫలితం సాధించాడు. మంత్రులు, కాంగ్రెస్ నాయకులు, ప్రభుత్వాధికారులు అంతా ఏకమయితే ఇంకా ఎంతో గొప్ప ఫలితాలను సాధించవచ్చు కదా ! వీళ్లంతా గాంధీజీ సిద్ధాంతాలను మాటిమాటికీ వల్లిస్తూ మధ్యపాన నిశేధంపై ఎందుకు ఆసక్తిని ప్రదర్శించరు ? అధికారుల మధ్యపాన విక్రయశాలలపై దాడులు చేసే వార్తలు దినపత్రికలద్వారా ఎందుకు రావడంలేదు ? ఈ విషయంలో మంత్రులు, నాయకులు, అధికారులు శ్రద్ధ వహించి నాయకత్వం వహిస్తే ఈ ఉత్తమాశయసాధనకై తనలాంటివారు ప్రాణాలను అర్పించడానికయినా సిద్ధంగా వున్నారు. నెల్లూరులో వున్న కాలంలో శ్రీరాములు కొందరు

---

1) పొట్టి శ్రీరాములు "దరిద్రనారాయణ" వార పత్రికలో ప్రచురించిన వ్యాసం ఆధారంగా.

తాగుబోతులను సంస్కరించడానికి స్వయంగా పూనుకొన్నాడు. అనేకసార్లు తాగుబోతులపై కేసులు పెట్టబడ్డాయి. మేజిస్ట్రేట్ ముందు హాజరుపరచ బడ్డారుకూడ. అయితే శ్రీరాములు వారికి శిక్ష పడకుండా ఆదుకున్నాడు. ఆ తర్వాత వారి ప్రవర్తనలో మార్పు వచ్చింది.

గాంధీజీలాగే పొట్టి శ్రీరాములు సంపద ఏ ఒక్కరిసొత్తు కాదనీ సంఘానికి సంబంధించిందేనని విశ్వసించాడు. ఈ దేశంలో లక్షలాది ప్రజలు దారిద్ర్య రేఖకు దిగువన నివసిస్తున్నారు. కనుక ఇక్కడి ధనవంతులకు విలాసంగా జీవించే హక్కు లేదని భావించాడు. అందుచేత భాగ్యవంతులు మధ్యపానానికి దాసులు కాక ఆదర్శవంతంగా జీవించాలని కోరాడు. తాను జీవించిఉన్నంతకాలం పొట్టి శ్రీరాములు మధ్యపాన దురాచారాన్ని నిర్మూలించడానికి కృషిచేశాడు.

## బొంబాయి దురంతాలు :-

"ముస్లిం లీగ్ కౌన్సిల్ 29-7-1946 నాడు సమావేశమై పాకిస్తాన్‌ను సాధించడానికి ప్రత్యక్ష చర్య తీసుకోవాలని అవసరమైతే తమ ఆందోళనలో దేశంలోని ముస్లింల నందరిని పాల్గొనేలా చేయాలని నిశ్చయించింది. ఆగస్టు 16వ ప్రత్యక్ష చర్య ప్రారంభించాలని నిశ్చయించింది. (1) అనుకొన్న విధంగా ఆగస్టు 16వ తేదీ ఉదయం ప్రసిద్ధమైన కలకత్తాలో మారణహోమం జరిగింది. ఈ దురంతంలో 5 వేల మంది స్త్రీ, పురుషులు, బాలురు బలి అయ్యారు. 15 వేల మంది గాయపడ్డారని అంచనా వేయబడింది. కలకత్తా వీధులు రోజులతరబడి దిక్కులేని శవాలతో నిండిపోయాయి. ఎన్నో శవాలు భూగర్భంలోని మురికి కాలువలలోనికి నెట్టబడ్డాయి. దావానలం మాదిరిగా ఈ దురంతాలు నౌకాలి, పాట్నా, బొంబాయి నగరాలకు వ్యాపించి క్రమంగా భారతదేశంలోని మారుమూల ప్రాంతాలకు సైతం విస్తరించాయి. మహాత్మాగాంధీ, జవహర్‌లాల్ నెహ్రూ, సర్దార్ పటేల్, రాజేంద్రప్రసాద్, ఆచార్య కృపలానీ మొదలైన ప్రసిద్ధ నాయకులంతా ఈ విపత్తును ఎదుర్కొని హిందూ మహమ్మదీయ సఖ్యత నెలకొల్పడంలో నిమగ్నులయ్యారు.

---

1) జె.బి. కృపలాని రచించిన "Gandhi His Life and Thought" అను గ్రంథం ఆధారంగా. ఈ గ్రంథం భారత ప్రభుత్వ సమాచార విభాగంచే ముద్రించబడినది.

రామాయణ గాథలో శ్రీరాముడు వారధి కట్టినప్పుడు ఒక ఉడుత సహకరించినట్లు హిందూ మహమ్మదీయ ఘర్షణను నివారించకడానికి శ్రీరాములు తోడ్పడ్డాడు. బొంబాయిలోని ఘర్షణను అణచడానికి అక్కడే వున్నాడు. 20-9-1946న ఆయన గాంధీ గారికి వ్రాసిన లేఖలో ఇలా సూచించాడు. "ఒక్కొక్క నిరాయుధుడు అమాయకుడైన మహమ్మదీయుడు నిర్హేతుకంగా చంపబడ్డందుకు పరిహారంగా ఒక్కొక్క హిందువు ఆమరణ నిరాహారదీక్షతో జీవితాన్ని స్వచ్ఛందంగా అంతంచేసుకోవడం మంచిదికాదా ?" ఈ ఉద్దేశాన్ని బాపూజీ అంగీకరించలేదని ఆయన తరపున జాబువ్రాసిన కుమారి అమృతకౌర్ తెలియజేసింది. శ్రీరాములు కొన్ని నెలలు సహనంతో కాలం గడిపాడు. కానీ బొంబాయిలో మతకలహాలు కొనసాగుతున్నందుకు సహించలేకపోయాడు "బొంబాయిలో హత్యాకాండ ఎలా ఆపాలి" అనే శీర్షికతో తన భావాలను ఇలా వ్యక్తపరచాడు. ఒకవారం రోజులపాటు నినాదాలు వ్రాయబడ్డ అట్టముక్కలను మెడకు తగిలించుకొని కరపత్రాలను పంచుతూ బొంబాయి నగర వీధుల్లో తిరగాలనుకొంటున్నారు. ఆ తరువాత దురంతాలు ఆగేవరకూ నిరశన దీక్ష కొనసాగుతుంది. ఒక్క వారంరోజులపాటు ఎక్కడా కత్తిపోటు సంఘటనలు జరగనట్లయితే నాదీక్ష విరమిస్తాను. నేను విరమించిన వారం రోజుల్లో మళ్లీ కత్తిపోటు సంఘటనలు జరిగితే, ఏ హిందువు నా కార్యభారాన్ని పంచుకోవడానికి ముందుకు రాకపోతే నేను మరలా నిరాహారదీక్ష ప్రారంభిస్తాను. బొంబాయిలోని అమాయకులైన మహమ్మదీయులను హిందువులు చంపటం ఆపేవరకూ నా దీక్ష సాగుతూనే వుంటుంది. నాలో ఎంత ఆసక్తి వున్నప్పటికీ ఈ విషయంలో మీ అభిప్రాయంకోసం ఎదురుచూస్తుంటాను. ఇందుకు డబ్బు, సహాయం కూడా కావాలి. ఈ హత్యలు ఆగిపోవడానికి కొంత కృషి చెయ్యాలి. హిందువులే ఇందుకు పూనుకోవాలి. బెంగాలులో శ్రీరాములు చేసిన కృషిపట్ల బాపూజీ ఎంతో ఆసక్తిని చూపారు. (1)

బొంబాయి దురంతాలకు హిందువులే ప్రధానంగా బాధ్యులన్న శ్రీరాములు అభిప్రాయంతో ఎవ్వరూ ఏకీభవించక పోవచ్చు. అయితే బొంబాయి మతకలహాలను నివారించడానికి అతడు చూపిన ధైర్య సాహసాలు, శ్రద్ధాసక్తులతో చేసిన కృషి ప్రశంసనీయమని చెప్పక తప్పదు.

---

1) పొట్టి శ్రీరాములు 9-1-1947వ తేదీన నారాయణదాస్ గాంధీకి వ్రాసిన లేఖ ఆధారంగా.

15)

## భిక్షుక సమస్య :-

భారతదేశంలోని భిక్షుక సమస్యను గూర్చి పొట్టి శ్రీరాములుకు ఒక స్పష్టమైన అవగాహన వుంది. 'దీనబంధు' పత్రికకు (14-4-1943) 'నవయుగ' పత్రికకు (5-6-1949) "భిక్షుకులను రక్షించండి" అనే శీర్షికతో ఆయన వ్రాసిన వ్యాసాల్లో ఈ విషయాన్ని వివరిస్తూ ఇలా సలహాలనిచ్చాడు.

"బిచ్చగాడు మన వాకిలిముందు బిచ్చం అడిగితే ధర్మం పేరుతో అతనికి బిచ్చం వేస్తాం. ఇందువల్ల మనకు కలిగేది పుణ్యమా ? పాపమా ? పనీపాటా లేకుండా బతుకుతున్న బికుల పరిస్థితి దేశానికి ప్రమాదకరం కాదా ? రద్దీగా వున్న రైళ్లలో భిక్షకులవల్ల మనం అసౌకర్యం పొందడంలేదా ? తమకు రోగాలు నయమైతే బిచ్చం దొరకదేమోనని నిరంతరం వ్యాధులను మోస్తున్న బిచ్చగాళ్ళు ఎంతమందిలేరు ? ఎవరైనా బిచ్చం వెయ్యకపోతే బాధపడి తిట్టి బెదిరించేవాళ్ళు ఎంతమందిలేరు ? ఇందువల్ల మనం దొంగతనాన్ని, వ్యభిచారాన్ని, అంటువ్యాధులను ప్రోత్సహించడంలేదా ? భిక్షకులు పిల్లలను కుంటివారుగా, గుడ్డివారుగా మార్చడానికి మనం బాధ్యులంకాదా ? కుంటి, గుడ్డివారిని సైతం బాగుచేసి దేశానికి పనికివచ్చే పౌరులుగా తీర్చిదిద్దడం సాధ్యంకాదా ? భిక్షకుడు తనకున్న ఓటు హక్కుతో ఏంచేస్తాడు ? బిచ్చగాళ్ల మనుగడ సాగనీయడం స్వతంత్ర్యభారతానికి మచ్చగాదా ? ప్రజలూ ప్రభుత్వం కలిసి పరిష్కరించవలసిన సమస్యల్లో భిక్షక సమస్య ప్రధానమైంది. ఈ సమస్యను ప్రభుత్వం సవ్యంగా పరిష్కరించి నైతిక బలాన్ని పెంపొందించుకోలేదా ? మానసిక, ఆర్థిక సమస్యలు వచ్చిన ప్రజలు ఇల్లు వదలి భిక్షకులుగా మారుతున్నారు క్రమంగా సోమరిపోతులై పోతున్నారు. ఈ వృత్తిని నిర్మూలించడానికి ఎన్నో సంస్థలు కంకణం కట్టుకొన్నాయి. ఇలాంటి జనాన్ని ఆదుకోవడానికి పురపాలక సంఘ నిబంధనల్లో కూడా అవకాశం వుంది. కానీ బిచ్చగాళ్ళు ఈ అవకాశాన్ని వినియోగించుకోవడానికి అంగీకరించరు. కారణం ప్రజలు ఉదారంగా భిక్ష వేయడమే.

ప్రభుత్వానికి ప్రజా సహకారం తోడయితే భిక్షక సమస్యను నిర్మూలించవచ్చు. ప్రభుత్వం ఏదో ఒక రాష్ట్రం లోనైనా భిక్షుక వృత్తిని నిలిపే ప్రయత్నాలు చెయ్యాలి. ఏదో ఒక పట్టణంలో బిచ్చగాళ్లను అరెస్టు చేసినందువల్ల ప్రయోజనం శూన్యం. పంచాయతీలు, మునిసిపాలిటీలు బిచ్చగాళ్లకు ఆశ్రయమిచ్చి పోషించాలి. వారిని

వారి స్వగ్రామాలకు పంపాలి. ప్రజలు ఆశక్తులైనవారికి కూడా బిచ్చం వెయ్యడం మానాలి.

ప్రజలంతా దేహదారుఢ్యంగల బిచ్చగాళ్లకు బిచ్చం వేయడం మానితే గత్యంతరలేక ఏదో వృత్తిని ఆశ్రయించి బిచ్చగాళ్లు మాయమవుతారు. ప్రజాభిమానం గల ప్రభుత్వం ఏదోవిధంగా ఈ సమస్యను పరిష్కరించడానికి ఉద్యుక్తమవుతుంది. ఇందుకు ప్రజా సహకారం కావాలి. పంచాయతీ రాజ్యంవల్ల ఇది సాధ్యంకావాలి పంచాయతీ అనే పదంలోనే పెద్ద కుటుంబం ఆనే అర్థంవుంది. ఒక కుటుంబంలోని వ్యక్తి అశక్తుడయితే కుటుంబసభ్యులెలా కాపాడతారో అలాగే అశక్తులైన బిక్షగాళ్లను పంచాయతీ ఆదుకొంటుంది.

ప్రాపంచిక సుఖాలను వదలి జీవితమంతా ధ్యానంలోనూ, సంఘసేవలోనూ స్వచ్ఛందంగా లభించే బిక్షపై ఆధారపడి జీవించే సన్యాసులకు నిత్యం గృహస్థులను బిక్షపై నిర్బంధించే సోమరిపోతు యాచకులకు గల తారతమ్యాన్ని శ్రీరాములు బాగా గమనించాడు. (1) బిక్షక వృత్తిని నిషేధించే చట్టం బిచ్చమడగడాన్ని వృత్తిగా కలవారికే వర్తిస్తుంది. స్వచ్ఛంద బిక్షాన్ని స్వీకరించే సన్యాసులకు వర్తింపదు. విశాఖలోని ప్రేమ సమాజం మరియు రాజమండ్రిలోని జీవకారుణ్య సంఘం బిక్షక వృత్తి నిర్మూలనకు కంకణం కట్టుకొన్నాయి. ఇలాంటి సంస్థలకు ప్రోత్సాహమిచ్చి సహకరించడం ప్రతి భారతీయుని విధ్యుక్తధర్మం.

## జైళ్ల సంస్కరణలు :-

పొట్టి శ్రీరాములు ఎర్నేని సుబ్రహ్మణ్యం (గాంధీ ఆశ్రమం, అంగలూరు) మొదలైన కార్యకర్తలతో ప్రభుత్వ రేషనింగు విధానాన్ని నిరసిస్తూ 1947 అక్టోబరులో గుడివాడలో ప్రదర్శన జరిపాడు అందుకు ప్రభుత్వం వాళ్లందరినీ జైళ్లలో పెట్టింది (2) శ్రీరాములు ఆ జైళ్లలో నీతి మాలిన పరిస్థితులు చూసి విచారించాడు జైళ్ల పరిస్థితులు చక్కబడడానికి మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి

---

1) కొర్మిపాటి వెంకటరెడ్డి బిక్షక సమస్యపై వ్రాసిన కావ్యానికి వ్రాసిన పీఠికలో పొట్టి శ్రీరాములు వివరించాడు.

2) పొట్టి రంగయ్యతో సమావేశం.

వెంటనే చర్య తీసుకోవాలని డిమాండ్ చేశాడు. ముఖ్యమంత్రికి శ్రీరాములు 14-11-1947న ఇలా వ్రాశాడు. "స్వతంత్రభారతంలో అహింసపై విశ్వాసంగల సత్యాగ్రహ ఖైదీగా సబ్‌జైళ్ల గదుల్లోని పరిస్థితులను అక్కడ ఉంటున్న ఖైదీల ఇబ్బందులను ముఖ్యంగా సత్యాగ్రహంచేసి జైలు శిక్ష అనుభవిస్తున్న వారి పరిస్థితిని మీ దృష్టికి తెస్తున్నాను. మీకు కూడా ఈ విషయాలన్నీ తెలిసే వుంటాయి. ఆంగ్ల ప్రభుత్వం ఖైదీలపట్ల అమానుషంగా ప్రవర్తించింది. రాజకీయ ఖైదీల ఆత్మవిశ్వాసాన్ని చెదరగొట్టడానికి అమానుషంగా హింసించింది. శారీరకంగా వారిని బాధించినప్పటికీ వాళ్ల ఆత్మశక్తిని జయించలేక పోయింది. ఈ విధానం నేటి ప్రజాస్వామిక ప్రభుత్వానికి తగినది కాదని విశ్వసిస్తున్నాను.

జైలు గదుల్లోని పరిస్థితులను గురించి పొట్టి శ్రీరాములు ఇలా తెలియజేశాడు.

1 జైలు గదులు చాలా అపరిశుభ్రంగా ఉన్నాయి ప్రతి మూడు మాసాల కొకసారి గదులకు వెల్ల వేయించాలి.

2 గదుల్లో మురుగు పారుదల సౌకర్యం సక్రమంగా లేదు కొన్నిచోట్ల మురుగు పారుదలకు అవకాశంలేదు.

3. పాయఖానాలు చాలా అపరిశుభ్రంగా ఉన్నాయి.

4. ఖైదీలకు ఇచ్చే ఆహారం పరిశుభ్రంగా లేదు. చాలినంతగా ఉండటంలేదు.

ఈ విషయాలన్నీ వెంటనే చక్కజేయబడాలి. ఖైదీలకు సంబంధించిన క్రింది కోర్కెలు కోరుతూ పొట్టి శ్రీరాములు చేసిన విజ్ఞప్తిలో ఇంకా ఈ అంశాలున్నాయి.

1. ఖైదీలు ప్రతిరోజు కొంతసేపు ఆరుబయట గడపటానికి అనుమతించాలి.
2. వీరికి ఏదైనా ఒక పని చూపించాలి.
3. ప్రభుత్వం ఖర్చులో వార్తాపత్రికలను అందించాలి

ఇవిగాక సత్యాగ్రహుల కోరికలను ఇలా వ్యక్తం చేశాడు

1. సబ్‌జైలులో సత్యాగ్రహులకు స్వేచ్ఛ కలిగించాలి. వాళ్ళ గదులకు రాత్రింబవళ్ళు తాళంవేసి ఉంచకూడదు.
2. సంకెళ్ళను వేయరాదు.
3. లాకప్‌లో వాళ్ళను ఉంచకూడదు.
4. వాళ్ళు చదువుకోవడానికి రాత్రివేళల లాంతర్లను ప్రభుత్వపు ఖర్చుతో సమకూర్చాలి.
5. సత్యాగ్రహం చేస్తున్నప్పుడు మాత్రమే వాళ్ళను అదుపు చేయాలి.
6. అధికారులకు వ్యతిరేకులనే భావంతో వాళ్ళను అదుపుచేయడానికి ప్రయత్నించకూడదు.
7. ప్రభుత్వపు ఖర్చుతో వాళ్ళకు వార్తా పత్రికలను సరఫరా చేయాలి.

త్వరలో తన కోర్కెలు నెరవేరకపోతే మొదట లాంఛనప్రాయంగా నిరాహార దీక్షను పూనుకుంటానని అవసరమైతే కోరికలను ప్రభుత్వం తీర్చేవరకూ ఆమరణ నిరాహారదీక్షను జరుపుతానని పొట్టి శ్రీరాములు మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రికి అల్టిమేటం ఇచ్చాడు. ఈ మేరకు శ్రీరాములు మూడు రోజులు నిరసనదీక్ష సాగించాడు. కానీ ఎర్నేని సుబ్రహ్మణ్యం, ప్రభుత్వాధికారుల సలహాను అనుసరించి, త్వరలో అనుకూలమైన ఉత్తరువులు రావచ్చుననే నమ్మకంతో శ్రీరాములు దీక్ష విరమించాడు. తానీమారు జైలుకు వెళ్ళితే మరల నిరసనవ్రతం చేస్తానని ప్రకటించాడు తన కోర్కెలకు అనుకూలమైన ఉత్తరువులు రాష్ట్రమంతటికీ వర్తింపజేయాలని ముఖ్యమంత్రికి లేఖ వ్రాశాడు.

## ఇతర కార్యక్రమాలు

శ్రీరాములు నిర్వహించిన వివిధ సేవా కార్యక్రమా లన్నింటినీ వరుస క్రమంలో చెప్పడం కష్టతరం. రాజకీయ, మత, ఆర్థిక, సాంఘికాది విషయాలలో వ్యక్తిగతంగా కానీ సామూహికంగాకానీ ఎప్పుడైనా ఎక్కడైనా సమస్య తలఎత్తితే శ్రీరాములు వెంటనే కార్యభారాన్నంతా తనమీద వేసుకొనేవాడు. చేపట్టిన విషయంలో విజయం సాధిస్తానా లేదా అన్నది అతని సమస్యకాదు. ఇందు ఉదాహరణలు చాలా వున్నాయి.

నెల్లూరులోవున్న సంజీవశెట్టి వైశ్య హాస్టల్లో శ్రీరాములు గౌరవ వార్డెన్‌గా వున్నాడు. అప్పుడు గాంధేయమార్గంలో విద్యార్థులను తీర్చిదిద్దడానికి ప్రయత్నించాడు. ఉదయాన్నే నిద్రలేవడం, ప్రార్థనాది నిత్యకృత్యాల్లో పాల్గొనడం, సమయపాలన, సత్యవాక్యపాలన, క్రమశిక్షణ మున్నగు విషయాలను విద్యార్థులకు అలవాటు చేశాడు. ఎవరైనా విద్యార్థి తప్పుచేస్తే ఆ విద్యార్థి తన తప్పు తెలిసికొనేలా శ్రీరాములు బోధించేవాడు. భోజనశాల్లో ఏ విద్యార్థి అయినా చెడ్డగా ప్రవర్తిస్తే శ్రీరాములు ఆరోజంతా ఉపవాసం చేసేవాడు. దోషియైన విద్యార్థి బ్రతిమిలాడేవరకూ ఆయన దీక్ష కొనసాగేది. హాస్టలు విద్యార్థులు ప్రతి ఆదివారం మొదటి సినిమాకు వెళ్లవచ్చు. నియమానికి విరుద్ధంగా ఎవరైనా వెళితే ఉదయం నిద్రలేచేసరికి అతని ముఖాన తిలకం బొట్టు కనపడేది. (1) ఆ విద్యార్థి నియమోల్లంఘనాన్ని వార్డెన్ గుర్తించినట్లు అది గుర్తు ఇంత చిన్న తప్పుకు కూడా విద్యార్థి పశ్చాత్తాపం పొందేవాడు. నిబంధనల విషయంలో ఇంత కఠినంగా వ్యవహరించినా శ్రీరాములు విద్యార్థులపట్ల ప్రేమను ప్రదర్శించేవాడు. బలహీన, వ్యాధిగ్రస్త, నిరుపేద విద్యార్థులకు అనేక విధాల సహాయపడేవాడు.

హాస్టల్ మేనేజ్‌మెంట్‌వారి విషయంలో కూడా ఏ పొరపాటు జరిగినా శ్రీరాములు సహించేవాడు కాదు. ఒక పర్యాయం హాస్టల్ పాలకవర్గంవారు జరుపుతున్న అక్రమ చర్యలను వసతిగృహదాత సంజీవశెట్టిగారికి తెలియజేశాడు. హాస్టల్ ధనాన్ని కొంత సంజీవశెట్టి బంధువు ఒకరు దుర్వినియోగం చేశారు. దీన్ని సవరించడం కష్టమైనా, తుదకు తన ఉద్యోగానికి ముప్పని తెలిసినా శ్రీరాములు ఊరకుండలేదు. విషయాన్ని సంజీవశెట్టిగారికి తెలిపాడు. ఆయన మామూలుగా విని ఇంటికి వెళ్లాడు. బహుశ ఇంటిదగ్గర అతని బంధువు చేసిన దుర్బోధల ఫలితం కావచ్చు. రాత్రి పది గంటలకు సంజీవశెట్టి పొట్టి శ్రీరాములుని కొట్టడానికి కర్రతీసుకొని వచ్చాడు. అతణ్ణి చూసి శ్రీరాములు చలింపలేదు మామూలుగా చరఖాపై నూలు వడుకుతూ చిరునవ్వులు చిందిస్తూ కూర్చున్నాడు. శ్రీరాములును సంజీవశెట్టి వెంటనే హాస్టలు నుండి వెళ్లగొట్టాడు. ఆ రాత్రికి రాత్రి శ్రీరాములు

---

1) నెల్లూరు సంజీవశెట్టి వైశ్యహాస్టల్ వంటవానిగా పనిచేసిన చక్కా కేశవగారితో 15-9-1980న జరిగిన సంభాషణ ఆధారంగా.

మొగుళ్లపల్లి సత్రానికి బస మార్చాడు. తరువాత శ్రీరాముల తప్పులేదని తానే తొందరపడ్డానని సంజీవశెట్టి గ్రహించాడు. (1)

పొట్టి శ్రీరాములు నెల్లూరులో హిందూ సంఘ సంస్కరణ సమితిని ప్రారంభించాడు. దానిద్వారా రజస్వలానంతర వివాహాలు, విధవ వివాహాలు, కులాంతర, మతాంతర వివాహాలు, దిక్కులేనివారి దహన, ఖనన సంస్కారాలు మున్నగు కార్యక్రమాలు నిర్వహించాడు

నెల్లూరులో ఒక అనాథ ఆశ్రమం వుంది. దానికి నిధుల లోటు వుందని శ్రీరాములు గ్రహించాడు. వెంటనే శ్రీరాములు నాటి జిల్లా కలెక్టరు జోసఫ్‌రెడ్డి గారిని కలుసుకొని ఆ ఆశ్రమానికి కావలసిన శాశ్విత నిధులు సమకూరేలా ఏదైనా ఏర్పాటు చేయమని కోరాడు అందుకు కలెక్టరు అంగీకరించాడు. శ్రీరాములును విశాఖపట్నం వెళ్లి అక్కడి ప్రేమ సమాజ కార్యక్రమాలను పరిశీలించి రమ్మని కలెక్టర్ పంపాడు. (2) శ్రీరాములు వెళ్లి ఆ సమాజ కార్యక్రమాలను పరిశీలించి ముగ్ధుడయ్యాడు.

## ప్రేమ సమాజం లక్ష్యాలు :-

1. సంఘ బహిష్కరులకు సేవజేయడం
2. అనాథలకు ఆశ్రయమివ్వడం
3. అనాథ ప్రేతాల ఖనన సంస్కారం జేయడం
4. పేదలకు ఉచిత విద్య నేర్పడం
5. బడుగువర్గాల ప్రజల నివాస ప్రాంతాల ఆరోగ్య పరిస్థితులను చక్కబరచడం
6. జంతుబలులను నిషేధించడం
7. బడుగువర్గాలను ఉద్ధరించడం
8. అనాథ శిశు సంరక్షణ గృహనిర్వహణ

---

1) శ్రీరాములు తమ్ముడు డాక్టర్ పొట్టి రంగయ్య ఇచ్చిన సమాచారం.

2) పొట్టి రంగయ్యతో 11-11-1974న సమావేశం.

వీటిలో అనాద ప్రేత సంస్కారం అనేది పొట్టి శ్రీరాములును చిక్కిలిగా ఆకర్షించింది. విశాఖ నుంచి తిరిగి వచ్చిన శ్రీరాములు పై అంశాన్ని తమ సమితి లక్ష్యాల్లో ప్రధానంగా చేర్చాడు. అంతేగాక మరొక్క అడుగు ముందుకు వేశాడు. అనాధ ప్రేతాలను మోసుకొని వెళ్లడానికి బండిని ఏర్పాటు చేశాడు. ప్రేమసమాజం వారు ఈ అంశాన్ని మెచ్చుకొని, తాముకూడా అనుసరించారు. ఇంతకు పూర్వం అద్దె బండ్లను ఉపయోగించేవారు (1)

సంఘసేవకు అంకితం కావాలని శ్రీరాములు యువకులకు బోధించాడు. యువజనులంగీకరించి రక్తదానాది కార్యక్రమాల్లో సహకరించారు

వివాహ సంస్కరణ విషయంలో పొట్టి శ్రీరాములు అమూల్యమైన సేవ చేశాడు. తన మిత్రుడైన డా॥ సుబ్బారావుకు వ్రాసిన లేఖలో ఇలా అన్నాడు "డాక్టరుగా పనిచేస్తున్న ఒక అందమైన యువతి ఉంది. ఆమె మధుర కంఠ స్వరంలో ప్రేమగా ఆకర్షణీయంగా మాట్లాడుతుంది ఆమెకు ఒక సంబంధాన్ని చూడగోరుతాను. కులం సంగతి వదలివెయ్యి. మన భాషను అర్ధంచేసుకోవడానికి ఎలాంటి ఇబ్బంది లేదు".

పొట్టి శ్రీరాములు చేసిన మరొక వర్ణాంతర వివాహం చిరస్మరణీయమైంది. విశాఖ పట్టణంలోని ప్రేమ సమాజ సభ్యుడు చిప్పాడ సూర్యనారాయణ మూర్తి వరుడు, అనాథయైన మైత్రేయి వధువు. ఆమె వ్యాధిగ్రస్తురాలు. ఎక్కువకాలం జీవించదని డాక్టర్లు చెప్పారు వివాహం చేసుకొని ముత్తయిదువుగా కన్నుమూయాలని తన కోరికగా ఆమె చెప్పింది ఆ పరిస్థితుల్లో ఆమెను వివాహమాడటానికి ఎవ్వరూ ముందుకురాలేదు. శ్రీరాములు ప్రోత్సాహంతో సూర్యనారాయణమూర్తి ఆమెను వివాహం చేసుకున్నాడు. విధి విలాసం అనూహ్యమైంది ప్రకృతి చికిత్సతో ఆమె కోలుకొన్నది. చాలాకాలం వైవాహిక జీవితాన్ని గడిపింది తుదకు తన భర్త

---

1) "అమరజీవి-అమరజ్యోతి" గ్రంథంలో చిప్పాడ సూర్యనారాయణ వ్యక్తంచేసిన సమాచారం.

బిడ్డల ఎదుట అంతిమ శ్వాస వదిలింది. సూర్యనారాయణమూర్తి హైదరాబాదులో హైకో ఫ్యాబ్రిక్స్‌లో సెక్రటరీగా పనిచేస్తున్నాడు. తన జీవిత విశేషాలను ప్రముఖ తెలుగు నవలా రచయిత్రి ముపాళ్ల రంగనాయకమ్మకు చెప్పి నవల వ్రాయమన్నాడు. ఆమె నవల వ్రాయడమేగాక చలనచిత్ర నిర్మాణానికి హక్కులు ఇచ్చింది. సినిమాలో కొన్ని విషయాలు వదిలివేయబడ్డాయని హైకోర్టులో దావా వేశాడు. పొట్టి శ్రీరాములును గురించి ప్రకృతి చికిత్సను గురించి వదిలివేశారని ఆయన వాదించాడు. సూర్యనారాయణమూర్తికి నామమాత్రంగా పరిహారం చెల్లించాలని కోర్టు తీర్పునిచ్చింది. (1)



1) 1976 సం॥ డిశంబరు 25వ తేదీన చిప్పాడ సూర్యనారాయణ మూర్తిగారితో జరిగిన సమావేశం ఆధారంగా.

# ఏడవ అధ్యాయం

## గాంధీ మెమోరియల్ స్కీమ్‌కోసం పొట్టి శ్రీరాములు కృషి

## నెలకొక రోజు చొప్పున సంఘసేవ :-

లక్షలాది భారతీయులు దశాబ్దాల తరబడి ఐక్యమత్యంగా జరిపిన స్వతంత్ర సంగ్రామం వృధాకాలేదు. 1947 ఆగస్టు 15న భారతదేశానికి స్వతంత్రం వచ్చింది. వచ్చిన కొద్ది రోజుల్లోనే భారతీయులు జాతిపితను కోల్పోయారు. 1948 జనవరి 30న మహాత్ముడు గాడ్సేచేత హత్య గావించబడ్డాడు. గాంధీజీ మరణించిన సందర్భంలో సుప్రసిద్ధ కాంగ్రెస్ నాయకుడు జె.బి. కృపలానీ ముప్పై సంవత్సరాలకు పైగా మనకు మార్గదర్శకంగా ఉంటూ మనల్ని ముందుకు నడిపించిన ఆ కంఠము నేడు మూగబోయింది. మన గమ్యంవైపుకు మనలను నడిపించిన ఆ దివ్వె ఆరిపోయింది. కానీ లోకంలో మంచిని ప్రచారం చెయ్యడానికి దైవ ప్రతినిధిగా పంపబడ్డ మహాత్ముని వాణి ఒక హంతకుని తుపాకీగుండుకు మూగబోతుందా ? మహాత్ముని జ్యోతి ఒక దుర్మార్గుని దురాగతానికి ఆరిపోతుందా ? అట్లెన్నటికీ కాదు. మహాపురుషుని సందేశాన్ని వినిపిస్తూ మానవజాతిని జాగృతం చేస్తున్నంత వరకు అవి శాశ్వితంగా నిలిచిపోతాయి. (1) కృపలానీ వ్యక్తంచేసిన పై మాటలు పొట్టి శ్రీరాములు వంటి వేలాది గాంధీజీ అనుచరుల మూగ భావాలకు శ్రుతి కలిపినవని చెప్పవచ్చు.

మహాత్మాగాంధి మరణానంతరం పొట్టి శ్రీరాములు మహాత్ముని స్మారక చిహ్నంగా ఒక ప్రణాళికను అమలుపరచే విషయంలో నిమగ్నమయ్యాడు. (2) హరిజన దేవాలయ ప్రవేశ విషయమై మద్రాసు ప్రభుత్వం చేసిన రెండు చట్టాలవల్ల పొట్టి శ్రీరాములు ఆశయాలు నెరవేరాయి. (3) ఈ ఉత్సాహంతో శ్రీరాములు

---

1) J. B. Krupalani – Gandhi His Life and Thought– Publication Division. P. P. 301, 302.

2) యన్. ఆర్. గుప్తాగారితో సమావేశం.

3) పొట్టి శ్రీరాములు నిరాహారదీక్ష ఫలితం.

మరొక ప్రజాసేవా కార్యక్రమాన్ని చేపట్టాడు. 16-2-1948న ప్రొఫెసర్ రంగా అధ్యక్షతన ఆకస్మికంగా ఆంధ్ర రాష్ట్ర వర్కింగ్ కమిటీ సమావేశమై ఈ క్రింది తీర్మానాన్ని చేసింది.

"మహాత్మాగాంధీ స్మారక చిహ్నంగా మద్రాసు ప్రభుత్వం ప్రతి నెలా 30వ తేదీన పీడిత జనానికి సేవచేసే దినంగా ప్రకటించి బాపూజీ ఆశయాలయిన శాంతిసేవా భావాలను కొనసాగేటట్లు చేయాలి. మంత్రులు, శాసనసభ సభ్యులు, శాసన సమితి సభ్యులు, అధికారులు, కాంగ్రెస్ కమిటీలోని ప్రతి ఒక్కరు, ప్రజలంతా, రాష్ట్రమంతటా ఆరోజు జరిగే సంఘసేవా కార్యక్రమాల్లో తప్పక పాల్గొనాలి. (1)

జిల్లా సంఘాల అధ్యక్షులు, కార్యదర్శులు, 22-2-1948 నాడు విజయవాడలో సంయుక్తంగా సమావేశమై ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ చేసిన పై తీర్మానాన్ని బలపరుస్తూ సంఘసేవా దినోత్సవం జరిపే విషయానికి సంబంధించి ఈ క్రింది సూచనలు చేశారు.

1. రాష్ట్ర మంతటా ప్రతిఫల రహితంగా నూలువడకే కేంద్రాలను నిర్వహించాలి.

2. హరిజనులకు దేవాలయ ప్రవేశం కల్పించాలి. బహిరంగ స్థలాల్లో వాళ్ళకు ప్రవేశం కల్పించాలి. వాళ్ళలో వున్న భయాన్ని పోగొట్టాలి. ప్రజలంతా అస్పృశ్యతను విస్మరించేలా చేయాలి.

3. అగ్రకులాల ఆధిక్యతను విస్మరింప చేయడానికి సహపంక్తి విందులు జరపాలి. ఈ పంక్తి భోజనాల్లో చెప్పులు కుట్టేవారికి, పాకీవారికి కూడా ప్రవేశం కల్పించాలి.

4. సర్వమతస్థులతో సామూహిక ప్రార్థనలు చేయించాలి.

5. ప్రతినెలా 30వ తేదీన సంఘసేవా దినంగా పాటించే పద్ధతిని అమలు పరచడానికి అధికారులు తగిన చర్య తీసుకోవాలి.

---

1) ఎర్నేని సుబ్రమణ్యం, డా॥ రాజేంద్రప్రసాద్‌కు వ్రాసిన లేఖ 12-3-1948.

ఆంధ్ర రాష్ట్ర నిర్మాణాత్మక కార్యకర్తల సమావేశం మరల 1948 ఏప్రిల్ 7, 8, 9 తేదీల్లో పశ్చిమ గోదావరి జిల్లాలోని జోగన్నపాలెంలో సమావేశమై పై సూచనలను సమర్పించడమేగాక మరొక 20 తీర్మానాలనుకూడా ఆమోదించింది.

ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ నిర్వాహకుడుగా పొట్టి శ్రీరాములు పై నాలుగు సమావేశాల్లో ప్రముఖ పాత్ర వహించాడు. బాపూజీ ప్రధాన శిష్యుడుగా తీర్మానాలను అమలు పరచడమే ధ్యేయంగా భావించాడు. పొట్టి శ్రీరాములు సమన్వయ స్వభావం కలవాడు. సమస్యల నెదుర్కోవడంలో ఆకస్మిక ప్రతిచర్యలు చేస్తాడు. ఈ అంశం అతని స్నేహితులను, బంధువులను విభ్రాంతులను చేస్తుంది. గెలిచినా ఓడినా శ్రీరాములు సమబుద్ధితో ప్రశాంతంగా ఉండేవాడు.

పొట్టి శ్రీరాములు సమాజంలోని అత్యవసర సమస్యల విషయమై స్వీయాభిప్రాయాలను తెలుపుతూ అప్పటి మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రికి విజ్ఞాపన పూర్వకంగా లేఖ వ్రాశాడు. స్వల్పకాలంలో అధికమైన నిర్మాణాత్మక కార్యాలను చేపట్టడమే గాంధీకి తగిన స్మారక చిహ్నమని అతని దృఢనమ్మకం. ఆ లేఖాంశాలిలా వున్నాయి. "హరిజన్ టెంపుల్ ఎంట్రీయాక్టు, హరిజన సివిల్ డిస్ ఎబిలిటీస్ బిల్లు చట్టంగా రూపొందడానికి నేను 1946 నవంబర్, డిశంబర్ మాసాల్లో 19 దినాలు నిరశనవ్రతం చేశాను. మంచి ఫలితాలు సాధించబడ్డాయి. కాని కాంగ్రెస్ కమిటీ ప్రభుత్వం వుంది ఈ పనికి సమర్థులైనవారు ఉత్సాహం చూపలేదు. బహిరంగ స్థలాల్లో అంటరానితనం పాటించబడినంత కాలం ఈ దురాచారాన్ని మరచిపోవడం సాధ్యంకాదు". (1)

పొట్టి శ్రీరాములు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీ నిర్మాణాత్మక కార్యక్రమ సంఘ సంచాలకుడుగా 1947 డిశంబరు నుంచి ఆంధ్ర జిల్లాలో పర్యటించి ప్రభుత్వ చట్టాలు సరిగా గౌరవింపబడటం లేదని అనుభవ పూర్వకంగా గ్రహించాడు. చట్టం అమలుపరచే ప్రయత్నాల్లో అగ్రవర్ణాలవారు హరిజనులను, కార్యకర్తలను కొట్టేవారు. ప్రభుత్వం పట్టనట్లు వుండేది. ఈ సందర్భంగా పొట్టి శ్రీరాములు తన భయాన్ని మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రికి ఇలా వ్యక్తంచేశాడు.

---

1) మద్రాసు ముఖ్యమంత్రి O. P. రామస్వామిరెడ్డియార్‌కు 17-6-1948 న పొట్టి శ్రీరాములు వ్రాసిన లేఖ.

"హరిజన మంత్రి ఆదరణలో నడుస్తున్న వ్యవసాయ కూలీలు, వారపత్రికలోను, ఆంధ్రరాష్ట్ర హరిజనసేవా సంఘం ఆధ్వర్యంలో నడిచే 'నవజీవన్' పత్రికలోను హరిజనులపై అత్యాచారాలు అనే విషయములను చదివాము. కానీ పరిష్కారమార్గం అందులో సూచింపబడలేదు. మంత్రులంతా నిస్సహాయ స్థితిలో వున్నారా ? పోలీసువారు చర్య తీసుకోవడం లేదు. తీసుకొన్నా సకాలంలో తీసుకోవడం లేదు. హరిజనులు తమ హక్కులను బలపరచుకోవడానికి భయపడుతూ బాధ లనుభవిస్తున్నారు. ఇప్పటికీ హరిజనులు బహిరంగ స్థలాల్లో వెలివేయ బడుతున్నారు. ఇక్కడ మనం హరిజనులను వెలివాడల్లో వుంచుతూ దక్షిణాఫ్రికాలో భారతీయుల్ని వెలివేస్తున్నారని నేరారోపణ చేసే హక్కు మనకెక్కడుంది.

సమస్యల్ని ఆచరణాత్మక దృక్పథంతో ఎదుర్కొనే వ్యక్తి కావడం వల్ల శ్రీరాములు ఏ దశలోగానీ క్రియాశూన్య పరిస్థితిని సహించలేకపోయాడు. ఆయన గాఢ నిద్రాంధకారంలో వున్న అధికారులను మేల్కొలిపాడు. తన సందేశాలను వివరించాడు. ఒక్క ఎలక్షన్లకోసం తప్ప దేశంలో కాంగ్రెస్ కమిటీవల్ల అన్నీ ఏనాడో మరణించాయని అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షుడు జె. బి. కృపలానీ చెప్పిన మాట వాస్తవంకాదా ? 16-2-1948వాడు ప్రొ॥ రంగా అధ్యక్షతన సమావేశమైన ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ గాంధీ నిర్యాణ దినాన్ని సంఘసేవా దినంగా పరిగణించాలని మద్రాసు రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరింది. ఈ కోరిక చెత్త బుట్టలో పడిందా ? తీర్మానం చేసినంత మాత్రాన తన బాధ్యత తీరిపోయిందని ఎ.పి.సి.సి. భావించిందా ? ప్రభుత్వం నుంచి పనిని సాధించడానికి ఏమిచేసింది ? వేదికలపై నుంచి ఉపన్యాసాలు ఇచ్చినంతమాత్రాన ఏమైనా ప్రయోజనముందా ? అనికూడా పై లేఖలో మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రిని ప్రశ్నించాడు శ్రీరాములు.

పొట్టి శ్రీరాములు మహాత్ముని వారసత్వంగా నిర్భీతి, సత్యం మొదలైన సుగుణాలను పొందారు. అందుకే గాంధేయమార్గానికి విరుద్ధంగా ప్రవర్తించే మంత్రులను విమర్శించడానికి వెనుకాడలేదు. ఏదో కాఫీ హోటల్ భవనానికిగాని, సినిమా హాలుకుగాని, శంకుస్థాపన చేసేటప్పుడు, సభలకు అధ్యక్షత వహించేటప్పుడు గాంధీ మంత్రాన్ని జపించే వీళ్ళు ఆయా సందర్భంలో హరిజనులకు జరుగుతున్న అన్యాయాలను గురించి ఎందుకు పట్టించుకోరు? ప్రభుత్వం పూనుకొనందే హరిజనుల సమస్యలు పరిష్కారం కావనే విషయాన్ని శ్రీరాములు స్పష్టం చేశాడు.

హరిజనుల సమస్యలను పరిష్కరించడంలో ప్రభుత్వం నిర్లక్ష్యం వహిస్తే విభిన్న పక్షాలకు చెందిన తెగలు బలపడతాయనే అంశాన్ని చారిత్రకాంశాలతో ఋజువు పరచాడు శ్రీరాములు. 1932 లో మాగ్డోనాల్డు అవార్డు రద్దు కావడం, అంబేద్కర్ వర్గంవాళ్ళు విషప్రచారం చేయడం మున్నగు అంశాలను ఉదహరించాడు. కాంగ్రెస్ నుండి, హిందూ సమాజం నుండి దూరమైతే హరిజనుల సమస్యలు పరిష్కార మవుతాయనే భావం కలిగిన పక్షంలో అంబేద్కర్‌ను సైతం విమర్శించడానికి శ్రీరాములు వెనుకాడలేదు. (1)

మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రికి వ్రాసిన సుదీర్ఘ లేఖ ముగిస్తూ శ్రీరాములు ఇలా అన్నాడు. "వచ్చేనెలనుంచే 30వ తేదీన సేవాదినంగా పాటింపజేయడం ప్రభుత్వానికి దుస్సాధ్యమైన విషయం కాదు. ఇందువల్ల కాంగ్రెస్ పార్టీయొక్క, కాంగ్రెస్ ప్రభుత్వం యొక్క ప్రతిష్ఠ ఇనుమడిస్తుంది. ప్రభుత్వం అనతికాలంలో ఈ విషయ పరంగా నిర్ణయం తీసుకోనట్లయితే ప్రభుత్వం పై వత్తిడి తేవడానికి ప్రజల్లో చైతన్యం కలిగించడానికి నేను నిరాహారదీక్షకు పూనుకోవలసి వస్తుంది..."

పొట్టి శ్రీరాములు ఆలోచనాపరుడుగా నిరూపించుకొన్నాడు. కార్యసాధనా ఫలితకీర్తి తనకొక్కడికే దక్కాలని దురాశలేదు. గాంధీ మెమోరియల్ స్కీమును గూర్చి తన అభిప్రాయాలను సమర్థించమని గాంధీజీ అనుచరులైన 1. ఎ.వి. ఠక్కర్ (హరిజనసేవక సంఘ ప్రధాన కార్యదర్శి), 2. డాక్టర్ రాజేంద్రప్రసాద్ (ఎ.పి.సి.సి. అధ్యక్షుడు), 3. కె. జి. మష్రూవాలా (హరిజన్ పత్రిక ఎడిటర్), 4. ఆచార్య వినోభాభావే, 5. నారాయణదాస్ గాంధీ (సబర్మతీ ఆశ్రమం మాజీ కార్యదర్శి), 6. పరీక్షిత్‌లాల్ మజుందార్ (మేనేజర్ హరిజనాశ్రమం - సబర్మతి), 7. చిమన్‌లాల్‌షా (మేనేజర్ సేవాగ్రామం ఆశ్రమం), 8. ఎర్నేని సుబ్రహ్మణ్యం (గాంధీ ఆశ్రమం అంగలూరు), 9. యన్. జి. రంగా (ఎ.పి.సి.సి. అధ్యక్షుడు), 10. యన్. ఆర్. గుప్తా (పొట్టి శ్రీరాములు మేనల్లుడు, స్వాతంత్ర్య సమరయోధుడు) మొదలైనవారిని సంప్రదించాడు.

గాంధీజీ అనుచరుల్లో చాలామంది పొట్టి శ్రీరాములు ఉద్దేశాలను బలపరుస్తూనే ఆయన చర్యలను విమర్శించారు. ఈ విషయం క్రింది అంశాలవల్ల స్పష్టమవుతుంది.

---

1) 16-3-1945 తేదీన పొట్టి శ్రీరాములు గాంధీజీకి వ్రాసినలేఖలో వ్యక్తంచేశాడు.

హరిజనసేవా సంఘ ప్రధాన కార్యదర్శి ఎ. వి. ఠక్కర్ 25-6-1948వ కిషోర్‌లాల్ మష్రూవాలాకు రాసిన లేఖలో శ్రీరాములు వ్యక్తిత్వాన్ని ప్రశంసించి, ఇంకా ఇలా అన్నాడు. ప్రతినెలా 30 వ తేదీ మద్రాసు ప్రభుత్వం గాంధీజీ ఆశయాలను పాటిస్తూ సంఘసేవా దినాన్ని మద్రాసు ప్రభుత్వం జరుపుతుందని చెప్పడం శక్తికిమించి పని అవుతుందేమో ! సంవత్సరాని కొకమారు జనవరి 30వ తేదీన సంఘసేవాదినం జరిపినట్లయితే అక్కడికే అది ఎక్కువని చెప్పవచ్చు. దీనికోసం శ్రీరాములు నిరాహారదీక్షచేసే అవసరాన్ని కల్పించకూడదు. ఒకవేళ అతడు నిరాహారదీక్షకు పూనుకొన్నట్లయితే విరమింపజేయడానికి మనమధ్య గాంధీజీ కూడా లేడు. అందువల్ల వచ్చే జనవరి 30వ తేదీ నాటికి సక్రమంగా సంఘసేవా దినాన్ని జరిపే ఆలోచన చేయండి. అందుకోసం సర్వోదయ నాయకులైన వినోభాజీ సేవల్ని కూడా పొందవచ్చు .."

గాంధీజీ అనుచరుల్లో ముఖ్యుడు హరిజన పత్రిక సంపాదకుడూ అయిన కిషోర్‌లాల్ మష్రూవాలా, పొట్టి శ్రీరాములు చేసిన సూచనలను ఒక వంక ప్రశంసిస్తూనే వేరొకవంక వ్యతిరేకించాడు. పొట్టి శ్రీరాములుకు మష్రూవాలా రాసిన జాబులో "మద్రాసు ప్రభుత్వం మీ సూచనలను సత్వరం అమలుపరచకపోతే నిరాహార దీక్ష చేయవలసి వస్తుందని హెచ్చరించడం సిద్ధాంతపరంగాకానీ, ఆచరణాత్మకంగాకానీ ప్రయోజనకారి కాదని నా విశ్వాసం. అంటరానితనాన్ని నిర్మూలించడానికి వ్యతిరేకిస్తూ, కులతత్వాన్ని బలపరుస్తూ, ప్రభుత్వం ఉత్తర్వులు చేసినప్పుడు మాత్రమే నిరసనవ్రత దీక్ష చేయడం అవసరం". మష్రూవాలా అభిప్రాయాలను గౌరవిస్తూనే శ్రీరాములు ఇలా జవాబు వ్రాశాడు "సంఘ సంస్కరణ చేయడం ప్రభుత్వవిధి. ప్రభుత్వంలో వున్నవారు స్వప్రయోజనంకోసం దీన్ని చేస్తారు. ఇందుకై సంఘసేవకులు సకాలంలో ప్రభుత్వంపై వత్తిడితేవాలి. కేవలం చట్టాలుచేసి లాభంలేదు. అవి ఆచరణలో పెట్టాలి. అందుకు ఇదే తగిన సమయం. (1)

ఇలా పొట్టి శ్రీరాములు మష్రూవాలాతో తన హృదయావేదనను తెలిపిన తరువాత గాంధీజీ అనుచరులమని చెప్పుకునే కాంగ్రెస్ పెద్దలచేత తాను ఏకాకిగా చేయబడిన అంశాన్ని ఇలా తెలియజేశాడు. "ఆచార్య రంగాగారు అతి కష్టంమీద నా అభిప్రాయాన్ని అర్థంచేసుకొన్నారు కానీ ఈ విషయం తీర్మానం జరిగిన

1) 5-7-1948వ మష్రూవాలాకు వ్రాసిన లేఖ.

తరువాత మరచిపోయారు. ఎర్నేని సుబ్రహ్మణ్యంగారు కొంత సానుభూతిని జూపినా తగినంత ఉత్సాహం చూపలేదు. గొల్లపూడి సీతారామశాస్త్రి గారు అసలే పట్టించుకోలేదు. ఈ సూచనలను రాజేంద్ర బాబాగారికి పంపాను. కానీ వారి దగ్గర నుంచి కూడా సమాధానం లేదు నా సూచనలను అందరికీ తెలియజేయడానికి నాకింక ఏ మార్గమూ కనబడటంలేదు. గాంధీ మెమోరియల్ స్కీమును మద్రాసు ప్రభుత్వం అమలుచేసేటట్లు చూడమని, అమలు చేయని పక్షంలో ఉపవాసదీక్ష తప్పదని మష్రూవాలాకు విజ్ఞప్తిచేశాడు.

అస్పృశ్యతాది సాంఘిక దురాచారాలను నిర్మూలించడానికి శ్రీరాములు చేపట్టిన కార్యక్రమాలు రాష్ట్రీయ, జాతీయ స్థాయిలలో అఖండ ఖ్యాతిని సాధించాయి. కొందరు అతణ్ణి విమర్శించినా నిజమైన అతని మనో ధైర్యాన్ని కొందరు నాయకులు గుర్తించారు. ఫలితంగా ఆంధ్రరాష్ట్ర హరిజన సేవక సంఘాధ్యక్షుడు బి.యస్. మూర్తి "రాజ్యాంగంలోని 10 వ నిబంధన ప్రకారం నీవు హరిజన సేవక సంఘపు ఆంధ్రరాష్ట్ర శాఖలో సభ్యుడుగా ఎన్నికయ్యావు. మన బాపూజీకి ప్రియమైన హరిజనోద్ధరణకై నీవంతు సేవ చేయగలవని ఆశిస్తున్నాను". (1) అని తెలియజేశాడు.

అధికారంతో తృప్తిపొందేవాడు కాదు. పొట్టి శ్రీరాములు కృషి అతని పూజా త్యాగం, అతని సిద్ధాంతం మష్రూవాలా తన పనులపై అసంతృప్తిని ప్రకటించి నప్పుడు కొంత కలవరపడ్డాడు. ఐనా తానాతని 5-7-1948న వ్రాసిన లేఖ అతని అసంతృప్తిని తొలగించి మద్రాసు ప్రభుత్వంలో గాంధీజీ మెమోరియల్ స్కీమును అమలుపరచడానికి ఆయనను పురికొల్పుతుందని భావించాడు. కానీ 9-6-1948నాటి మష్రూవాలా లేఖ శ్రీరాములు ఆశలను అంతరింపజేసేదిగా కనిపించింది. మష్రూవాలా లేఖలోని అంశాలివి.

"ఈ పని ప్రభుత్వమే చేయాలని నీవనుకుంటే బాపూజీ రచించిన 'హోమ్‌రూల్' అనే గ్రంథాన్నీ మళ్ళా ఒకసారి చదువు. ఏ పార్లమెంటరీ యంత్రాంగం కూడా అలా చేస్తుందని ఆశించకూడదు. పైగా అది ఎక్కువ

---

1) Selection orders dated 8-7-1948 issued to Potti Sriramulu by B. S. Murthy, President, Harijan Sevak Sangh, Madras.

అపకారం చేస్తుంది. రాష్ట్రమంతా సంస్కరింపబడాలని ఎంచకుండా నీవు ఏదో ఒక గ్రామాన్ని ఎంపికచేసుకొని అక్కడ నీ సంస్కరణోద్యమాన్ని ప్రారంభించు. రాష్ట్ర సంస్కరణోద్యమాన్ని భగవంతునికి వదలితే మంచిది. మంచి పనులు, ఉద్యమాలు దావానంలా వ్యాపిస్తాయి. మనకు కార్యోత్సాహం అధికంగా వుందిగాని పట్టుదల లేదు. పూర్వం ఒక జైనరాజు నల్లులను, పురుగులను చంపిన ప్రజలకు జరిమానాగా ఆస్తిపాస్తులను స్వాధీన పరచుకొనవలసిందని ఉత్తరువులు చేశాడట. మన కార్యోత్సాహం కూడా అలాంటిదే. నీవు మరలా ఒకసారి జాగ్రత్తగా ఆలోచించవలసినది. ...నేను నీ ఉద్దేశాన్ని మద్రాసు రాష్ట్ర మంత్రికి తెలిపినందువల్ల ప్రయోజనం వుండదు. రాష్ట్రంలోని విభిన్న భాషల, తెగల చిక్కు సమస్యలవల్ల, సరిహద్దు ప్రాంతమైన హైదరాబాదువల్ల మద్రాసు ముఖ్యమంత్రికి నిర్మాణాత్మక కార్యక్రమాల విషయమై తగినంత శ్రద్ధ చూపే అవకాశం లేకపోవచ్చు. అతని మంత్రివర్గంకూడా అతనికి సహకరిస్తుందని నమ్మకం నాకులేదు. (1) ఎ.వి. ధక్కర్ కూడా ఇదే వుద్దేశాన్ని వ్యక్తపరుస్తూ... ఇందుకు సంబంధించి నేను నీకు సానుభూతి తెలుపుతున్నాను. అయితే నీవు తొందరపాటుతో నిరాహారదీక్షకు పూనుకొని గందరగోళ పడవద్దని కొరుతున్నాను. (2)

ప్రముఖ గాంధేయవాదులతో సుదీర్ఘమైన ఉత్తర ప్రత్యుత్తరాలు జరపటంవల్ల అనుకూలమైన సమాధానం వారినుండి రాకపోగా సమస్య మరింత జటిలమవుతుందని ఈ సందర్భంగా శ్రీరాములు గ్రహించాడు. ప్రతికూల వాతావరణం వున్నప్పటికీ జాతీయ, ప్రాంతీయ నాయకుల ప్రోత్సాహం లేకపోయినా తను నమ్మిన ధ్యేయంకోసం ఏకాకిగా పోరాడటానికి పూనుకొన్నాడు. వెంటనే 25-7-1948 న మద్రాసు ముఖ్యమంత్రికి తాను ఉపవాసదీక్షను పూనుకో బోతున్నట్లు లేఖ వ్రాశాడు. అందులో ముఖ్యాంశాలిలా వున్నాయి.

"నేను మీకు 17-6-1948న వ్రాసిన జాబుకు పోస్టల్ ఎక్నాలెడ్జ్మెంట్ మాత్రమే సమాధానంగా వచ్చింది. అందుకు విచారిస్తున్నాను. అస్పృశ్యత నిర్మూలన, సంఘసేవా దినాన్ని పాటించడం మున్నగు అంశాలను మీకు నచ్చజెప్పడానికి

---

1) 9-6-1948న పొట్టి శ్రీరాములు మష్రూవాలాకు వ్రాసిన లేఖ.

2) 2-7-1948న ఎ.వి. ధక్కర్ శ్రీరాములుకు వ్రాసిన లేఖ.

నిరశన వ్రతమే మార్గమని భావిస్తున్నాను. వచ్చే గాంధీ జయంతి నాటికయినా సంఘసేవా దినంగా జరిపేటట్లు ప్రజా చైతన్యాన్ని కలిగించి మీ మీద వత్తిడి తేవడానికి నేను 10-9-1948 నుండి మీ బంగళాముందే నిరాహారదీక్ష ప్రారంభిస్తాను. ఈ స్కీము విషయమై నేను సూచించిన సూచనల ప్రతిని ఈ లేఖతో జతపరుస్తున్నాను". (1)

శ్రీరాములు తన ఆశయాలకు చేయూతనీయవలసిందిగా ప్రముఖ గాంధేయ వాదులందరినీ అర్థించాడు. (2) ఈ విషయంగా శ్రీరాములు వ్రాసిన లేఖలకు ప్రముఖుల సందేశ సారాంశాలిలా వున్నాయి.

1. **కిషోర్‌లాల్ మష్రూవాలా :-** "నీ నిరాహారదీక్ష నాకు సమ్మతం కాదు నీ ఉపవాసదీక్ష సమర్థనీయం కాదు. నీవు దీక్ష వహించినా ముఖ్యమంత్రి గృహం ముందే చేయవలసిన అవసరమేముంది ? ఇది సత్యాగ్రహంకాదు. ఆత్మశుద్ధికై చేసే శాంతియుత ఆందోళనా కాదు. నీ బెదిరింపు ధోరణిని విరమించుకోవలసింది. నీ దీక్షను నేను సమర్థించను.

2. **ఆచార్య రంగా పర్సనల్ సెక్రెటరీ :-** "నీ సూచనలను మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి పరిశీలిస్తున్నారు. త్వరలో తగిన చర్య తీసుకొంటారు. కనుక ఉపవాస దీక్షను విరమించవలసింది". (15-8-1948 నాటి లేఖ)

3. **చిమన్‌లాల్ (సేవాగ్రామం మేనేజర్) :-** "ఉపవాసదీక్ష నోటీసు రాజాజీకి కూడా అందజేశాము. నీ అభిప్రాయాలను నీ స్నేహితులకే అర్థమయ్యేలా చెప్పలేవు. ఇక ప్రజలను ఎలా ప్రభావితం చేస్తావు ? నీ లక్ష్యం మంచిదే. కానీ నీవు మహాత్ముణ్ణి సరిగా అర్థంచేసుకోలేదు. ఉపవాస దీక్ష పూనుకొనేముందు నాలాంటి స్నేహితులకు నీ ఉద్దేశాలను తెలిపి ఉండవలసింది".(3)

---

1) 25-7-1948న పొట్టి శ్రీరాములు మద్రాసు ముఖ్యమంత్రికి వ్రాసిన లేఖ.

2) 5-9-1948న శ్రీరాములు మష్రూవాలాకు వ్రాసిన లేఖ.

3) 27-8-1948న శ్రీరాములుకు చిమన్‌లాల్ వ్రాసిన లేఖ.

**4.** గోపరాజు రామచంద్రరావు :- "నీవు నిరసనదీక్ష వహించి నందుకు విచారిస్తున్నాను. ఆత్మ త్యాగం వల్ల ఇంతకంటే గొప్ప పనులు సాధించవచ్చు". (1)

**5.** ప్రభాకర్‌జీ, సేవాగ్రామం :- "నీ లక్ష్యం పవిత్రమైందే. అయినా నీ మార్గం అపవిత్రమైంది".

**6.** మున్నాలాల్, సేవాగ్రామం :- "మీరు సాధించదలచిన కార్యం సదుద్దేశమైంది. మీరు ఉపవాసదీక్ష పూనడం తప్పటడుగు వేస్తున్నట్లు కనపడుతున్నది. మీ మార్గాన్ని నేను వ్యతిరేకిస్తున్నాను.

అయినా శ్రీరాములు నిరుత్సాహపడలేదు. మద్రాసులో ముఖ్యమంత్రి కార్యాలయం ఎదుట 10-9-1948న నిరశనవ్రతం ప్రారంభించాడు సహకారం అందిస్తామన్న వాళ్లంతా సమయానికి తప్పుకొన్నారు. ఈ విషయం శ్రీరాములును కలవరపరచింది. హరిజన శాసనసభ్యులు కూడా ఇందుకు తోడ్పడలేదు. ప్రముఖ సంఘసేవకులలో ఎవరూ శ్రీరాములుకు తోడ్పడలేదు. మద్రాసు రాష్ట్రపు పత్రికలు కూడా తోడ్పడలేదు. కనీసం యదార్థ వార్తమకూడా ప్రకటించలేదు. శ్రీరాములు ఆశలు ఒక్కటీ ఫలించలేదు. 'హరిజన బ్రహ్మ' శ్రీ రాయుడు గంగయ్య ఈ విషయాన్ని గురించి ప్రయత్నం చేశాడు కాని ఆయనను ఎవరూ లక్ష్యం చేయలేదు. అతను విసిగిపోయి మద్రాసును వదలి వెళ్లాడు. (2)

శ్రీరాములు 29-9-1948న కిషోర్‌లాల్‌కు వ్రాసిన లేఖలో తాను దీక్షను విరమించిన హృదయ విదారక విషయాన్ని ఇలా వివరించాడు "నేను దీక్ష ప్రారంభించిన పదకొండవరోజు న్యూసెన్స్ ఆక్టుక్రింద అరెస్టు చేశారు. మద్రాసు జైల్లో 'సి' క్లాసులో ఒకనెల కఠిన కారాగార శిక్ష పొందాను. జైల్లో కూడా ఒక వారం రోజులు ఉపవాసదీక్ష కొనసాగించాను. నిరాహారదీక్ష చేసే వారికి అవసరమైన ఎనిమా, నిమ్మరసం మొదలైన సౌకర్యాలు కలిగించడానికి జైలు అధికారులు నిరాకరించారు పరిస్థితి విషమించిన తరుణంలో అన్నం తినమని నిర్బంధించారు.

---

1) సేవాగ్రామం నుండి మున్నాలాల్ శ్రీరాములుకు వ్రాసిన లేఖ.

2) 29-9-48న శ్రీరాములు మష్రూవాలాకు వ్రాసిన లేఖ.

ఎన్నోవిధాల బెదిరించారు. జైల్లో నేను రక్తం కక్కుకొన్నాను. అలాంటి పరిస్థితిలో నేను విడుదలయితే మరల దీక్ష పూనకుండా నన్ను వికలాంగుణ్ణి చేసి కక్ష తీర్చుకోవాలని ప్రభుత్వం యత్నిస్తున్నట్లు కనబడుతున్నది. బైట నా దీక్షను ఎక్కడ కొనసాగించాలి. అందుకే ఎక్కడా తావులేక ముఖ్యమంత్రి నివాసాన్ని ఎన్నుకొన్నాను. నా లక్ష్యసాధనకై చావనైనా చస్తానుగాని వికలాంగుడిలా వుండి బంధు మిత్రులకు భారం కాజాలను. ఈ స్థితిలో దీక్ష విరమించడం మేలని తోచింది. జైల్లోనే దీక్ష విరమించాను. శిక్షాకాలం ముగియకుండానే ప్రభుత్వం బేషరతుగా నన్ను విడుదలచేసింది. భవిష్యత్తులో ఇంతకంటే అనుకూలమైన పరిస్థితులేర్పడినపుడు ఈ విషయమై ప్రభుత్వంపై ఒత్తిడి తేవడానికి నేను సిద్ధంగా వున్నాను"

గాంధీజీ లాగే శ్రీరాములు మాటల మనిషికాదు. చేతలమనిషి. జయాపజయాలు అతని దృష్టిలో సమానం. గాంధేయుడైన శ్రీరాములు తిలక్ చెప్పిన గీతార్థాన్ని గ్రహించాడు. "దైవభక్తుని మనస్సులో మరియు విధినిర్వహణలో శ్రద్ధ, ఆత్మవిశ్వాసం, సత్యపాలన తప్ప ఇతర విషయాలు ఉండరాదు. ఈ సుగుణాలు లక్ష్య సాధనకు తోడ్పడతాయి. ఇవి విద్యవల్ల, పాండిత్యంవల్ల లభించేవికావు. తపస్సాధనద్వారా దృఢ సంకల్పుడైన వ్యక్తి సాధిస్తాడని భగవద్గీత బోధిస్తున్నది. (1) ఇలాంటి మనస్థైర్యం కలవాడు పొట్టి శ్రీరాములు. అతడు అడిగిన సూటి ప్రశ్నలకు మహా మేధావులే సమాధానం చెప్పజాలరు కిషోర్‌లాల్ మష్రూవాలా నడిగిన ఈ ప్రశ్నల లాంటివి అస్పృశ్యత జీవించినంతకాలం తాను మరణించినట్లేనని బాపూజీ చెబుతూండేవాడు. అదే మన ధ్యేయం ఎందుకు కారాదు ? సిద్ధాంతాల గురించి ఊరక చర్చించుకునేదానికంటే ఆచరణ ఎందుకు పెట్టకూడదు ? దీన్లో ఎలాంటి స్వార్థచింతన లేదుగదా ? ప్రభుత్వం అంటరానితనాన్ని నిర్మూలించడానికి దృఢ నిశ్చయంతో వుంటే బలవంతం ఎందుకు ? ఈనాటికి కూడా హరిజనులపై జరిగే దౌర్జన్యాన్ని ఎంతకాలం సహించాలి ? (2) ఈ ప్రశ్నలు మష్రూవాలాకే కాదు ఎవరికైనా కలవరం కలిగిస్తాయి.

---

1) Quoted by J. B. Krupalani – Gandhi His Life and Thought 1-3-1959.

2) 29-9-1948న శ్రీరాములు మష్రూవాలాకు వ్రాసిన లేఖ

శ్రీరాములు, చిమన్‌లాల్ మొదలైన సేవాగ్రామం ఆశ్రమవాసులకు తన కార్యక్రమాలపట్ల కలిగిన అపోహలను నిర్మూలించడానికి ప్రయత్నించాడు. తన లక్ష్యసాధనకై ప్రత్యామ్నాయ మార్గం సూచించకుండ అదేపనిగా విమర్శిస్తున్నందుకు నింద మోపాడు. చర్చలకై సేవాగ్రామం రాలేదని రాజేంద్రబాబు వంటి పెద్దల అనుమతి తీసుకోలేదని వాళ్ళు భావించినందుకు మండిపడ్డాడు. ఈ అంశాన్ని గురించి చిమన్‌లాల్‌కు రాసిన లేఖలో ఇలా అన్నాడు.

"మీరు నన్ను గురించి చేసిన నిందలను ఎదుర్కోవడానికి నేను సిద్ధంగా వున్నాను. గత కొన్ని మాసాలుగా మీరు నన్ను నిందిస్తూనే వున్నారు. అయితే అదే మీ లక్ష్యం కారాదు. అంటరానితనాన్ని నిర్మూలించడానికి తగిన మార్గాన్ని మీరు ఆలోచించలేదు. నాకు తెలుపలేదు. జూన్ 17న మీకు నా సూచనలతో లేఖ వ్రాశాను. నా సూచనలను మీరు శ్లాఘించారు. మశ్రూవాలా హరిజన పత్రికలో ప్రచురిస్తానన్నాడు. మొదట్లో మశ్రూవాలా సానుభూతి ప్రకటించాడు. కానీ ధక్కర్‌బాపా నా నిరాహారదీక్షను ఖండించిన తరువాత మనస్సు మార్చుకొన్నాడు. బరోడాలో వున్నప్పుడు సేవాగ్రామం రమ్మంటే వచ్చివుండేవాణ్ణి. నేను దీక్ష ప్రారంభించే సమయంలో సేవాగ్రామంకు రమన్నారు. కారణం లేకుండా నేను నా దీక్షను విరమించుకోను. మీరు నన్ను నిందిస్తూ రాసిన లేఖలో మశ్రూవాలా వాదనలను ప్రారంభిస్తున్నట్లు అర్థమవుతుంది. మీరు రాజేంద్రబాబులాంటి పెద్దల అనుమతి పొందివుంటే బాగుండేదన్నారు. పెద్దలంతా ఒప్పుకుంటే నిరాహారదీక్షతో అవసరమేలేదు. మీరు మరచారనుకొంటాను. వీళ్లలో ఎవ్వరూ బాపూజీ స్థానాన్ని భర్తీ చేయలేరు. వాళ్ళు గొప్పవాళ్ళు, వాళ్ల సలహాలు అమూల్యమైనవేనని అంగీకరిస్తాను. అయితే ఎవరి నిర్ణయాలు వాళ్ళు సొంతంగా తీసుకోవాలి. ఇప్పటికే రాజేంద్రబాబుతో సంప్రదించనందుకు విచారిస్తున్నాను. ఇప్పటికైనా వారికీ విషయం తెలుసునో లేదో. ఆయన పదవీకాలం ముగియకముందే మీరు వారితో సంప్రదించవలసిందిగా కోరుతున్నాను.

శ్రీరాములు సహజంగా ధైర్యోత్సాహాలు కలవాడు. కనుకనే స్థంభించి పోయిన ప్రభుత్వ పాలనను గురించి ప్రస్తావిస్తూ అది స్వార్థ చింతనతో వుందనీ, పేదప్రజల బాధలను గూర్చి ఆలోచించడానికి ప్రాముఖ్యమీయడం లేదని తన అసంతృప్తిని ప్రకటిస్తూ ఇలా అన్నాడు.

"మీరు నాయకుల బరువు బాధ్యతలను గూర్చి మాట్లాడుతున్నారు. కాని పేదప్రజల (ముఖ్యంగా హరిజనుల) బాధలను గూర్చి ఆలోచంచడంలేదు. ఎక్కడ దేశనాయకులు స్వార్థంకోసం కలహించుకొని హరిజనోద్ధరణను విస్మరిస్తున్నారో ఆ రాష్ట్రాలకు మాత్రమే నా సూచనలు ఉద్దేశించబడ్డాయి. ఈ ఉపవాసదీక్షలు ప్రభుత్వాన్ని సరైన మార్గంలో నడిపించడానికి చేసే ప్రయత్నం మాత్రమే". (1)

శ్రీరాములు జైలునుండి విడుదలైన తరువాత రెండు మాసాలు నెల్లూరులో వున్నాడు. ఈ కాలంలో ఆయన ప్రముఖ రాజకీయనాయకు లందరితో తన ఆశయాన్ని విశదీకరిస్తూ ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు. కానీ ఈ ప్రయత్నం బూడిదలో పోసిన పన్నీరయింది. (2) కనుక లక్ష్యాన్ని సాధించడమో లేక మరణించడమో తేల్చుకోవాలనే సాహసోపేతమైన నిర్ణయానికి వచ్చాడు. శ్రీరాములు ఉపవాసదీక్షకు ఆశ్రమాన్నే అనువైన స్థలంగా ఎంచుకొన్నాడు. ఈ దీక్షకు సంబంధించిన నోటీసును గాంధేయుల కందించినందువల్ల ప్రయోజనం లేదని గ్రహించాడు. రాజన్‌బాబు వంటివారికి కొందరికి తెలిపినా వారు సహకరించడం మానేశారు. నా దృఢ సంకల్పంతో 12-1-1949 నుండి దీక్ష ప్రారంభిస్తున్నట్లు ప్రకటించాడు.

పొట్టి శ్రీరాములు అనుసరిస్తున్న పద్ధతిపై అసంతృప్తి కనబరచినా రాజేంద్రప్రసాద్ అతని ఆశయాలపై సానుభూతి చూపాడు. శ్రీరాములుపై కనికరం కలిగి రాజేంద్రప్రసాద్ మద్రాసు ముఖ్యమంత్రికి ఇలా లేఖ వ్రాశాడు.

నెల్లూరు వాస్తవ్యుడైన శ్రీరాములు గూర్చి మీకు తెలుసనుకుంటాను. అతడు హరిజనోద్ధరణ గురించి కార్యక్రమాలలో నిమగ్నుడై పాటుపడుతున్న సంఘ సేవకుడు. అతను ఆచరణాత్మక ప్రచారాన్ని చేస్తున్నాడు. ఇందుకు ప్రభుత్వం కూడా సహకరించాలి. మీరు హరిజన్ వెల్‌ఫేర్ కమిటీని ఏర్పరచారని తెలుసుకున్నాను. అంటరానితనాన్ని నిర్మూలించడాన్ని ఆచరణలో పెట్టడానికి నెలకొకమారు హరిజనదినం పాటించవలసిందని ఆ కమిటీ మీకు సిఫార్సు చేసినట్లు తెలిసింది. హరిజనులకు దేవాలయాల్లో, బహిరంగ ప్రదేశాల్లో ప్రవేశం కల్పిస్తూ

---

1) 30-9-1948న శ్రీరాములు చిమన్‌లాల్‌కు వ్రాసిన లేఖ.

2) 29-9-1948న శ్రీరాములు మష్రూవాలాకు వ్రాసిన లేఖ.

రెండు చట్టాలను చేసిన మీ ప్రభుత్వం సంవత్సరానికి ఒకనెల వాటిని ఆచరణలో చూపి ప్రోత్సహించవలసిందిని శ్రీరాములు కోరుతున్నాడు. ఈ విషయమై పాఠశాలల్లో ఉపాధ్యాయులు నెలకొకసారి బాలబాలికలను దేవాలయాలకు ప్రభాత్ ఫేరీలకోసం, ప్రార్థనలకోసం తీసుకొని వెళ్లాలి ఈ విషయంతో గ్రామాధికారుల సహాయాన్నికూడా పొందాలి. పొట్టి శ్రీరాములు ఈ విషయమై మిమ్మల్ని కలిసినా ఎటువంటి సమాధానం పొందనట్లు తెలుసుకొన్నాను. అతను ఉపవాస దీక్ష పూనాలని ఆలోచిస్తున్నాడు. ఆ ప్రయత్నాన్ని విరమించమని నేను చెప్పాను. మీ రెంతవరకు కృషిచేసిందీ తెలుసుకోవాలనుకొంటున్నాను. (1)

భగవంతుడు నిజమైన భక్తులను పరీక్షించడం వినోదంగా భావిస్తాడనేది వాస్తవం. శ్రీరాములు చేపట్టిన సమస్య మద్రాసు ముఖ్యమంత్రి దృష్టికి తేబడిందని అది పరిష్కరింపబడుతుందని రాజేంద్రప్రసాద్ లేఖ రాశాడు. ఉపవాస దీక్షను మానివేయమని, మానివేయడం ఇష్టంలేకపోతే వినోబా అనుమతితో చేయమని సూచించాడు.

ఈ లోపల చిమన్‌లాల్‌కు శ్రీరాములు జాబు రాశాడు. ప్రముఖ గాంధేయవాదులు తనను హృదయపూర్వకంగా సమర్థించడంలేదు. అయినా లక్ష్య సాధనకై తాను ముందడుగు వేయదలచాడు చెప్పిన మాట, చేసిన వాగ్దానాలు వ్యర్థమయ్యాయి. ఎంతోకాలం ఎదురుచూశాడు. పెద్దల సలహాలననుసరించడం తనమతాను ఆత్మవంచన చేసుకోవడమే. మద్రాసు రాష్ట్రంలోనైనా తన లక్ష్యం నెరవేరుతుందని ఆశించాడు. కాని తన ఆశ నిరాశయింది. ఈ విషయంలో తను కృషిచేయకపోతే తన విద్యుక్తధర్మాన్ని విస్మరించినట్లే. ఈ విషయంలో తాను ఎన్ని బాధలనైనా అనుభవించదలచాడు. అవసరమైతే తాను ఆత్మార్పణకు కూడా సిద్ధమే. కానీ ఉపవాసదీక్షలు వుంటే జైలు నుండి విడుదలఅయ్యే అవకాశం లేనందున మద్రాసు జైల్లో తను తన నిరసన దీక్షను విరమించాడు. ఇవీ లేఖలోని అంశాలు.

వ్యర్థమైన సలహాలిస్తు హృదయం లేకుండా ప్రవర్తించే ఆశ్రమవాసుల ధోరణికి విసుగుచెందాడు. తానక్కడికి వెళ్లడమే గొప్పతప్పని భావించాడు. తాను

---

1) 25-12-1948న రాజేంద్రప్రసాద్ మద్రాసు ముఖ్యమంత్రికి వ్రాసిన లేఖ.

ఆశ్రమంలో పడిన బాధలగురించి చిమన్‌లాల్‌కు లేఖ రాశాడు. తుదివరకు ఆశయ సాధనకై నిప్పులమీద నడవడానికి కూడా సిద్ధంగా వున్నానని తెలిపాడు. దేశంలో పరిమితమైన ప్రయోజనం కోసం ప్రతిరోజు ఎన్నో ఆందోళనలు జరుగుతున్నాయి. ఒక స్వతంత్ర దేశంలో జీవితావసర హక్కులు తిరస్కరించబడిన కోట్లాది ప్రజలకు సంబంధించి ఏ ఆందోళనా జరగకపోవడం పొట్టి శ్రీరాముల మనస్సును కలతరేపింది.

ఆశ్రమవాసులు ఉదాసీన భావంతో వుంటే పట్టుదలతో నిరసనవ్రతం బూనడంవల్ల ఎలాంటి చిక్కు సమస్యలు కలుగుతాయో గాంధేయుడైన పొట్టి శ్రీరాములుకు తెలుసు. అయితే ఉన్నత లక్ష్యాన్ని ఆశించిన అతడు దేనికైనా సిద్ధమయ్యాడు. ఆశ్రమంలో నిరసనదీక్ష విఫలమైతే వీధులలో ఆమరణ నిరాహార దీక్షకు అతడు సిద్ధంగా వున్నాడు. శ్రీరాములు చిమన్‌లాల్‌కు తన నిశ్చయాన్ని తెలుపుతూ ఇలా రాశాడు.

"నాకిప్పుడు రెండే మార్గాలు కనిపిస్తున్నాయి.

1. ఆశ్రమంబైట ఎక్కడో దీక్ష సాగించడం.
2. ఎక్కడో ఒకచోట మరణించడం.

నేను ఎవ్వరి సహాయము ఆశించడంలేదు. శుక్రవారం 7-1-1949 న భోజనం చేశాను అదే నాకు తుది భోజనం అవుతుంది. ఆశ్రమానికి వచ్చే ఉద్దేశం లేదు. ఆశ్రమాన్ని విడిచే పక్షంలో మంచినీరుకూడా తాకను". (1)

నిర్ణయించిన పథకం ప్రకారం పొట్టి శ్రీరాములు సేవాగ్రాం ఆశ్రమ ప్రాంగణంలో 12-1-1949న దీక్ష ప్రారంభించవలసి వుంది. దురదృష్టవశాత్తు ఆశ్రమ యాజమాన్యం వారు సహకరించనందువల్ల దీక్ష వహించలేదు. ఈ సందర్భంలో ఆశ్రమవాసులు ప్రదర్శించిన ఆగ్రహ వైఖరిని తన మేనల్లుడైన ఎస్.ఆర్. గుప్తాకు లేఖ వ్రాశాడు.

స్థితప్రజ్ఞ సిద్ధాంతాన్ని (2) జీర్ణించుకొన్న పొట్టి శ్రీరాములు తన ఆశయాలను, అభిప్రాయాలను తన మేనల్లుడికి రాసిన లేఖలో, జనవరి 30వ తేదీ

1) 6-1-1949న శ్రీరాములు చిమన్‌లాల్‌కు వ్రాసిన లేఖ
2) స్థిరప్రజ్ఞత - కష్టసుఖాలు సమానంగా చూడటం భగవద్గీతలో చెప్పబడింది.

నుండి నిరశనదీక్ష వహించదలచినట్లు దీనికి వ్యతిరేక ప్రకటనలు వెలువడుతాయనీ, తన ఆశయం, తన జీవిత కాలంలో నెరవేరకపోవచ్చనీ అయినప్పటికీ తన ప్రయత్నం అమూల్యమైందనీ రాశాడు. ఇంకా రిజర్వేషన్లతోనయినా తన లక్ష్యం సర్వజనామోద యోగ్యమైతే ప్రగతి సాధనకు వీలవుతుందనీ, దీన్ని తాను మరువలేననీ, ఇందువల్ల కలిగే కష్టాన్ని సహించే శక్తి భగవంతుడు తనకు ప్రసాదించాలని కోరుకుంటున్నాననీ అన్నాడు. నేడు ప్రతి ఒక్కరు గాంధీజీ నామోచ్చారణ చేస్తున్నారు. ఆయన అడుగుజాడల్లో నడవమని ఉద్బోధిస్తున్నారు. కానీ ఆచరణల్లో పెట్టడంలేదని అన్నాడు. తన ప్రయత్నం, తన తపస్సు వృధా కావనీ, కేవలం ప్రచారంపై తానాధారపడననీ, కృషితో ప్రజా చైతన్యం కలిగించాలనీ, అందుకు విధి నిర్వహణలో నిమగ్నుడనవుతున్నానని, తన అసమర్థత ఏమిటో తనకు తెలుసనీ, ప్రజలకు సంబంధించిన విషయంలో ఫలితమనేది కేవలం కృషిని సాగించే వ్యక్తిపై, అతని సామర్థ్యంపై ఆధారపడి వుంటుందనీ, తన అవకాశాన్ని తాను పరీక్షించుకొంటాననీ, అన్నాడు. (1) ఈ సందర్భంలో శ్రీరాములు హరిజనోద్ధరణ కార్యక్రమాన్ని 1949 వ సంవత్సరం జనవరి 30 వ తేదీన సర్వోదయ సమాజంవారితో జరిపించడానికి బాధ్యత వహిస్తూ ధక్కర్‌బాపా 23-1-1948న మద్రాసువాలాకు రాసిన లేఖను పొట్టి శ్రీరాములు పేర్కొంటూ హరిజనోద్ధరణ లక్ష్యంతో స్థాపింపబడిన హరిజన్ పత్రికలో ఆ వార్తకు చోటు లేకపోయిన విషయాన్ని వివరించాడు. గాంధీజీకి ఎంతో ప్రియమైన ఈ కార్యక్రమం ఏ గొప్పవారి అనుకూలత, కోపమూ అవసక్కరలేదని భావించాడు పెద్దలంతా తనను ఆందోళనపడవద్దంటున్నారనీ, వాళ్ల మాటలను వినడమెలాగనీ, మన మధ్యనే వుంటూ గాంధీ చంపబడ్డాడు. అందుకు స్మారకచిహ్నంగా గాంధీజం పూడ్చి పెట్టబడుతున్నదనీ తానూ గాంధీజీతోపాటు పోయివుంటే బాగుండేదనీ అన్నాడు.

పొట్టి శ్రీరాములు నిరాశాభావంతో ఆశ్రమాన్నివదలి రావాలనే ప్రయత్నాల్లో ఉండగా ఒక ఆశాకిరణంఅతణ్ణి చైతన్యవంతుణ్ణి చేసింది. 11-1-1949 న వినోబాభావే నుండి ఉత్తరం వచ్చింది. ఆ లేఖ శ్రీరాములుకు ప్రోత్సాహాన్ని యిచ్చేదిగా వుంది. దానిలో పొట్టి శ్రీరాములు దీక్షకు అనుమతించ వలసిందని, తమకు ఇష్టంలేనంత మాత్రాన అతని లక్ష్యాన్ని ఆటంకపరచ కూడదని ఆశ్రమ

---

1) 11-1-1949న శ్రీరాములు యన్ ఆర్. గుప్తకు వ్రాసిన లేఖ.

యాజమాన్యాన్ని కోరాడు. అదేవిధంగా దీక్షకు విజయం లభించకపోయినా ఆవేశానికి లోనుగాక దేవునిలో విశ్వాసాన్ని పెంపొందించుకోవాల్సిందిగా శ్రీరాములుకు సలహా ఇచ్చాడు.

సేవాగ్రాం ఆశ్రమ ప్రాంగణంలో 12-1-1949 న మధ్యాహ్నం 12 గంటలకు శ్రీరాములు తన 28 రోజుల నిరాహారదీక్షను ప్రారంభించాడు. ఆ సందర్భంలో తన దీక్షా లక్ష్యాన్ని ఇలా ప్రకటించాడు.

అంటరానితనాన్ని నిర్మూలించడానికి ప్రజలు ప్రభుత్వం సమైక్యంగా కృషి చేయాలి. దీనికై 30-1-1949 నుండి కనీసం సంవత్సరం ప్రతినెలా హరిజన సేవాదినం జరపాలి. హరిజనులు బహిరంగ స్థలాలను వాడుకొనేటట్లు చేయాలి. అనేది ప్రకటన సారాంశం.

నిరసనదీక్షా సమయంలో శ్రీరాములు తన దిన చర్యను రాశాడు. సుదీర్ఘమైన ఆయన దినచర్య నుండి కొద్ది భాగం సంక్షిప్తంగా ఈ క్రింద పొందుపరచబడింది.

**17 జనవరి 1949 :-** అడగకుండానే వీలయినంతవరకు హరిజనులకు కనీస న్యాయం కల్పించాలి. ఆత్మశుద్ధికోసం నేను దీక్షను ప్రారంభించలేదు. నా దీక్ష కొక ప్రయోజనం వుంది. నన్ను సమర్థించమని ఏ రాజకీయ పక్షాన్నీ కోరను. ఆశ్రమ నిబంధనల మేరకు దీక్షను నిర్వహిస్తాను

**18 జనవరి 1949 :-** శాసనంద్వారా బహిరంగంగా ప్రజలు ధూమపానం చేయడాన్ని ప్రభుత్వం నిషేధించాలనుకుంటున్నది. కానీ అదే ప్రభుత్వం ప్రజలందరికీ సంబంధించిన ఈ కార్యక్రమాన్ని కొనసాగించడానికి ధైర్యం వహించడంలేదు.

**19 జనవరి 1949 :-** ఈ కార్యక్రమాన్ని సాధిస్తానని ఇప్పుడు నాకు విశ్వాసం కుదిరింది ప్రభుత్వం మనది, పాలకులు మనవాళ్ళు. ఈ పని చేస్తామని వాళ్ళు ప్రమాణం చేశారు. ఇక ఆలస్యమెందుకు. ఇంతకంటే మించి జీవిత కాలంలో కృషి చేయలేనేమో ననిపిస్తుంది.

**21 జనవరి 1949 :-** దైనందిన జీవితంలో పెద్దలపట్ల వినయం చూపుతాను. వారి భావాలతో ఏకీభవించకపోయినా వారిని వ్యతిరేకించను. అయితే సిద్ధాంతంలో భేదభావం తోచినప్పుడు నేను నా అంతరాత్మను చంపుకోను.

**24 జనవరి 1948 :-** ప్రజలకు కార్యోత్సాహం లేదని నేను నా దీక్షను విరమించడంలో అర్ధంలేదు. ప్రజలను ఆలోచింప చేయడానికే నా దీక్షను కొనసాగిస్తున్నాను. వాళ్ళు నా కృషిని అంగీకరించకపోతే మార్గాంతరాన్ని ఆలోచిస్తాను.

**25 జనవరి 1949 :-** ఏ సమయంలోనైనా ఈ దీక్షవల్ల నాకు మానసికంగా గాని శారీరకంగా కానీ ఏదైనా నష్టం సంభవిస్తే అంతకన్నా త్వరగా మరణించేటట్లు చేయమని భగవంతుని ప్రార్థిస్తాను

**1 ఫిబ్రవరి 1949 :-** పూజ్యుడైన సతీష్‌బాబు వచ్చి నాతో ఒక అరగంట చర్చించి వెళ్లాడు. ప్రజలంతా ఈ కార్యాన్ని మరచిపోయారనే విషయాన్ని అంగీకరించాడు. హరిజనులు ఎల్లకాలం అణగిమణగి వుండరు. తప్పక వారు హింసామార్గాన్ని అనుసరిస్తారు. నేను చేయగలిగింది చేస్తున్నాను. తక్కినది భగవంతునికి వదలిపెడుతున్నాను. అనే తర్కాన్ని అర్థంచేసుకోలేక పోతున్నాను. కృషి సాధ్యమైనప్పుడు ప్రయత్నం లేకుండ అంతా దేవుడిదే భారమని హరిజనులను హింసాచర్యలకు పురికొల్పడమా ? పెద్ద ఎత్తున కృషి జరిగితేనే ఈ పని సాధ్యమవుతుంది.

**3 ఫిబ్రవరి 1949 :-** రవిశంకర్ మహారాజు కూడా పోలీసు సహాయంతో ద్వారకా మందిరంలో ప్రవేశించాడు. అయితే అది అతనికి ఇష్టంలేదు. ఈ పరిస్థితి మారిపోవాలి.

పొట్టి శ్రీరాములు మేనల్లుడు యన్.ఆర్. గుప్తా అతణ్ణి శ్రీరాములు వరసు అని పిలుస్తాడు. ఆయన మేనమామకు ఎల్లప్పుడూ లక్ష్యసాధనకు ప్రేరణ కలిగిస్తువుంటాడు. సబర్మతీ ఆశ్రమంలో వున్నప్పుడు బీహార్ భూకంప బాధితుల సేవలో శ్రీరాములుకు సహచరుడుగా ఉన్నాడు సమయోచిత సలహాలనిస్తూ శ్రీరాములుకు కుడిభుజంగా వుండేవాడు. శ్రీరాములు లోపాలనుకూడా నిర్భయంగా విమర్శించేవాడు. శ్రీరాములు తుదిశ్వాస విడిచేవరకూ ఆయన వెన్నంటి సేవలు చేశాడు. యన్.ఆర్. గుప్తా జనవరి 1, 16 తేదీల్లో శ్రీరాములుకు రాసిన లేఖల్లో ఆయన ఉత్తమ లక్ష్యాన్ని నైతిక బలాన్ని ప్రశంసించాడు. ఈ సమయంలో శ్రీరాములు గుప్తాకు లేఖ వ్రాశాడు. దాని సారాంశం ఇది.

తాను ప్రస్తుతమున్న స్థితిలో గుప్తాలేఖ మందుగా పనిచేసింది. తాను జీవితాంతం గుప్తాకు కృతజ్ఞుణ్ణి. అతని జాబు చదువుతుండే శ్రీరాములుకు

అశ్రువులు స్రవించాయి. తనదగ్గర ఏ వనరులు లేవు. తాను రాజ్యాంగబద్ధమైన పద్ధతుల్లో నడవదలచుకొన్నాడు. ఒక సంవత్సరం నుంచి తన ఆశయాన్ని ప్రచారం చేస్తూనే వున్నాడు. డబ్బు అవసరం తనకు లేదు. 9 రోజులు ఉపవాస దీక్ష నడిచింది. తన బరువు 9 1/2 యల్ బి. లు తగ్గింది. మూడవ రోజు వాంతి చేసుకొన్నాడు తనకేమీ ఇబ్బంది లేదు. ఇప్పుడు తాను మామూలు పరిస్థితిలో వున్నాడు. తన టెలిగ్రాం చూసుకొని గుప్తా బయలుదేరాలి. అతను తనదగ్గర వుండాలని కోరుతున్నాడే గాని ప్రత్యేకమైన అవసరం ఏమీ లేదు. (1)

పొట్టి శ్రీరాములుకు ఆశలు వున్నా భ్రాంతి లేదు. పరిస్థితులకు అనుగుణంగా నడిచేవాడు. దానికి తగ్గట్లు ఆలోచించేవాడు. తన అంతరంగిక మిత్రుడు మోహన్‌భాయికి ఇలా రాశాడు.

"ఎందుకు నామాట శక్తిమంతంగా లేదో ఎందుకు కృషి సరిగా జరగటం లేదో ఎందుకు నేను నిర్లక్ష్యంగా వున్నానో తెలుసు. ఎందుకంటే నేను చాలా చిన్నవాణ్ణి. నాకు అనుచరులు లేరు. మన దేశంలో నీళ్ళ తెచ్చుకోవడానికి హరిజనులు ఎందుకిన్ని బాధలుపడాలి నా వెనుకటి నిరాహారదీక్షల్లో నేను గౌరవం కోసం ప్రాకులాడలేదు. ఆ దీక్షలో నేను బాగా ఆలోచించుకొనే వ్యవధి లేదు. ఎవ్వరిని నేను సంప్రదించలేదు ఇప్పుడు నా హృదయం మండిపోతున్నది. ఈ ఉపవాస దీక్ష వెనుకటి దీక్షల కంటే భిన్నంగా వుంది.

గొప్ప ప్రయత్నాలవల్ల కార్యసిద్ధి కలుగుతుందనేది సర్వజన విదితం. పొట్టి శ్రీరాములు కృషి రాజకీయ రంగంలో సంచలనాన్ని రేపింది. చాలా మంది గాంధేయుల మనస్సుల్లో వారి యిష్టానిష్టాలకు విరుద్ధంగా శ్రీరాములు ఉద్దేశాలు ప్రతిధ్వనింపసాగాయి రంగా, పట్టాభి, గోరా వంటి హరిజన వెల్‌ఫేర్ కమిటీ సభ్యులు హరిజన సేవా దినాన్ని జరిపించాలని డిమాండ్ చేశారు. కానీ వారికి ప్రభుత్వంలో తగిన పలుకుబడి లేదు. అందుకే ఈ విషయాన్ని ప్రభుత్వ నిర్ణయానికే వదలివేయడం మంచిదని భావించారు. (2)

---

1) 20-1-1949 న శ్రీరాములు సేవాగ్రాం నుండి యస్. ఆర్. గుప్తాకు వ్రాసిన లేఖ.

2) From Potti Sriramulu's Personal Diary.

శ్రీరాముల ప్రయత్నాన్ని వ్యతిరేకించినా అతను నైతిక బలం కలవాడనీ, కక్షసాధింపు లక్షణం అతనిలో లేదనీ మష్రూవాలా గమనించాడు. శ్రీరాములు చర్యలవెనుక ఆంధ్రతమిళ రాజకీయ వివాదాలు వున్నాయని మొదట భావించాడు. కానీ అటువంటి ఉద్దేశాలు శ్రీరాములుకు లేవని గ్రహించాడు శ్రీరాములు తలపెట్టిన ఉద్యమం సరైనదని అందుకు తన సహకారం ముఖ్యమని మష్రూవాలా భావించాడు. వెంటనే మద్రాసు ముఖ్యమంత్రితో ఉత్తర ప్రత్యుత్తరాలు ప్రారంభించాడు. 31-1-1949న ఆయనకు రాసిన లేఖలోని సారాంశమిది.

"పొట్టి శ్రీరాములు చాలా రోజుల నుంచి నిరసన దీక్షలో వున్నాడు. ఇప్పటికి ఇరవై రోజులయింది. దీక్ష తగినది కాదని తాను, రాజన్‌బాబు, వినోబా మొదలైనవారు నచ్చజెప్పడానికి ప్రయత్నించాము. కానీ విఫలులయ్యాము. హరిజనుల అసౌకర్యాలను తొలగిస్తూ చట్టం చేసినంత మాత్రాన లాభంలేదు. అని అతని ఉద్దేశ్యం. హరిజనులు తమ హక్కులను అనుభవించేటట్లు ప్రభుత్వం చర్య తీసుకోవాలి. ప్రజల మానసిక, సాంఘిక, దృష్టిలో మార్పు తీసుకురావడానికి సంఘసేవకులు తగినంత మంది లేరనీ, ఉన్నవారికి సామర్థ్యం లేదని అతని నమ్మకం. ప్రభుత్వమే హరిజనోద్ధరణ కార్యక్రమాన్ని చేపట్టాలి.

ప్రభుత్వ శాఖలను విస్తృతం చేయమని చెప్పే సలహాకు మష్రూవాలా వ్యతిరేకి. ప్రతి ప్రభుత్వంలోనూ సంఘసేవా వ్యవహారాలకు గాను ఒక మంత్రిని నియమించాలని ప్రభుత్వాన్ని కోరుతూ వెలువడిన సూచనలను ఆయన విన్నాడు. శ్రీరాములు ఉద్దేశం కూడా ఇదే.

హరిజనోద్ధరణ విషయంలో మద్రాసు ప్రభుత్వం ఒక పథకాన్ని రూపొందించిందని మష్రూవాలా విన్నాడు. మద్రాసు ప్రభుత్వం ఇందుకొక సంఘాన్ని నియమించిందని అది కొన్ని సిఫార్సులను కూడా చేసిందని తెలుసుకున్నాడు. ఈ దశలో పని నిలిచిపోయింది. తరువాత ఈ కార్యక్రమాన్ని పట్టించుకోవడంలేదు. ఆ సంఘపు సిఫార్సులనే కార్యరూపంలో పెట్టాలని శ్రీరాములు కోరుతున్నాడు. కానీ స్వతంత్రంగా అతను ఏమీ కోరడంలేదు.

ప్రస్తుత కర్తవ్యం మద్రాసు ముఖ్యమంత్రికాని, ఈ వ్యవహారానికి చెందిన మంత్రిగాని వేరుగానైనా రాజేంద్రప్రసాద్ లేదా తనద్వారాగాని శ్రీరాములు దీక్ష

విరమించాలని వార్త పంపాలి శ్రీరాములు కోరిన కార్యాన్ని ఫలానా తేదీలలో అమలు పరుస్తామని ప్రభుత్వం హామీ ఇవ్వాలి. అలాగయితే తాను దీక్ష విరమింపజేసే యత్నం చేస్తాడు.

శ్రీరాములు న్యాయబుద్ధి కలవాడు. ప్రతీకారవాంచ లేనివాడు. ప్రముఖ హరిజన సేవా కార్యకర్త. ఎంతోకాలంనుండి వాళ్లకు సేవ జేస్తున్నాడు. అతడు రాజకీయాలకు అతీతుడు. అతడు కేవలం హరిజనుల తరపున వాదించే న్యాయవాది మాత్రమే.

హరిజనుల స్థితిగతులను బాగుచేస్తామని ప్రభుత్వం వాగ్దానం చెయ్యాలి. అలాగయితేనే అతని ఆత్మ బలిదాన ప్రయోగం ఆగిపోతుంది. అతనిలో నూతనోత్సాహం చోటు చేసుకుంటుంది. ఈ విషయంలో శ్రద్ధ వహించకపోతే దౌర్జన్య వ్యక్తులు హరిజనులను హింసకు పురిగొల్పుతారు. ఇదే అతని ఉద్దేశం.

ఈ లేఖకు ప్రభుత్వం త్వరలో సమాధాన మివ్వాలి ఎంత తొందరలో దీక్షను విరమింపజేస్తే అంత మంచిది. అతడు ప్రభుత్వ సమాధానం కోసం ఎదురుచూస్తున్నాడు.

శ్రీరాములు 28-1-1949న ఆచార్య రంగాకు రాసిన లేఖలో తాను దీక్షకు పూనుకొన్న స్థితులు వివరించాడు. "ప్రజల్లో ధర్మాధర్మ వివేచనా శక్తిని జాగృతం చేయడం అనే ఉత్తమ లక్ష్యంకోసం అధికారులు తమ విధి నిర్వహణలో అప్రమత్తంగా వ్యవహరించేలా చేయాలి. పశ్చిమ గోదావరి జిల్లాలో హరిజనుల దేవాలయ ప్రవేశ విషయంలో శ్రీరాములు విఫలమయ్యాడు. అప్పుడు ఎర్నేని సుబ్రహ్మణ్యం ఉపవాస దీక్షను కూడా చేశాడు. నెల్లూరు జిల్లాలోని ఒక గ్రామంలో శ్రీరాములు తీవ్రంగా కొట్టబడ్డాడు. అధికారులు అనధికారుల సహాయం కూడా పొందడానికి వీలు లేకుండా దూరంగా తరిమివేయబడ్డాడు.

హిందువులకు హరిజనులకు మధ్య ద్వేషం నానాటికి ప్రబలుతున్నట్లు శ్రీరాములు గ్రహించాడు, ఈ సమస్యలు సానుభూతి పూర్వకంగా పరిష్కరించు కుంటే భవిష్యత్తులో సంఘ సంక్షేమానికి రక్షణ ఏర్పడుతుంది. ప్రభుత్వం వెంటనే ఈ కార్యక్రమాన్ని చేపట్టాలి. ప్రజా సేవ ప్రభుత్వ లక్ష్యం. ఎలాగూ అది ఒక వర్గ ప్రజలకు సేవ చేస్తున్నది. కానీ సమర్థుల నిరంకుశత్వంలో

అలమటిస్తున్న హరిజనులను నిర్లక్ష్యం చేస్తున్నది. ప్రతి హిందువు ఇల్లు హరిజనులకు స్వాగతం పలికి సత్కరించేటట్లు చేయడం ప్రభుత్వ బాధ్యత కాకపోవచ్చు. కానీ కనీసం బహిరంగ స్థలాల్లోనైనా వారికి ప్రవేశం కల్పించడం ముఖ్య కర్తవ్యం. ప్రస్తుతం ప్రభుత్వం వారి న్యాయమైన హక్కులను కాపాడటానికి ప్రయత్నిస్తామని హామీ ఇవ్వాలి. (1)

ఈ హక్కులను హరిజనులకు మనం దాన ధర్మంగా ఇవ్వడం లేదు. న్యాయబుద్ధి గలవారు వారికి తోడ్పడతారు. కాని ఇది పరిమితమైనది మాత్రమే. ప్రభుత్వం తలచుకొంటే రాష్ట్ర మంతటా అమలుపరచేటట్లు చూడవచ్చు. పౌరులుగా హరిజనుడికి గల హక్కులు వాటిని అమలుపరచే విషయంలో ప్రభుత్వానికి గల బాధ్యతను తెలుసుకోకుండా చట్టాలు చేయబడ్డాయి ఇది పూర్తిగా అన్యాయం. హరిజనులకు జరుగుతున్న అన్యాయాన్ని కళ్లార చూస్తూ జీవించడంకన్నా వారికి న్యాయం కలిగే పక్షంలో తాను మరణించడానికి కూడా సిద్ధమేనని శ్రీరాములు అభిప్రాయపడ్డాడు.

శ్రీరాములు చర్చలకు వాగ్దానాలకు లొంగే వ్యక్తి కాదు. లక్ష్యం నెరవేరనిదే తృప్తిపడేవాడు కాదు అని అతని మిత్రులకు, మష్రూవాలాకు తెలుసు. మష్రూవాలా 4-2-1949 న రాసిన లేఖకు ప్రభుత్వం సమాధానమిస్తూ శ్రీరాములు చేసిన సూచనలను ఆమోదిస్తామని అన్నది. ఆ లేఖకు రాసిన సమాధానంలో మష్రూవాలా "పొట్టి శ్రీరాములు ఆశించిన సమాధానం మీ లేఖలో లేదు... ప్రభుత్వం తలచుకొంటే హరిజన సేవా కార్యక్రమాలు జరిపించడంలో కష్టంలేదు అని అతడు అభిప్రాయపడుతున్నాడు. దీక్ష ప్రారంభించి నేటికి 26వ రోజు ఇది ఎలా పరిణమిస్తుందో నాకు తెలియదు. ఇప్పటి కంటే ఇంకా ఉదారమైన వైఖరిని మీరు అవలంభించలేరా ? (2)

ఈలోగా మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రిని పొట్టి శ్రీరాముల విలువైన జీవితాన్ని కాపాడాలంటే అతని కోరికను ఒప్పుకోవడం తప్ప గత్యంతరం లేదని గ్రహించాడు. వెంటనే అతడు మష్రూవాలాకు ఇలా టెలిగ్రాం పంపించాడు.

---

1) 4-2-1949న శ్రీరాములు యన్.జి. రంగాకు వ్రాసిన లేఖ.

2) 6-2-1949న మష్రూవాలా మద్రాసు ముఖ్యమంత్రికి వ్రాసిన లేఖ.

"ప్రతినెలా 30వ తేదీ హరిజన సేవాదినం జరపటానికి హరిజనోద్ధరణ కార్యక్రమాలను అమలు పరచడానికి కలెక్టర్లతో రాష్ట్రీయ కాంగ్రెస్ కమిటీలతో, హరిజన సేవక సంఘంతో చర్చలు జరపడానికి సిద్ధంగా వున్నాను. శ్రీరాములు గారిని దీక్ష విరమింపవలసిందిగా కోరుతున్నాను".

ఈ టెలిగ్రాంకు మద్రాసు సమాచారం ఆనందించి కృతజ్ఞతలు తెలుపుతూ శ్రీరాములు తన దీక్షను వినోబా ఎదుట విరమించినట్లు ఒ.పి. ఆర్. రెడ్డియార్‌కు తెలిపాడు. హరిజనోద్ధరణ విషయంలో మద్రాసు ప్రభుత్వం తీసుకొన్న చర్యలు ఎప్పటికప్పుడు కార్యక్రమాల వివరాలు ప్రచురింపబడితే ప్రజలకు ఇతర రాష్ట్రాలకు ఉపయోగకారిగా వుంటుంది అని తెలిపాడు. హరిజన పత్రికలో తాను ప్రకటించిన విషయాలు ప్రభుత్వమునకు ఏదైనా ప్రయోజనకారిగా వుంటే తనకు తెలుపవలసిందని కోరాడు.

తన లక్ష్యం నెరవేరినందుకు శ్రీరాములు అంతులేని ఆనందాన్ని పొందాడు. మద్రాసు ముఖ్యమంత్రికి కృతజ్ఞతలు తెలుపుతూ ఇలా జాబు వ్రాశాడు "మీరు పూజ్య బాపూజీకి యధార్థమైన, సజీవమైన స్మారక చిహ్నాలను నిర్మిస్తున్నారు. మద్రాసు రాష్ట్రంలో ప్రతి పట్టణంలో, ప్రతి గ్రామంలో మీరు తలపెట్టిన కార్యక్రమంలో వచ్చే గాంధీజీ వర్ధంతినాటికి అస్పృశ్యత అంతరించి పోతుందని ఆశిస్తున్నాను. ఈ కార్యక్రమంలో ప్రజలు సంఘసేవా కార్యకర్తలు, కాంగ్రెస్ కమిటీలు, ప్రభుత్వం పరస్పరం సహకరించుకోవాలని ఆశిస్తున్నాను.

ఆనాటి కార్యక్రమంలో సామూహిక హిందువులు మున్నగు కార్యక్రమాలను సందర్భోచితంగా చేరిస్తే బాగుంటుందని నా అభిప్రాయం. మీరు తలపెట్టిన పనివల్ల ప్రజాసేవ చేయడానికి నూతన జీవితాన్ని నేను పొందుతున్నాను. జీవితాంతం సేవా కార్యక్రమాల్లో పురోగమించేటట్లు చేయాలని భగవంతుని ప్రార్థిస్తున్నాను.

ఈ నెల 28వ తేదీతో నెల ముగుస్తుంది. కనుక ఆనాడే హరిజన సేవా దినాన్ని జరిపించవలసిందిగా కోరుతున్నాను, దీక్ష ప్రారంభించడానికి ముందు నేను చేసిన ప్రార్థనను మీకు తెలుపుతున్నాను.

"నేటినుండి చీకటి జీవితాన్ని ప్రారంభిస్తున్నాను. నెల్లూరులోని భంగీలతో గత పది సంవత్సరాలుగా కలిసి మెలిసి పనిచేశాను. అలా చేస్తానని బాపూజీకి

వాగ్దానం చేశాను. ప్రస్తుతం నా సేవలను మీ నిర్ణయానికి వదలివేస్తున్నాను. నా పనిలో సఫలత కలిగించవలసిందిగా ప్రార్థిస్తున్నాను".

హరిజన పత్రిక సంపాదకుడు మష్రూవాలా 20-2-1949 సంచికలో సంతోషకరమైన దీక్షా విరమణ అనే శీర్షికతో రాసిన వ్యాసంలో దీక్షా సంబంధమైన చారిత్రాత్మక విషయం ఇలా వున్నాయి.

ఉపవాస బాధ తగ్గి శక్తి పుంజుకోవడానికి కొంచెం తేనెను స్వీకరించమని ఆశ్రమవాసులు శ్రీరాములును బలవంతం చేశారు. తేనె గ్రహించడంతో ఆయన దీక్ష ముగిసింది. చిక్కు సమస్యలు లేకుండా అందరికీ ఆనందంగా దీక్ష ముగిసింది. ఒక పర్యాయము వార్ధా వెళ్లినపుడు మష్రూవాలా దీక్ష విరమించుకోమని కోరాడు. కానీ శ్రీరాములు అంగీకరించలేదు. దీక్ష మౌనంగా సాగింది. ఆంధ్ర, ఆంధ్రేతర ప్రాంతాల్లో ఏ కొద్దిమందికో తప్ప శ్రీరాములు దీక్ష విషయం ఎవ్వరికీ తెలియదు.

మష్రూవాలా, మద్రాసు ముఖ్యమంత్రి మొదలైన ప్రముఖులతో జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలు శ్రీరాములు లక్ష్యసాధనకు విజయాన్ని సమకూర్చి పెట్టారనడంలో సందేహంలేదు. శ్రీరాములు సాధించిన ఘనకార్యాన్ని సంఘసేవకులకు తెలియజేస్తూ మష్రూవాలా వారందరి సహకారాన్ని ఇలా అర్థించాడు.

"పొట్టి శ్రీరాములు దీక్షకు సమాధానంగా మద్రాసు ప్రభుత్వం ఇచ్చిన ప్రకటన హరిజనోద్ధరణకోసం వేసిన ముందడుగని చెప్పవచ్చు. ప్రభుత్వం చేపట్టిన సంఘసేవా కార్యక్రమానికి పూర్తి సహకారమిచ్చి జయప్రదం చేయాలి. శ్రీరాములు సూచించినట్లు ఈ పని ఒక సంవత్సరంలో జరిగితే హరిజనుల ప్రస్తుత సమస్యలన్నీ అంతరిస్తాయి. తరువాత ఈ సాంఘిక సేవావసరం ఉండదు. కార్యకర్తలు హరిజనులను ఆర్థిక, విద్యారంగాలలో పైకి తీసుకురావడానికి కృషి చేస్తారు. అప్పుడు హరిజనులు భారతదేశంలో వెనుకబడిన పేదరికం అనుభవిస్తున్న జాతుల్లో ఒక జాతిగా మాత్రమే వుంటారు. వేటి హరిజనులలాగా పరిగణింపబడరు.

పొట్టి శ్రీరాములు దీక్ష విజయవంతంగా ముగిసింది. మద్రాసు ప్రభుత్వం ప్రతినెల 30వ తేదీ హరిజన సేవా దినంగా ప్రకటిస్తూ ఉత్తర్వులు జారీ చేసింది. మద్రాసు ప్రభుత్వం జారీచేసిన ఉత్తర్వు ఈ క్రింది విధంగా వుంది.

19)

మెమొరాండం నెంబరు 11059-ఎఫ్.డి యస్./49-1 తేది 15-3-1949.

**ఉత్తర్వు** :- అనతికాలంలో మనదేశం నుండి అంటరాని తనమనే ప్రమాదాన్ని నిర్మూలిస్తూ ప్రభుత్వం కంకణం కట్టుకొన్న సంగతి ప్రజలందరికీ తెలుసు. సాధారణ పౌరహక్కులను తోటి ప్రజలతోబాటు హరిజనులు కూడా సమానంగా అనుభవించాలి. వాళ్లను అలా అనుభవింప నీయడంలో ఏలాంటి తారతమ్యాన్ని ప్రదర్శించడాన్ని నిషేధిస్తూ ప్రభుత్వం చట్టం చేసింది. ప్రజలు సంపూర్ణంగా దీన్ని ఆమోదించినట్లు కనబట్టంలేదు. హరిజనులు నేటికీ ఎన్నో అసౌకర్యాలను, బాధలను అనుభవిస్తున్నారు. అందువల్ల అంటరానితనాన్ని నిర్మూలించడానికి, ఉత్సాహం చూపడానికి, హరిజనులను సోదరభావంతో గౌరవించి సేవచేయడానికి, ప్రజలను విద్యావంతులుగా చేయాలని ప్రభుత్వం భావిస్తున్నది. జాతీయ సమైక్యతకోసం ప్రభుత్వం తలపెట్టిన ఈ పనిలో ప్రభుత్వాధికారులు, కాంగ్రెస్ సంఘాలు, హరిజన సేవా సంఘాలు ప్రముఖ పాత్ర వహిస్తాయి.

2. అస్పృశ్యత పారద్రోలడానికి, హరిజన సేవ చక్కగా కొనసాగించడానికి ప్రతినెలా ఒకదినం రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల్లో ప్రచారం చేయడానికి ప్రభుత్వం నిర్ణయించింది అందువల్ల ప్రతినెలా 30వ తేదీన హరిజన దినంగా పాటించవలసిందని కోరడమైనది. తరువాత జిల్లాలకు సంబంధించి ఆనాటి కార్యక్రమం తయారు చేయవలసిందని కలెక్టర్లను కోరుతున్నాము. భవిష్యత్ కార్యక్రమాన్ని తయారు చేయడంలో హరిజన సేవా సంఘాల, ఇతర సంస్థల, హరిజన సంక్షేమాసక్తుల సలహాలను తీసుకోవాలి. ఆనాడు బాధ్యతగల అధికార, అనధికార వ్యక్తులు వారికి నిర్ణయింపబడిన ప్రాంతాల్లో తిరిగి హరిజనోద్ధరణ విషయాన్ని ప్రచారం చేయాలి. వివిధ శాఖలలోని ప్రభుత్వ కార్య నిర్వాహకోద్యోగులు, ప్రత్యేకించి జిల్లా హరిజన్ వెల్‌ఫేర్ ఆఫీసర్లు హరిజన సంక్షేమానికై ఉద్దేశింపబడిన రెవెన్యూ ఇన్‌స్పెక్టర్లు, లేబర్ ఇన్‌స్పెక్టర్లు, హరిజన సంక్షేమాసక్తులైన ఇతరులు, మున్నగు వారిని ఈ కార్యక్రమానికి సంపూర్ణంగా వినియోగించుకోవాలి

3. కలెక్టర్లు ఈ విషయంలో ప్రత్యేక శ్రద్ధను ప్రదర్శించి ప్రచార కార్యక్రమాన్ని వచ్చే మార్చినెల 30 నుండి నడిపించడానికి పూనుకోవాలి. 1949 డిసెంబరు నెల వరకు ప్రతి మాసం 30 వ తేదీన హరిజన సేవా కార్యక్రమాలు అమలు జరిగేటట్లు శ్రద్ధ వహించాలి.

4. ప్రతి నెలా 30వ తేదీన జరిగిన హరిజన సేవా - కార్యక్రమాల్లోని అంశాలను గురించి ప్రతి జిల్లాలో జరిగినవాటిని ఒకటిగా కలిపి తరువాత నెల 10వ తేదీ లోపల అందేటట్లు ప్రభుత్వానికి పంపుతూ వుండాలి. కలెక్టర్లు పంపిన నెలసరి రిపోర్టులను పరిశీలించి ఫలితాలను అధ్యయనం చేసి డిసెంబరు 1949 తరువాత హరిజన సేవా దినాన్ని కొనసాగించే విషయం ఉత్తర్వుద్వారా తెలుపబడుతుంది.

యం. యస్ జగన్నాయకులు
ప్రభుత్వ సెక్రటరీ

కాపీలు :

1. కలెక్టర్లందరికీ
2. కమీషనర్ ఆఫ్ లేబర్ - మద్రాసుకు
3. బోర్డ్ ఆఫ్ రెవెన్యూ - మద్రాసు
4. పబ్లిక్ డిపార్ట్‌మెంట్‌కు
5. రెవెన్యూ డిపార్ట్‌మెంట్‌కు
6. శ్రీ పొట్టి శ్రీరాములు
   సి/ఒ. ప్రిన్సిపాల్, గ్రామసేవా విద్యాలయం,
   గోపన్నపాలెం, ఏలూరు (పి ఒ.),
   పశ్చిమగోదావరి జిల్లాకు పంపబడినవి.



# ఎనిమిదవ అధ్యాయం

## నిర్మాణాత్మక కార్యక్రమాలను తీవ్రతరం చేయడం

బాహ్యరూపంలో ఏవిధంగా ఉన్నా భావ వ్యక్తీకరణ ఎలా చేసినా గాంధీజీ సిద్ధాంతాలు తిరుగులేని వనడంలో సందేహంలేదు. ఆయన సిద్ధాంతాలు సంఘ సంస్కరణోత్సాహాన్ని ప్రతిబింబింప జేస్తున్నాయి. గాంధీజీ తన సిద్ధాంతాలను పొందుపరుస్తూ నిర్మాణాత్మక కార్యక్రమాన్ని తయారుచేశాడు. "నిర్మాణాత్మక కార్యక్రమమంటే న్యాయబద్ధమైన అహింసా పద్ధతుల్లో సంపూర్ణ స్వరాజ్యాన్ని సాధించడం" అని గాంధీజీ కంఠోక్తి. గాంధీజీ తన అనుచరులకు మార్గదర్శక సూత్రాలుగా 18 అంశాలు తెలిపాడు. అవి (1) మత సామరస్యం, (2) అస్పృశ్యత నిర్మూలన, (3) మధ్యపాన నిషేధం, (4) ఖాదీ ప్రచారం, (5) కుటీర పరిశ్రమాభివృద్ధి, (6) గ్రామ పారిశుద్ధ్యం, (7) ప్రాతిపదిక విద్య, (8) వయోజన విద్య, (9) స్త్రీ విద్య, (10) ఆరోగ్యమునకు సంబంధించిన విద్య, (11) రాష్ట్ర భాషాభివృద్ధి, (12) జాతీయ భాషాభివృద్ధి, (13) ఆర్థిక సమానత్వం, (14) కర్షకులు, (15) శ్రామికులు, (16) ఆదివాసులు, (17) కుష్టురోగులు, (18) విద్యార్థులు వారి శ్రేయస్సు.

1944 నుండి గాంధీజీ సిద్ధాంతాలను తు చ తప్పక అనుసరిస్తున్న శ్రీరాములు నిర్మాణాత్మక కార్యక్రమాన్ని అమలుపరవడానికి గాంధీజీ అడుగుజాడల్లో ఆయన శుభాశీస్సులతో ఏకాకిగా పోరాడసాగాడు. 1944 అక్టోబరు 2వ తేదీ నుండి శ్రీరాములు అస్పృశ్యతకు వ్యతిరేకంగా ఉద్యమించాడు. నాడు గాంధీజీ 75వ జన్మదినం. కావలి నుండి గాంధీజీకి లేఖ వ్రాస్తూ తాను గాంధేయుణ్ణి ఆయన సిద్ధాంతాలను అమలు చేయడానికి ప్రయత్నిస్తున్నట్లు తెలిపాడు. అస్పృశ్యతా నిర్మూలనాది సంఘ సంస్కరణ కార్యక్రమాలను తాను చేపట్టిన విధానాన్ని గురించి వ్రాశాడు.

పొట్టి శ్రీరాములు లోగడ నెల్లూరు వేణుగోపాలస్వామి ఆలయంలోనికి హరిజనులను ప్రవేశింపజేసే విషయంలో నిరశన వ్రతం సాగించి విజయుడయ్యాడు. తరువాత హరిజనుల సాంఘిక స్థాయిని పెంచే చట్టాలను అమలు పరచవలసిందిగా

కోరుతూ 23-11-1940 నుండి 12 రోజుల నిరాహారదీక్ష సాగించాడు ఈ దీక్ష కూడా విజయాన్ని సాధించింది. ఇప్పటికి రాజకీయ గాంధేయ వాదులు శ్రీరాములు మనోధైర్యాన్ని గుర్తించారు. ఫలితంగా ఆయన ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ నిర్మాణ కార్యక్రమ సంచాలకుడుగా 1947 నవంబరులో నియమించబడ్డాడు.

ఈ పదవిలో శ్రీరాములుకు అగ్ని పరీక్ష లెదురయ్యాయి. పదవీ కాలంలో ఆంధ్రరాష్ట్ర జిల్లాల నన్నింటినీ పర్యటించాడు. కొంతకాలం యన్. జి. రంగా, డా॥ కుమారప్పల వెంట తిరిగాడు. 1948 మార్చిలో పశ్చిమ గోదావరి జిల్లాలో అనేక దేవాలయాల్లో హరిజనులను ప్రవేశపెట్టాడు. 17-4-1948న రాత్రి 8 గంటలకు పెద్దచెరుకూరు గ్రామంలోని రామాలయంలో భజన జరుగుతూండగా కొందరు హరిజనులతో శ్రీరాములు ఆలయం లోపలికి ప్రవేశించాడు. అతనికి ఏవిధమైన ఆటంకమూ కలగలేదు ఆనాడు అదేగ్రామంలోని చంద్రమౌళీశ్వరాలయం దగ్గరకు వెళ్లగా ఆ గుడి తలుపులు మూసి ఉన్నాయి. అక్కడినుంచి వాళ్ళు సమీపగ్రామమైన అల్లీపురానికి వెళ్లాడు. అప్పుడు పెద్ద చెరుకూరు గ్రామస్థులు ఆటంకాలు కలిగించడానికి ప్రయత్నించారు. వాటినెదుర్కొని అల్లీపురం చేరారు.

పొట్టి శ్రీరాములు 18-4-1948 ఉదయం పెద్దచెరుకూరు గ్రామంలోని చంద్రశేఖరాలయానికి వెళ్లాడు. అప్పుడాయన వెంట సర్వశ్రీ పొన్నాల పెదకోటారెడ్డి (తాలూకా కాంగ్రెస్ కమిటీ మెంబర్, అల్లీపురం), వెంకటగిరి జగన్ సింగ్, (నెల్లూరు), డా॥ వి. నాగేశ్వరరావు, (నెల్లూరు); జి జె రావుగుప్తా, (నెల్లూరు) మున్నగు ప్రముఖులు, హరిజన నాయకులు కొందరున్నారు. గుడి తలుపులు మూయడం వల్ల బయట కూర్చున్నారు మనుబాలు ఆదినారాయణరెడ్డి కోసం శ్రీరాములు రామాలయానికి వెళ్లారు. ఆలయ ధర్మకర్త అక్కడే వున్నాడు. అప్పుడు పెదచెరుకూరు గ్రామస్థులు కొందరు చుట్టుముట్టి అసభ్య పదజాలంతో నిందించారు. ఆ గుంపులోని పోశం రామకృష్ణారెడ్డి శ్రీరాములును చెప్పుతో కొట్టబోయాడు. కొందరు అతన్ని వారించారు. శ్రీరాములు ఆలయ ధర్మకర్త ప్రక్కన తిన్నెపై కూర్చున్నాడు. అప్పుడు పెదచెరుకూరు వాస్తవ్యుడు గూడూరు కోటారెడ్డి శ్రీరాములును తిన్నెపైనుండి కిందికి నెట్టాడు. శ్రీరాములు కిందపడి ఇసుకలో కూర్చున్నాడు. హరిజనులను చంద్రమౌళీశ్వర స్వామి సన్నిధికి చేర్చి పూజలు అనుమతించమని ధర్మకర్తను కోరాడు. ధర్మకర్త తిరస్కరించి దుర్భాషలు పలికాడు.

పెదకోటారెడ్డి శ్రీరాములును తన్నవలసిందని అచ్చటి కొందరిని ఆదేశించాడు. ఉదయం పది గంటలకు పెదచెరుకూరు వాస్తవ్యులైన గూడూరు కోటారెడ్డి మొదలైన సుమారు వంద మంది చట్ట విరుద్ధ సభగా ఏర్పడి శ్రీరాములు సహచరులను ఎదుర్కొన్నారు. ధర్మకర్త ప్రేరణతో కట్టెలతో వాళ్ళు శ్రీరాములుపై దాడి చేశారు. కార్యకర్తలను, శ్రీరాములును రోడ్డు వరకూ ఈడ్చుకొని వెళ్ళారు. వాళ్ళకు దేవాలయ ప్రవేశం లభించలేదు. (1) ఇలా నెల్లూరు సర్కిల్‌కు పంపిన అభియోగ లేఖలో శ్రీరాములు ఇంకా ఇలా అన్నాడు. "నేరస్థులపై ఐ.పి.సి. కోడ్‌లోని 1471, 323, 352, 504, 506 సెక్షన్ల క్రింద కఠిన చర్య తీసుకోవాలని కోరుతున్నాను. చంద్రమౌళీశ్వరస్వామి ఆలయంలో హరిజనులు పూజలు జరిపే కార్యక్రమానికి నాయకత్వం వహించడానికి తగినంత పోలీసు బందోబస్తును కల్పించవలసిందిగా కోరుతున్నాను".

గాంధీజీ నిర్మాణ దినసూచకంగా ప్రతినెలా 30వ తేదీ హరిజన సేవా దినంగా ప్రభుత్వంతో ప్రకటింప జేయగలిగినందుకు శ్రీరాములులో నూతనోత్సాహం ఇనుమడించింది. ఈ కార్యక్రమ నిర్వహణకు నాటి నెల్లూరు జిల్లా కలెక్టరు సహకారం కూడా పొట్టి శ్రీరాములుకు ఎనలేని బలాన్ని కలిగించింది. శ్రీరాములు కనుపూరు ఫిర్కాలో హరిజనోద్ధర కార్యక్రమంలో సంచారం చేస్తున్నప్పుడు తగిన సహకారం ఇవ్వవలసిందని కలెక్టరు మలయప్పన్ ప్రొసీడింగ్స్ నెం. యల్.డి.ఐ.యస్. 2896/49 తేదీ 1-4-1949 క్రింద తత్సంబంధ అధికారులకు ఉత్తర్వులు జారీ చేయించాడు. కలెక్టర్ మలయప్పన్ పంపిన ఉత్తరువు సారాంశం ఇలా వుంది.

1. 6-4-1949 నుండి ప్రారంభమయ్యే జాతీయ వారోత్సవ సందర్భంగా ప్రభుత్వం వారితో గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమం చురుకుగా కొనసాగుతున్న కనుపూరు ఫిర్కాలోని గ్రామాలన్నింటిలో ఉంటుందని ఉన్న పారద్రోలి హరిజనులకు సాంఘిక న్యాయాన్ని కల్పించడానికి చర్య తీసుకోవాలని ప్రభుత్వం సంకల్పించింది. ఈ కార్యక్రమాన్ని ప్రచారం చేయవలసిన అవసరం ఎంతో వున్నది. ఇందుకు కాంగ్రెస్ సంఘం, సంఘసేవకులు, హరిజన కార్యకర్తలు, ఫిర్కా డెవలప్‌మెంట్ ఆఫీసరు, నెల్లూరుకు చెందిన పొట్టి శ్రీరాములు మొదలైన వారి

---

1) పొట్టి శ్రీరాములు జాగ్రత్తచేసిన వ్యక్తిగత రికార్డులు ఆధరంగా.

నాయకత్వంలో ఈ వారంలో ప్రతి గ్రామము పర్యటించి పై అంశాన్ని ప్రచారం చేస్తారు. ఈ సందర్భంగా ప్రార్ధనా సమావేశాలు, భజనలు, సామూహికంగా నూలు వడకడం, ఊరబావుల్లో నీళ్లు తోడుకునేటట్లు చేయడం, హరిజనేతరులతో హరిజన వాడలను శుభ్రం చేయించడం మొదలైన కార్యక్రమాలు నిర్వహింపబడతాయి.

2. ఫిర్కా డెవలప్మెంట్ ఆఫీసరు తయారు చేసిన పొట్టి శ్రీరాములు బృందం వారి పర్యటన కార్యక్రమం కాపీ ఇందు జతపరచబడింది.

3. నెల్లూరు ఆర్ డి ఒ., డిప్యూటి కలెక్టర్, తహసిల్దార్, డి.ఒ, జిల్లా బోర్డు స్పెషల్ ఆపీసరు వున్న ఈ సంఘానికి రెవెన్యూ ఇన్స్పెక్టర్, గ్రామోద్యోగులు, ప్రాధమిక పాఠశాల ఉపాధ్యాయులు సహకరించవలసిందిగా కోరుతున్నాము. వీలయితే తీరుబడి సమయంలో కార్యక్రమాల్లో పాల్గొనడానికి ఆసక్తిని చూపాలి.

హరిజనోద్ధరణకోసం కనుపూరు ఫిర్కాలో పొట్టి శ్రీరాములు నడిపించిన సంచార కార్యక్రమం పది గ్రామాలకు పరిమితమై ఏప్రియల్ 5, 7 తేదీల మధ్య ముగిసింది. గ్రామాల్లో పర్యటన సలుపుతూండగా పొట్టి శ్రీరాములు వర్గానికి చెందినవారు తమతమ ఉపన్యాసాల్లో సవర్ణ హిందువులకు కొంత అసంతృప్తిని కలిగించారని చెప్పబడింది.

తాము ఏప్రిల్ 7వ తేదీ కనుపూరు గ్రామాన్ని సందర్శించిన సందర్భంగా ఆవూరి సవర్ణ హిందువులు తమపట్ల మర్యాదగా ప్రవర్తించలేదని శ్రీరాములు బృందం నెల్లూరు అసిస్టెంట్ కలెక్టరు వి కార్తికేయన్కు 8-4-1949 నాడు ఫిర్యాదు చేశారు. వెంటనే కార్తికేయన్ ఆరోజు సాయంత్రమే తగిన పోలీసు బలగంతో ఆ గ్రామానికి వెళ్లాడు అయితే ఆ గ్రామం చేరిన తర్వాత అధికారులు జోక్యం చేసుకోవలసినంత పెద్ద కారణం ఏమీ లేదనీ ఆయన గ్రహించాడు.

ఎలాగయితేనేం పొట్టి శ్రీరాములు బృందం మునుముందు జరుపబోయే పర్యటనకు ఆటంకాలు కలుగకుండా కలెక్టరు ఏప్రిల్ 15వ తేదీ వరకు వారికి పోలీసు రక్షణ కల్పిస్తూ ఉత్తర్వులు జారీ చేశారు.

13-4-1949 నాటిది ఇండియన్ ఎక్స్ప్రెస్ పత్రికలో సవర్ణ హిందువుల ప్రతిఘటన ఫలితంగా పొట్టి శ్రీరాములు అతని బృదంలోని సభ్యులు కనుపూరు

డెవలప్‌మెంట్ ఫిర్కాలో హరిజన దేవాలయ ప్రవేశ కార్యక్రమాన్ని విరమించుకొన్నట్లు తెలుస్తున్నది" అనే ఒక అసత్యపు వార్త ప్రకటించబడింది. వెంటనే పొట్టి శ్రీరాములు ఆ అబద్ధపు వార్తను ఖండిస్తూ 16-4-1949 నాడు ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రికా సంపాదకునికి లా లేఖ వ్రాశాడు. "మా ఉద్యమానికి వ్యతిరేకియైన ఎవరో ఒక వ్యక్తి మీకు తప్పుడు సమాచారాన్ని అందజేసినందుకు విచారిస్తున్నాను. కనుపూరు డెవలప్‌మెంట్ ఫిర్కాలో మేం చేపట్టిన హరిజన దేవాలయ ప్రవేశ కార్యక్రమం విజయవంతంగా ముగిసింది కనుపూరు గ్రామంలో మాత్రం కొందరు వ్యక్తుల వ్యతిరేకతవల్ల మా కార్యక్రమం కొనసాగడంలో కొంత ఆలస్యమైంది. పవిత్రమైన లక్ష్యం కోసం చేపట్టే కార్యక్రమాన్ని మధ్యలో వదలివేసే ఉద్దేశ్యం నాకులేదని ఇందుమూలంగా మీకు తెలియజేస్తున్నాను. సత్యమైన ఈ సమాచారాన్ని ప్రచురించవలసిందిగా మిమ్మ కోరుతున్నాను కనుపూరు గ్రామంలో మా ఉద్యమాన్ని సవర్ణ హిందువులు వ్యతిరేకిస్తున్నారు వారికి భయపడి హరిజనులు మాతో సహకరించడంలేదు. చివరకు మా కృషివల్ల హరిజనులు దేవాలయ ప్రవేశం చేశారు ఇందువల్ల సంఘసేవకులు హరిజనోద్ధరణ కోసం సంచార కార్యక్రమాలను చేపట్టవలసిన ఆవశ్యకత వ్యక్తమవుతుంది.

శ్రీరాములు నెల్లూరు జిల్లా కలెక్టరుకు తన పర్యటన గురించి నివేదిక పంపాడు. అందులో ఆయనిలా తెలియజేశాడు "మా సంచార కార్యక్రమం మొత్తంమీద విజయవంతమైంది అని మీకు తెలియజేయడానికి సంతోషిస్తున్నాను. మేము సంచరించిన ప్రదేశాల్లో హరిజనులు దేవాలయ ప్రవేశం చేశారు. ఊరబావుల్లో నీళ్ళు తోడుకున్నారు కానీ కొన్ని గ్రామాల్లో హరిజనులు సవర్ణులను చూసి భయపడుతున్నారు. ఇలాంటి సంచారాలు హరిజనుల్లో వున్న భయాన్ని పోగొడతాయని నేను భావిస్తున్నాను. గ్రామాధికారుల సహకారం లభించకపోవడం వల్ల కనుపూరులో మాకు ఇబ్బంది కలిగింది. అందుకు పోలీసుల సహాయం అర్థించవలసి వచ్చినందుకు మా బృందం విచారిస్తున్నది పోలీసులు రావడం వల్ల మా బృందానికి ధైర్యం కలిగింది. సవర్ణులు తమ తప్పు తెలుసుకొన్నారు. అక్కడ తీవ్రంగా ప్రచారం జరిగింది. మా పర్యటనలో ఆలస్యం జరగడంవల్ల మనుబోలు గ్రామంలో ఈ విషయంపై తగుచర్చలు జరిగాయి ఫిర్కా డెవలప్‌మెంట్ ఆఫీసరు పద్మనాభయ్య, విలేజీ డెవలప్‌మెంట్ ఆఫీసరు వెంకట రామయ్య ఈ ఉద్యమానికి వ్యతిరేకంగా వున్నారని మీకు తెలియజేయడానికి విచారిస్తున్నాము.

వారి వ్యతిరేకత ఆధారంగా కొందరు అల్లర్లకు దిగారు. చాలామంది గ్రామాధికారుల సహాయం మాకు లభించలేదు. ప్రచారానికి సంబంధించిన వ్యాను కూడా సకాలంలో మాకు అందలేదు. కండలపాడు గ్రామంలో తిరుపెం రామిరెడ్డి నాయకత్వాన హరిజనులంతా ఏకమై సహకరించిన విషయం మీ దృష్టికి తెస్తున్నాము. ఇటువంటి ఉత్సాహాన్ని పెంపొందించి ఫిర్కాలు అభివృద్ధిపరిచే విషయమై శ్రద్ధ తీసుకోవలసిందిగా కోరుతున్నాము. (1)

మద్రాసు ప్రభుత్వ ఉత్తర్వు ప్రకారం లోగడ మొదటి హరిజనదినం 1949 మార్చి 30న జరిగింది. ప్రభుత్వ ఉత్తర్వు శ్రీరాములు పథకాన్ని అనుసరించి నెల్లూరు కలెక్టర్ మలయప్పన్ కనుపూరు ఫిర్కాలో 5-4-1949 నుంచి 13-4-1949 వరకు శ్రీరాములు బృందం పర్యటించడానికి విస్తృత కార్యక్రమం ఏర్పాటు చేశాడు.

ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ నిర్మాణాత్మక కార్యక్రమ సంచాలకుడుగా శ్రీరాములు రాష్ట్ర వ్యాప్తంగా సేవాదినాన్ని విజయవంతంగా జరిపే ఉత్సాహంలో వున్నాడు. రాష్ట్రీయ ఫిర్కా డెవలప్‌మెంట్ ఆఫీసరయిన వెంకటా చలపతికి తన పర్యటన కార్యక్రమ నివేదికను పంపుతూ వివిధ ఫిర్కాల్లో జరిగే హరిజన సేవాదినం జరుగుతున్న తీరును తెలుసుకోవడమేగాక కార్యక్రమాన్ని మరింత శక్తివంతం చేయడానికై కొన్ని సూచనలు చేశాడు. మార్చి 30వ తేదీ రాష్ట్రమంతటా శ్రద్ధాసక్తులతో హరిజన దినం జరగడం చాలా సంతోషకరమైన విషయం. మలయప్పన్‌గారి కృషివల్ల కార్యక్రమం సంపూర్ణ విజయాన్ని సాధించింది". అని శ్రీరాములు అభిప్రాయపడ్డాడు. ఇంకా ఈ క్రింది సూచనలు చేశాడు.

1. సనాతన భావములకు దాసులై కార్యక్రమానికి సహకరించని సవర్ణులపై తగిన చర్య తీసుకోవాలి.

2. మా విప్లవాత్మక కార్యక్రమంపట్ల విముఖులైన కాంగ్రెస్ అగ్ర నాయకులను హెచ్చరించాలి.

---

1) పొట్టి శ్రీరాములు 1949 ఏప్రిల్ 15వ తేదీన తన టూర్ ప్రోగ్రాం వివరిస్తూ నెల్లూరు జిల్లా కలెక్టరుకు పంపిన నివేదిక.

3. హరిజన సాంఘికోద్ధరణ కార్యక్రమాలు వారి ఆర్థికాభ్యుదయానికి దారిచేస్తాయి. సంఘంలో వారికి ఉన్నత స్థాయిని కలిగిస్తాయి. కనుక ఈ సమస్యకు ప్రభుత్వం ప్రత్యేక ప్రాధాన్యమియ్యాలి.

మాజీ పార్లమెంటు కార్యదర్శి-ఆంధ్రా ప్రావిన్షియల్ బోర్డు హరిజన్ సేవా సంఘానికి అధ్యక్షుడైన బి. యస్. మూర్తికి 27-4-1949 లేఖ వ్రాస్తూ శ్రీరాములు రాష్ట్ర వివిధప్రాంతాల్లో హరిజనులుపడుతున్న కష్టాలను ఇలా వివరించాడు.

1. తూర్పు గోదావరి జిల్లాలోని గొల్లప్రోలు గ్రామంలో హరిజనులు నీరు తెచ్చుకోవడానికి వాటర్ టాంక్ దగ్గరికి అగ్రకులాలు వెళ్లనీయడం లేదు. వీధులలో నడవడానికి ఆటంకం కల్పిస్తున్నారు అందువల్ల వాళ్లు వేరే చుట్టుదారిన వెళ్లి తీసుకుని వస్తున్నారు.

2. పశ్చిమ గోదావరి జిల్లా పెనుగొండ గ్రామంలోని హరిజన స్త్రీలను సవర్ణ హిందూ స్త్రీలు పబ్లిక్ పాయిఖానాలలోనికి వెళ్లనీయడంలేదు. అందుచేత వారు చాలా దూరం వెళ్లవలసి వస్తున్నది.

1948 ఫిబ్రవరి నెలలో ఏలూరు, కాకినాడల్లో జరిగిన బహిరంగ సభలలో ఈ విషయంలో ఆచార్యవర్గం నాకు తెలుపబడినవని శ్రీరాములు తెలుసుకొన్నాడు. శరగోపాచారి, కూర్మయ్య వంటి ప్రముఖ నాయకులకు కూడా ఈ విషయాలు తెలుపబడ్డాయి. కొన్ని ఆటంకాలు కలిగినప్పటికీ 'హరిజన దినం' కార్యక్రమం నిర్విఘ్నంగా కొనసాగింది హరిజనుల్లో నూతనోత్సాహం కలిగించింది. సంఘంలోని నిర్వాధికార వర్గం కూడా ఈ కార్యక్రమాన్ని ప్రోత్సహించింది. గాంధీజీ భావాల పట్ల గౌరవం వ్యక్తం చేశారు.

పొట్టి శ్రీరాములు తీవ్ర ప్రయత్నాలవల్ల ప్రతినెల 30వ తేదీ హరిజన దినోత్సవం సందర్భంగా ఏర్పాటయ్యే కులాంతర విందులో 30 మంది వ్యక్తులకు భోజన వసతి కల్పించటానికి మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం అంగీకరించింది. 30 మంది వ్యక్తులకు మాత్రమే అని 17-12-1946లో జారీ చేయబడ్డ ఉత్తర్వు కొన్ని ప్రత్యేక సందర్భాల్లో సడలింపచేయవచ్చునని కూడా తెలుపబడింది.

—ది ఇండియన్ ఎక్స్‌ప్రెస్
26-3-1949

కులాంతర విందులను నిర్వహించడానికి బాధ్యతగల ఒక సంఘం పూనుకోవాలి. ఇందుకు తగిన ఏర్పాట్లుచేసి ఆ సంఘం కలెక్టరును తృప్తిపరచాలి. విందుకు కావలసిన ఆహార పదార్థాలను విందులో పాల్గొనే సభ్యుల నుండి సానుభూతి పరులనుండి సాధ్యమైనంత మేరకు సేకరించాలి. లోటుపడిన పదార్థాల కొనుగోలుకు కలెక్టర్ పర్మిట్ ఇస్తాడు.

నెల్లూరు జిల్లా కనుపూరు అభివృద్ధి మండలంలో శ్రీరాములు జరిపిన హరిజనోద్ధరణ కార్యక్రమం తరువాత 27-5-1949 న నెల్లూరు కలెక్టరు ఆఫీసులో హరిజన దినం ఉప సంఘం వారి సమావేశం జరిగింది. దానిలో 30-5-1949 నాడు హరిజన సేవా దినం సందర్భంగా అనుసరించవలసిన కార్యక్రమం తయారుచేయబడింది ఉపసంఘ సభ్యులు కొన్ని వర్గాలుగా ఏర్పడి హరిజనోద్ధరణ నాయకులతో కలసి తరచుగా దేవాలయాలను సందర్శిస్తూ అక్కడి హరిజనులకు దైవ దర్శనాన్ని కలిగించాలని ఆ సమావేశంలో నిర్ణయించబడింది.

నెల్లూరు పట్టణంలో సందర్శించవలసిన దేవాలయాలు వాటిని సందర్శించి విధులను నిర్వర్తించే సభ్యుల పేర్లు పై కమిటీ సమావేశంలో నిర్ణయించబడ్డాయి.

హరిజనులు దేవాలయాలు సందర్శించవలసిన సమయం :
ఉదయం 7 నుండి 10 గంటల వరకు.

| హరిజనపాలెం పేరు | దర్శించవలసిన దేవాలయం పేరు | సహకరించవలసిన కార్యకర్తలు |
|---|---|---|
| మొదటివర్గం : | | |
| 1. కపాలపాలెం | 1. దేసుగుల దేవాలయం | పొట్టి శ్రీరాములు |
| 2. కటారిపాలెం | 2. రంగనాయకస్వామి దేవాలయం | ఆర్. చిన్నయ్య |
| 3. ముతువాలపాలెం | 3. ఆంజనేయస్వామి దేవాలయం | టి. అంథోని |
| | | ఆర్. వేమయ్య |
| | | ఇ పట్టాభిరామ్‌రెడ్డి |
| | మునిసిపల్ వైస్ ఛైర్మన్ | మరియు |
| | దేవాదాయ ఇన్‌స్పెక్టర్ | యస్. చంగలరాయ శెట్టి |

| హరిజనపాలెం పేరు | దర్శించవలసిన దేవాలయం పేరు | సహకరించవలసిన కార్యకర్తలు |
|---|---|---|
| **రెండవ వర్గం :** | | |
| 1. మాలపేట | 1. ధర్మరాజుస్వామి దేవాలయం | పి. శేషయ్య |
| 2. హరిజనపాలెం | 2. శివాలయం | జి. వెంకటరామయ్య |
| 3 మాదిగపాలెం | 3. వేణుగోపాలస్వామి దేవాలయం | యం. పాపయ్య<br>యస్. కృష్ణయ్య మరియు<br>ఇన్‌కంటాక్స్ ఆఫీసరు,<br>మునిసిపల్ హెల్త్ ఆఫీసరు,<br>నెల్లూరు. |
| **మూడవ వర్గం :** | | |
| 1. స్టోన్‌హౌస్‌పేట | 1. శివాలయము<br>నవాబుపేట | డిప్యూటి రిజిస్ట్రార్ ఆఫ్<br>కో-ఆపరేటివ్ సొసైటీస్ |
| 2. మాదిగపాలెం | 3. మహాలక్ష్మి దేవాలయం | వి. రాఘవయ్య |
| 3. రాయపుపాలెం | 3. ఉదయవర్లు దేవాలయం | టి. నారాయణయ్య |
| | 4. ధర్మరాజు దేవాలయం | యస్. పెద్దయ్య,<br>కె. నరసింహ్మ, కమీషనర్<br>నెల్లూరు మునిసిపాలిటి.<br>ఇ. సుబ్బారాయుడు.<br>డి. కృష్ణయ్యశెట్టి. |

వివాదాస్పదంగా ఉన్న దేవాలయాన్ని 30-5-1949న హరిజనులు పూజ చేసుకోవడానికి ఉదయాన్నే తెరచివుంచే ఏర్పాట్లు చేయాలని నెల్లూరు జిల్లా కలెక్టరు హిందూ రిలిజియస్ ఎండోమెంటు బోర్డు అసిస్టెంటు కమీషనరును ఆదేశించాడు. ఎలాంటి అసౌకర్యం లేకుండా ఆరోజు హరిజనులు దైవపూజ జరుపుకోవడానికి ముందుగానే ఆలయ ధర్మకర్తలతో సంప్రదించవలసిందని నెల్లూరు తహసిల్దార్, జిల్లా హరిజన సంక్షేమాధికారి, తాలూకా సప్లయ్ ఆఫీసరు నెల్లూరు గార్లకు ఆదేశాలివ్వబడ్డాయి.

26-6-1949న నెల్లూరు కలెక్టరు ఆఫీసులో మళ్లీ హరిజన దినోత్సవ సంఘం సమావేశమై ప్రతినెల 30వ తేదీ హరిజన దినోత్సవం జరిపే విషయమై కొన్ని తీర్మానాలను ఆమోదించింది. ఆ సమావేశంలో శాసన సభ్యుడైన వి. రాఘవయ్య ముఖ్యమైన ఈ క్రింది రెండు సూచనలను చేశాడు. అవి

1. గత మాసంలో హరిజనులకు భూములివ్వడం, బావుల నుండి త్రాగు నీటివసతి సౌకర్యాలను కల్పించడం మొదలైనవి జరిగాయి. అవి తరువాత కల్పించ బడుతున్నదీ లేనిదీ ప్రతినెలా జరిగే సమావేశాల్లో చర్చించబడాలి. ఈ సమాచారాన్ని స్థానిక పత్రికలకు అందించి తగిన ప్రచారం జరిగేటట్లు చూడాలి.

2. హరిజన దినం కమిటీవారు పేద హరిజనులకు వారి యజమానులు కూలీగా గింజలను కొలిచేటప్పుడు తప్పుడు కొలతలతో అన్యాయం చేయకుండా తగిన చర్యలు తీసుకోవాలి. ఈ విషయాన్ని పరిశీలించి నివేదిక అందజేయడానికి ఒక ఉపసంఘాన్ని నియమించాలి.

వి. రాఘవయ్య, పొట్టి శ్రీరాములు కమిటీలోని ఇతర సభ్యులతో చేయబడిన పై సూచనల ఆధారంగా క్రింది తీర్మానాలు ఆ సమావేశంలో ఆమోదించబడ్డాయి.

1. నెల్లూరు మునిసిపాలిటీ ప్రాంతంలో హరిజనులు ఎక్కువగా నివసించే ప్రదేశాల్లో దీపాలను పాయఖానా సౌకర్యాలను పెంచాలని ఈ కమిటీ పురపాలక సంఘాన్ని కోరుతున్నది. ప్రస్తుతం ఆ సౌకర్యాలు అసలే లేని హరిజన వాడల్లో వెంటనే పురపాలక సంఘంవారు అలాంటి సౌకర్యాలను కల్పించాలని ఏకగ్రీవంగా తీర్మానించడమైనది.

2. రాఘవయ్య గారి రెండవ సూచనను అనుసరించి ఈ క్రిందివారు ఉపసంఘ సభ్యులుగా నియమించబడ్డారు.

1) వి. రాఘవయ్య (శాసన సభ్యుడు)
2) బి. శేషారెడ్డి
3) ఇ. పట్టాభిరామిరెడ్డి
4) వి. రాఘవయ్య

ఈ సంఘానికి నెల్లూరు తహసిల్దార్ కన్వీనర్‌గా వ్యవహరిస్తారు.

3. దేవాలయ భూములను టెండర్లు పిలువకుండా హరిజనులకు లీజుకు ఇచ్చేటట్లు చట్టాన్ని మార్చడానికి హిందూ రిలిజియన్ ఎండోమెంటుబోర్డు అధ్యక్షుణ్ణి కోరడానికి తీర్మానించబడింది. ఎక్కువ మొత్తాన్ని రాబట్టుకోవడానికి ఆలయ భూముల్ని వేలం వేయడానికి బదులుగా ఆ భూముల్ని హరిజనులకు సరసమైన రేట్లకు గుత్తకు ఇచ్చేటట్లు ప్రయత్నించాలి.

4. హరిజనులను దేవాలయ ధర్మకర్తలుగా నియమించాలని హిందూ రిలిజియన్ ఎండోమెంటు బోర్డు అసిస్టెంటు కమీషనర్ గారిని కోరుతున్నాము. దేవాలయాల్లో ప్రస్తుతం ఖాళీగా వున్న గుమాస్తాల, సేవకుల ఉద్యోగాల్లో హరిజనులు నియమించబడాలి. రాబోవు ఖాళీల్లో కూడా హరిజనులనే నియమించాలి.

5. హరిజనులు దేవాలయాల్లో శుల్కం చెల్లించకుండా వివాహాలు జరుపుకోవడానికి, అనుమతించడానికి హిందూ రిలిజియన్ ఎండోమెంటు బోర్డును కోరడానికి తీర్మానించబడింది. ఇందువల్ల దేవాలయ ఆవరణలో వివాహాలు జరుపుకోవడానికి హరిజనుల్లో ఆసక్తి కలుగుతుంది.

6. నెల్లూరు జిల్లాలో వివిధ శాఖల్లో పనిచేస్తున్న అధికారులను ముఖ్యమైన గ్రామాల్లో జరుగుతున్న హరిజన దినోత్సవాల్లో పాల్గొని ఉత్సవం జరుగుతున్న తీరును పర్యవేక్షించవలసిందిగా కోరడానికి తీర్మానించబడింది. ఈ సందర్భంగా కార్యక్రమాన్ని తయారుచేయడానికి కలెక్టరుతో కలిసి మాట్లాడటానికి పొట్టి శ్రీరాములును నెల్లూరు తహసిల్దారును హరిజన సంక్షేమాధికారిని కోరడానికి తీర్మానించబడింది.

పొట్టి శ్రీరాములు యువకులైన యితర సంఘసేవా కార్యకర్తల సూచనల ప్రకారం నెల్లూరు జిల్లా కలెక్టరు 30-6-1949 (హజన దినం)నాడు జరుగవలసిన కార్యక్రమాన్ని ఇలా ప్రకటించాడు.

సమయం ఉదయం 7 నుండి 10 గంటల వరకు

| హరిజనపాలెంలు | సందర్శించే ఆలయాలు | సందర్శించు సభ్యులపేర్లు |
|---|---|---|
| **మొదటివర్గం :** | | |
| 1. నవాబ్‌పేట<br>2. స్టోన్‌హౌస్‌పేట | అన్ని దేవాలయాలు | వి. రాఘవయ్య తాలూకా సప్లయ్ ఆఫీసరు, పొట్టి శ్రీరాములు, టి. నరసయ్య, యడ్లపల్లి వెంకటేశ్వర్లు, ఇతరవార్డు కౌన్సిలర్లు. |
| **రెండవవర్గం :** | | |
| 1. రంగనాయకులపేట | అన్ని దేవాలయాలు | డిప్యూటి తహసిల్దార్, ఇ. పట్టాభిరామిరెడ్డి, సుంకు చంగల్రాయచెట్టి, వి. వెంకటప్పయ్య, వి. రాఘవయ్య. |
| **మూడవవర్గం :** | | |
| 1. సంతపేట | అన్ని దేవాలయాలు | మునిసిపల్ కమీషనర్ పి. లక్ష్మణగుప్త పైడా సుబ్బరామయ్య |
| **నాల్గవవర్గం :** | | |
| 1. మూలాపేట | అన్ని దేవాలయాలు | జిల్లా హరిజన సంక్షేమాధికారి పలమల శేషయ్య, యం. పాపయ్య (కౌన్సిలర్), గాదం చిన్నయ్య, సామ్యూల్, ఎ. గోవిందారెడ్డి. |

హరిజన దినం నాడు దేవాలయాల నన్నిటిని ఉదయం 8 గంటల నుండి 11 గంటల వరకు తెరిచి వుంచాలని దైవ దర్శనానికి వచ్చే హరిజనులకు స్వాగత మివ్వవలసిందని ధర్మకర్తలను ఆదేశించాలని హిందూ రిలిజియస్ ఎండోమెంటు అసిస్టెంటు కమీషనరును జిల్లా కలెక్టరు కోరాడు. సంఘసేవా కార్యకర్తల వెంట

ఉండి తగిన సహకారం ఇవ్వవలసిందిగా ఆయా ప్రాంతాల్లోని ఉపాధ్యాయులను, నెల్లూరు మునిసిపల్ కమీషనర్, జిల్లా విద్యాశాఖాధికారి ఆదేశాలిచ్చేటట్లు నిర్ణయించబడింది.

పై నిర్ణయానుసారంగా 29-6-1949న నెల్లూరు మునిసిపల్ కమీషనర్ హరిజన దినోత్సవం ఉపసంఘం వారికి సహకరించవలసిందిగా మునిసిపాలిటీ ప్రాంతంలోని ఉపాధ్యాయులందర్నీ ఆదేశించాడు.

పొట్టి శ్రీరాములు నిర్విరామంగా చేసిన కృషి వ్యర్థం కాలేదు. రోజులు గడిచేకొద్దీ అధికార వర్గాల్లో, అనధికార వర్గాల్లో ఆయన కృషి అద్వితీయమైందిగా భావించబడింది. హరిజనులకు ఇంకా ఎక్కువ సౌకర్యాలను కలిగిస్తూ మద్రాసు ప్రభుత్వం దేవాలయ చట్టాన్ని సవరించింది. ఈ సమాచారం పత్రికలద్వారా ఇలా తెలియజేయబడింది.

"మద్రాసు రాష్ట్ర శాసనసభచే ఇటీవల ఆమోదించబడిన మద్రాసు దేవాలయ ప్రవేశ సవరణ చట్టం హిజ్ ఎక్సలెన్సీ గవర్నర్ జనరల్‌గారి అంగీకారాన్ని పొందింది. ఈ సవరణ చట్టం హరిజనులకు అన్ని హిందూ దేవాలయాల్లో (కొన్ని కులాలకు ప్రత్యేకించిన ఆలయాలతో సహా) ప్రవేశించే హక్కు కలిగించింది. ఈ చట్టంలోని 7వ సెక్షన్ క్రింద తెలియజేయబడిన నేరాలన్నింటినీ గుర్తించడమైంది".

ఇండియన్ ఎక్స్‌ప్రెస్
29-6-1949

మద్రాసు శాసనసభ చిట్టచివరి సమావేశంలో ఆమోదించిన పశ్చిమగోదావరి జిల్లా చట్టం (రాష్ట్రీయమైన పరస్పరానుకూలం గల చట్టాలను గూర్చి తెలుసుకోవడం)కూడా గవర్నర్ జనరల్ ఆమోదాన్ని పొందింది. 1-7-1949 నుండి ఈ చట్టం అమలులోనికి వస్తుందని ప్రభుత్వం నిర్ణయించింది.

పొట్టి శ్రీరాములుతో ఆలోచించి నెల్లూరు విద్యాధికారి, వయోజన విద్యా సబ్‌కమిటీ అధ్యక్షుడు వయోజనవిద్యా ప్రచార గోష్ఠిని నెల్లూరులో ఏర్పాటుచేశారు. నెల్లూరు సంతపేటలో వున్న ప్రభుత్వ ఉపాధ్యాయ శిక్షణ పాఠశాలలో 4-7-1949 నుండి వయోజన విద్యా వాలంటీర్లకు శిక్షణా తరగతులు నిర్వహించ బడతాయని సబ్ కమిటీ మెంబర్లకిలా తెలియజేయబడింది.

"ప్రతిరోజు సాయంత్రం 5 గంటల నుండి 6 గంటల వరకు ఒక గంట వాలంటీర్లకు శిక్షణ ఇవ్వబడుతుంది. ఉపసంఘ సభ్యులు వారివారి వాలంటీర్లతో కలిసి తరగతులకు హాజరు కావలసిందిగా కోరుతున్నాము".

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీ నిర్మాణాత్మక కార్యక్రమ సంచాలకుడుగా పొట్టి శ్రీరాములు ఈ కార్యక్రమ విజయాన్ని దేశం మొత్తం మీద సాధించాలని అభిలషించాడు. అయితే పత్రికలవారు సంఘసేవా కార్యకర్తలు మౌనంగా ఉండడంతో ఆయన విచారించాడు. 21-7-1949 మద్రాసు రాష్ట్ర హరిజనోద్ధరణ మంత్రి శ్రీ బి పరమేశ్వరన్‌కు తన సంకల్పాన్ని తెలుపుతూ ఇలా సుదీర్ఘమైన లేఖ వ్రాశాడు.

"మధ్యపాన నిషేధాన్ని ప్రవేశపెట్టడం ద్వారా మద్రాసు ప్రభుత్వం మహాత్మాగాంధీ గారికి యదార్థమైన స్మారక చిహ్నాన్ని ఏర్పాటు చేసింది. హరిజనుల అసౌకర్యాలను తొలగించడమనేదీ రెండవ స్మారక చిహ్నంకాగలదు. ఇతర జిల్లాలో హరిజన దినోత్సవం ఎలా జరుగుతున్నదో నాకు తెలియడంలేదు. పత్రికలు ఈ విషయమై మౌనం వహించాయి. కానీ నెల్లూరులో మాత్రం జిల్లా కలెక్టర్ మలయప్పన్ ఇంకా ఇతర సానుభూతి పరులైన ఇతర అధికారుల సహకారంతో ఈ కార్యక్రమం అద్భుతమైన ప్రగతిని సాధించింది. మీ సహాయంతో వివరాలకు సంబంధించిన సమాచారం లభించినట్లయితే మేము వచ్చే గాంధీ జయంతి అంటే 2-10-1949వ తేదీని అఖిలభారత హరిజన దినంగా పాటింపజేయడానికి పూనుకుంటామని తెలుపుతున్నాము"

హరిజన దిన కార్యక్రమాల్లో మునిగి తేలుతూనే పొట్టి శ్రీరాములు విశ్రాంతి లభించినప్పుడు వివిధ నిర్మాణాత్మక కార్యక్రమాలను నిర్వహించడానికి పూనుకొనేవాడు. ఇందుకు అనేక ఉదాహరణలు ఉన్నాయి.

1. హరిజన హాస్టళ్ల పేరు మార్చడానికి, వాటిలో ఇతరులను చేర్చుకోవడానికి ప్రముఖ హరిజన నాయకులైన భాష్యం అయ్యంగారిని సంప్రదించవలసిందిగా సాంఘికోద్ధరణ కార్యక్రమాల్లో తనకు సన్నిహితురాలు, సానుభూతి పరురాలైన శ్రీమతి సుభద్రమ్మకు పొట్టి శ్రీరాములు 27-7-1949 నాడు లేఖ వ్రాశాడు. రాష్ట్ర విద్యాధికార్లతో సంప్రదించి రాష్ట్రమంతటా జరిగే హరిజనోత్సవాల్లో ఉపాధ్యాయులు, విద్యార్థులు అధిక సంఖ్యలో పాల్గొనేటట్లు ఆదేశాలు జారీ చేయవలసిందని పొట్టి శ్రీరాములు ఆ జాబులో ఆమెను కోరాడు.

2. 13-8-1949 న మరొక ప్రముఖ హరిజన నాయకుడు బి. యస్. మూర్తికి లేఖ రాస్తూ పొట్టి శ్రీరాములు ఖాదీ వస్త్రాలను ధరించడం ఉన్నతాధి వర్గాలను వదలిపెట్టి కేవలం ఒక మునిసిపల్ ఉద్యోగులకే ఎందుకు నిర్బంధం చేయాలని ప్రశ్నించాడు.

3. హరిజన సేవా సంఘాన్ని ఒక సలహాబోర్డుగా భావించి సంస్థాగతమైన చిల్లర రాజకీయాల దృష్ట్యా (ప్రత్యేకించి ఆంధ్రరాష్ట్రంలో) దానికి ఆర్థిక పరిపాలనా సంబంధమైన బాధ్యతల నుండి విముక్తి కల్పించాలని 26-8-1949న ప్రముఖ కాంగ్రెస్ నాయకులైన శ్రీమతి రామేశ్వరి నెహ్రూకు శ్రీరాములు లేఖ వ్రాశాడు.

4. హరిజన్ పత్రిక సంపాదకుడు కిషోర్‌లాల్ మష్రూవాలాకు 13-9-1949న జాబు రాస్తూ "మన మంత్రులు బహిరంగంగా నూలు వడుకుతూ 'తామూ తమ కుటుంబ సభ్యులలో ఖాదీ సిల్కుగా ప్రస్తుతం పిలవబడుతున్న దానిని విసర్జించి పూర్తి ఖద్దరు వస్త్రధారణ చేసినట్లయితే ఖాదీ ప్రచారం చురుకుగా జరుగుతుంది" అని తెలియజేశాడు.

5. 21-9-1949న నెల్లూరులోని ప్రముఖ వ్యాపారి కన్నయ్యశెట్టికి లేఖ వ్రాస్తూ పొట్టి శ్రీరాములు నెల్లూరు హరిజనపాలెంలో బావి త్రవ్వించే సందర్భంలో అతణ్ణి తీవ్రంగా హెచ్చరించాడు. ఆ సంఘటన ఇలా జరిగింది.

కన్నయ్యశెట్టి హరిజన పాలెంలో బావి త్రవ్విస్తానని వాగ్దానం చేశాడు. ఇనుము, సిమెంటులకు పర్మిట్లు దొరకలేదనే మిషతో అతడు పనిచేయడంలో జాప్యం చేయసాగాడు. పొట్టి శ్రీరాములు తత్సంబంధ తహసిల్దార్‌తో సంప్రదించగా అతడు రెండు మాసాల క్రితమే పర్మిట్లు మంజూరయ్యాయని చెప్పాడు. దీని ఫలితంగా పొట్టి శ్రీరాములు కన్నయ్యశెట్టిని హెచ్చరిస్తూ వాగ్దాన భంగం చెయ్యవద్దని హరిజనులకు అన్యాయం జరిగితే తాను సహించనని తెలియబరచాడు.

6. అదేరోజు మారెళ్ల గ్రామస్తుడు రమణారెడ్డికి జాబు రాస్తూ గ్రామ వైద్యశాల నిర్మాణంలో అతడు చేస్తున్న కృషిని ప్రశంసిస్తూ జాబు రాశాడు. అయితే ఆ పనిని పంచాయతీ బోర్డుకు అప్పగిస్తే అతనిపై విమర్శలుండవని ప్రజాభిప్రాయం సరైన పద్ధతిలో వ్యక్తమవుతుందనీ అందులో తెలిపాడు.

7. సబర్మతీ ఆశ్రమం మాజీ కార్యదర్శియైన నారాయణదాస్ గాంధీకి లేఖ వ్రాస్తూ ఖాదీ ఉద్యమంలో గల లోపాలను సవరించడానికి చర్యలు తీసుకోవాలని ఖాదీ అభిమానులకు శుద్ధమైన ఖద్దరుబట్ట లభింపజేయాలని పొట్టి శ్రీరాములు విజ్ఞప్తి చేశాడు.

8. మునిసిపల్ ఉద్యోగులకే ఖాదీ వస్త్రధారణను నిర్బంధం చేయడంపట్ల ప్రభుత్వ పక్షపాత వైఖరిని విమర్శిస్తూ పొట్టి శ్రీరాములు 12-10-1949 న కోదండరామస్వామి అనే సంఘసేవకునికి జాబు రాశాడు. గ్రామీణ పరిశ్రమలు త్వరితగతిని పురోభివృద్ధిని సాధించాలని ఈ పనికై కాంగ్రెస్ నాయకులనబడే వారిచేత ఫిర్కాలకై ప్రత్యేకింపబడిన మొత్తం చాలా స్వల్పంగా పరిహాస్పందనగా ఉన్నదని శ్రీరాములు ఆ జాబులో తెలియపరచాడు.

9. జంతుబలి నిషేధచట్టం విషయమై మద్రాసు రాష్ట్ర శాసనసభ చూపుతున్న అలసత్వానికి తన బాధను వ్యక్తంచేస్తూ పొట్టి శ్రీరాములు కిషోర్‌లాల్ మష్రూవాలాకు 7-11-1949న ఇలా లేఖ వ్రాశాడు.

"ఒక సంవత్సరం కిందట మద్రాసు రాష్ట ప్రభుత్వం జంతు బలులను నిషేధించే బిల్లును ఆమోదించింది. అయితే దానిని ఇంతవరకు శాసనసభలో ప్రవేశపెట్టడం జరగలేదు. మంత్రులుకాని, శాసనసభ సభ్యులుకాని ఈ విషయమై ఆలోచించిన పాపాన పోలేదు. అహింసా సిద్ధాంతాన్ని ప్రచారంచేసే వ్యక్తులు దేశంలో ఎందరో వున్నారు. ఎన్నో సంస్థలు కూడా వున్నాయి. ఎందుకు వారు నిశ్శబ్దంగా వున్నారో నాకు అర్థం కావడంలేదు. నా ఉద్దేశ్యం ఏమిటంటే ఇటువంటి వివాదగ్రస్తంకాని విషయాలు ఎన్నో వున్నాయి. ఇవి ఈనాడయినా కొనసాగింపబడవచ్చు అందువల్ల దేశానికి మిక్కిలి ప్రయోజనం చేకూరుతుంది. ఎవరో ఒకరు ఆందోళనగాని, సత్యాగ్రహంగాని ప్రారంభించేవరకూ అధికారంలో వున్నవారు ఎందుకు నిర్లిప్తంగా వుండాలి? మద్రాసు రాష్ట్ర శాసనసభ ఈ రోజు నుండి ప్రారంభమవుతుంది. శాసన సభ జరుగుతున్న ఈ సమయంలో జంతు బలుల నిషేధం బిల్లును చట్టంగా చేయవలసిందని మీరు మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రికి లేఖ ద్వారా తెలియజేశారా?

డాక్టర్ రాజేంద్రప్రసాద్ ఇండియన్ రిపబ్లిక్ అధ్యక్షుడైన తరువాత పొట్టి శ్రీరాములు ఆయనను అభినందిస్తూ ఆయన చేపట్టవలసిన అనేక నిర్మాణాత్మక

కార్యక్రమాలను గూర్చి వివరించాడు. డాక్టర్ రాజేంద్రప్రసాద్ భారత రాజ్యాంగానికి అధ్యక్షుడు. ఆయనద్వారా మాత్రమే తమ కోర్కెల్లో కనీసం కొన్నయినా నెరవేరతాయని ప్రజలాశిస్తున్నారని శ్రీరాములు తెలియజేశాడు. (1)

గత సంవత్సరం సేవాగ్రాంలో అతని ఆశీస్సులవల్ల తాను ఏవిధంగా నిరాహారదీక్ష కొనసాగించిందీ తత్ఫలితంగా మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం ప్రతినెలా 30వ తేది రాష్ట్రమంతటా హరిజన దినంగా పాటించడానికి ఎలా నిర్ణయించిందీ శ్రీరాములు రాజేంద్రప్రసాద్ గారికి వివరంగా వెల్లడించాడు. ఈ విషయమై నెల్లూరు జిల్లా కలెక్టర్ ఆర్ యస్. మలయప్పన్ అద్భుతమైన కృషి చేశాడు. ఇందుకు అందరి సహకారం లభించింది పేదలకు సహకరించే పనులు చేపట్టడానికి ఇక్కడి నాయకులంతా సుముఖంగా వున్నారు ప్రతినెలా జిల్లాలోని 50 నుండి 100 గ్రామాల్లో హరిజన దినోత్సవం జరుపబడుచున్నది. గత సంవత్సరం మొత్తం 500 గ్రామాల్లో హరిజన దినోత్సవ కార్యక్రమాలు జయప్రదంగా జరిగాయి. ఆ సందర్భంగా ఈ క్రింది కార్యక్రమాలు నిర్వహించబడ్డాయి

1. అస్పృశ్యతను నిర్మూలించుట, హరిజన దేవాలయ ప్రవేశం, బజారు బావులలో హరిజనులు నీరు తోడుకొనుట, బహిరంగ స్థలాల్లో హరిజనులు అందరితోపాటు సమానంగా వెళ్లగలగడం.
2 క్రీడలను పెంపొందించడం.
3. సామూహిక విందు భోజనాలను ఏర్పాటు చేయడం.
4. బహిరంగ ప్రదేశాలను పరిశుభ్రం చేయడం.
5 ప్రభుత్వ విధానాలను తెలుపుతూ బహిరంగ సభలను నిర్వహించడం, ప్రజా సమస్యలను, అవసరాలను తెలుసుకోవడం, పరిష్కారానికి తగిన చర్యలు తీసుకోవడం, సంగీత గోష్ఠులు ఏర్పాటు చేయడం.

హరిజనోత్సవ కార్యక్రమాలను వివరిస్తూ భారత రాష్ట్రపతికి పొట్టి శ్రీరాములు ఇలా రాశాడు.

---

1) 1950 సం॥ ఫిబ్రవరి 7వ తేదీన నూతన రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్‌కు నెల్లూరు భంగీ కాలనీ నుండి పొట్టి శ్రీరాములు వ్రాసిన లేఖ.

"హరిజన దినోత్సవాలకై పేదలు అత్యంత ఆసక్తితో ఎదురు చూస్తున్నారు. ఎందుచేతనంటే అధికారులు ఈ సమయంలో వాళ్ల ఇళ్లదగ్గరకు వచ్చి వాళ్ల సమస్యలను తెలుసుకొని పరిష్కార మార్గాలను సూచిస్తారు. వాళ్ల ఇబ్బందులను తొలగిస్తారు. ఈ విషయంలో నెల్లూరు జిల్లా ప్రత్యేకతను సంతరించుకొన్నది రాష్ట్రంలోని సగం జిల్లాలు ఈ హరిజన దినాన్ని శ్రద్ధా భక్తులతో పాటిస్తున్నాయని ప్రభుత్వ రికార్డులద్వారా నేను తెలుసుకొన్నాను. కొన్ని జిల్లాల్లో హరిజన దినం మామూలుగా పాటింపబడుతున్నది. ఇతర జిల్లాల్లో స్థానికుల ప్రోత్సాహం లేకపోవడంవల్ల అధికారుల అలసత్వం వల్ల ఈ కార్యక్రమం జయప్రదంగా జరగడంలేదు. గత సంవత్సరం రాష్ట్రమంతటా 5 వేల గ్రామాల్లో హరిజన దినోత్సవం జరపడంవల్ల హరిజనులకు కలిగే ప్రయోజనాలను ప్రభుత్వం గుర్తించి మరొక సంవత్సరం (1950 డిసెంబరు వరకు) దీన్ని పొడిగించింది. ఉత్తర్వులు చేసిన మంత్రులు తగిన శ్రద్ధాసక్తులు చూపించక పోయినప్పటికీ ఈ కార్యం విజయవంతమయింది. ప్రభుత్వంలోని యితర శాఖలకు చెందినవారు యిందులో పాల్గొనడంలేదు. కాంగ్రెస్ కమిటీలు పరస్పరం కీచులాడుకుంటూ ఈ కార్యక్రమంలో సహకరించడం లేదు

సర్వోదయ దినం రోజు డాక్టర్ రాజేంద్రప్రసాద్ హాజరైన ఒక నూలువడకే కార్యక్రమాన్ని గూర్చి శ్రీరాములు తన సంతోషం వ్యక్తంచేస్తూ ఇలా రాశాడు

"మీరు నెహ్రూగారితో కలిసి సర్వోదయ దినం సందర్భంగా రాజ్‌ఘాట్‌లో జరిగిన పవిత్రమైన నూలు వడికే కార్యక్రమానికి హాజరైనారని పత్రికలద్వారా విని సంతోషించాము. ఆనాడు మీరు ప్రదర్శించిన ఉత్సాహంలో ఏ కొంచెమైనా ప్రతినెలా 30వ తేదీ జరిగే హరిజన దినం నాడు చూపించలేరా ? ప్రజలు వారికై వారు ఏ ప్రయత్నమూ చేసుకోలేరు. ఎవరైనా ఒకరు ముందుండి వారిని నడిపించాలి కాంగ్రెస్ కమిటీలు కేవలం అధికార రాజకీయాలలోనే ఆసక్తి చూపుతున్నాయి. వారు వారి వర్గాలను బలపరచుకోవడంలో తమ ధనాన్ని, తమ శక్తిని వినియోగించు కోవడానికి వెనుదీయడంలేదు. ఇతర ప్రతిపక్షాలు కూడా ప్రజాభ్యుదయ కార్య క్రమాలను పట్టించుకోకుండా ప్రస్తుత కాంగ్రెస్ ప్రభుత్వంపై ద్వేషం కలిగేలా వాళ్లను రెచ్చగొడుతున్నాయి మిక్కిలి పవిత్రమైన సర్వోదయ దినం కూడా నెల్లూరులో అధికారులచేత ప్రభుత్వ సబ్సిడీ పొందుతున్న హాస్టల్ బాలబాలికలతో నిర్వహించబడింది. స్థానిక కాంగ్రెస్ కమిటీలు, కాంగ్రెస్ వ్యక్తులు ఈ ఉత్సవాన్ని

బహిష్కరించినట్లు కనబడుతుంది. దీన్నిబట్టి మంచిగాని, చెడుగాని ఏదైనా ఒక పనిని విజయవంతంగా నిర్వహించాలంటే ఒక ప్రభుత్వంవల్లే ఈ రోజుల్లో సాధ్యమవుతుందని తెలుస్తున్నది. మీరు ఆదర్శప్రాయంగా వున్నట్లయితే కేంద్ర మంత్రులు మిమ్మలను అనుసరిస్తారు. వారు ఆదర్శప్రాయంగా ప్రవర్తించినట్లయితే రాష్ట్ర మంత్రుల్లో కూడా చైతన్యం కలుగుతుంది. ప్రభుత్వంలోని ప్రతి శాఖా విజయం సాధించడానికి ఉత్సాహంగా పనిచేస్తుంది".

ప్రభుత్వాధికారులు సాంఘిక సేవా కార్యక్రమాల్లో మామూలుగా పాల్గొంటున్నారే కాని చిత్తశుద్ధితో వ్యవహరించడం లేదనే విషయాన్ని ఆయన గమనించాడు. కొన్ని సందర్భాల్లో అధికారులు ఆ కార్యక్రమాలను తమాషాగా భావించేవారు. పొట్టి శ్రీరాములు ఇలా ఆలోచించాడు. "ప్రస్తుతం భారతదేశ స్థాయిలో ఎన్నో కార్యక్రమాలు నిర్వహించబడుతున్నాయి ఎప్పుడూ జరిగే ఈ ఉత్సవ కార్యక్రమాలను ప్రభుత్వాధికారులే నిర్వహించాలి. ఆఫీసుల్లో వారు వారం, వారం చేసే విధులకు అదనంగా వారు ఈ కార్యక్రమాలను నిర్వహించవలసి వుంటుంది. అందువల్ల వాళ్లకీ పనులు తమాషాగానే వుంటాయి. వీటిని వాళ్లు తీవ్రమైన విషయంగా పట్టించుకోరు. వయోజనవిద్యావారం, ఆరోగ్య వారం, గ్రోమోర్ ఫుడ్ వారం యింకా ఇలాంటి వారోత్సవము లెన్నింటినో వాళ్లు జరపవలసి వుంటుంది. వీటినన్నింటిని కలిపి నెలకొకరోజు 'సర్వోదయ దినం' జరిపేటట్లయితే ఎక్కువ ప్రయోజనం చేకూరదా ? ఆరోజు పోలీసు డిపార్ట్‌మెంటుతో సహా అన్ని శాఖల వారిని ఉత్సవంలో పాల్గొనాలని ఆదేశించాలి. ప్రతి రంగానికి చెందిన నిర్మాణాత్మక కార్యక్రమాలను ఆరోజు ప్రారంభించాలి. ఆరోజు అధికారులు, కార్యకర్తలు, ప్రజలు ఒకచోట కలిసి ఎంతో కొంత నిజమైన కృషి చేయడానికి వీలుంటుంది

సేవాగ్రాం ఆశ్రమంలో ధనరూపేణా కానుకలను స్వీకరించడం ఆపివేయాలని అక్కడికి వచ్చే ప్రజలు రోజుకు అయిదు నిమిషాలు నూలు వడకి యిచ్చిన దారాన్ని మాత్రమే కానుకగా స్వీకరించాలని ఆశ్రమ మాజీ కార్యదర్శి నారాయణ్‌దాస్ గాంధీ తెలిపిన అభిప్రాయాలను పొట్టి శ్రీరాములు జ్ఞప్తికి తెచ్చుకొన్నాడు. ఈ సూచన చాలా శక్తివంతమయింది. మహాత్మాగాంధి పేరును జపిస్తూ, క్రియా శూన్యంగా వ్యవహరించేవారికి అది ఒక అగ్నిపరీక్ష అయింది. నెల్లూరు జిల్లా కలెక్టరు మలయప్పన్ ఉదాహరణగా పేర్కొంటూ అత డిలా తెలిపాడు. "మా జిల్లా కలెక్టరు రోజుకు సరాసరి 20 గంటలు పనిచేస్తారు. ఐనా ప్రతిరోజు ఐదు నిమిషాలు

నూలు వడకుతాడు. మన జాతిపిత దీనిని పవిత్ర కార్యంగా ఉద్దేశించాడు. ఈ కార్యక్రమాన్ని ప్రతిరోజు 5 నిమిషాలు ప్రతి ప్రభుత్వ కార్యాలయంలో ఎందుకు ప్రవేశపెట్టకూడదు శాసనసభ తలచుకుంటే ఈ పని చాలా సులభం. అయితే ఎవరినీ బలవంతం చేయకూడదు. ఎవరంతటవారే ఈ కార్యానికి తప్పక పూనుకొంటారు. పండిత నెహ్రూ మార్గదర్శకులుగా ముందుంటే ప్రభుత్వ కార్యాలయాలేకాదు. ప్రతి ఇంట్లో ఈ కార్యక్రమం అమలు జరుగుతుంది. ఇది బాపూజీకి యదార్థమైన స్మారక చిహ్నం అవుతుంది. ప్రతిమాసం జరిగే సర్వోదయ దినోత్సవ కార్యక్రమంలోని అంశాల్లో దీన్ని తప్పక ప్రవేశపెడతారని ఆశిస్తున్నాను. సర్వోదయ దినాన్ని శ్రీరాములు కేవలం సెలవుదినంగా పరిగణించలేదు. ఆరోజు కృషి ఎక్కువగా జరుగవలసిన దినం. దైనందిన కార్యక్రమానికి మించిన కృషి ఆరోజు జరగాలి. (1)

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీ నిర్మాణాత్మక కార్యక్రమ సంచాలకుడుగా వ్యక్తిగతమైన విశేషానుభవం గడించిన శ్రీరాములు సర్వోదయదినం నాడు పాటించవలసిన సూచనలను ఇలా వివరించాడు.

1. **అస్పృశ్యత నిర్మూలనం :—** ఊరేగింపులు, హరిజన దేవాలయ ప్రవేశం, హరిజనులచేత బావులను బహిరంగ స్థలాలను వాడుకోనీయడం, వీధులను పరిశుభ్రపరచడం.

2. **సూత్ర యజ్ఞం :—** ఒకచోట ప్రజలంతా కలసి ప్రజా శ్రేయస్సు కోసం నూలు వడకడాన్ని ప్రోత్సహించడం. సూత్రదాన ప్రణాళికను వివరించి వడికిన నూలును సేవాగ్రాంకి పంపడం.

3. **వినోద కార్యక్రమాలు :—** క్రీడలు, సంగీతం మొదలైనవి నిర్వహించడం.

---

1) 1950 ఫిబ్రవరి 7వ తేదీన పొట్టి శ్రీరాములు నెల్లూరు భంగీ కాలనీ నుండి రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్‌కు వ్రాసిన లేఖ.

**4. బహిరంగ సభలు :—** గాంధీజీ నిర్మాణ కార్యక్రమం ప్రధానంగా ఉంటుంది. ముఖ్యంగా అంటరానితనం తొలగించడం. ఖాదీప్రచారం, వయోజనవిద్య, అధికాహారోత్పత్తి, పారిశుద్ధ్యం, మద్యపాన నిషేధం, ప్రాతిపదిక విద్య మొదలైనవి.

గాంధీజీ సూచించిన విధంగా నిర్మాణాత్మక కార్యక్రమ కృషిని త్వరితంగా వివరించడానికి శ్రీరాములు రాష్ట్రపతికిలా విజ్ఞప్తి చేశాడు. ప్రతినెలా 30వ తేదీని అఖిలభారత సర్వోదయ దినంగా ప్రకటించడం మీకు సాధ్యమైన విషయమేనని నేను భావిస్తున్నాను. ఆనాటి ఉత్సవ కార్యక్రమంలో ప్రభుత్వంలోని వివిధ శాఖాధిపతులను నిర్బంధంగా పాల్గొనేటట్లు చేసి ఎంతో కొంత యథార్థమైన కృషిని కొనసాగించేటట్లు చేయగలరని మిమ్ము ప్రార్థిస్తున్నాను.



# తొమ్మిదవ అధ్యాయం

## ఆంధ్ర ప్రాంతపు గాంధీ స్మారక నిధి సంచాలకుడుగా పొట్టి శ్రీరాములు కార్యక్రమాలు

జాతిపిత బాపూజీ తెల్పిన నిర్మాణ కార్యక్రమాన్ని విస్తరింప జేయడానికి గాంధీ స్మారకనిధి అనే పేరుతో ధనాన్ని సేకరించాలని భారత రిపబ్లిక్ జాతీయ నాయకులంతా సుదీర్ఘ చర్చలు జరిపిన అనంతరం నిర్ణయించారు. తత్ఫలితంగా జి. వి. మేలంకర్ (1) అధ్యక్షుడిగా ట్రస్ట్‌బోర్డు ఏర్పడింది

| | | | |
|---|---|---|---|
| 1. | దేవదాస్ గాంధి (ఉపాధ్యక్షుడు) | 11 | శ్రీ శ్రీరాం |
| 2. | లక్ష్మీదాస్ పురుషోత్తం (సెక్రటరీ) | 12. | శ్రీ కృష్ణదాస్‌బాబు |
| 3. | జవహర్‌లాల్ నెహ్రూ | 13. | ఆశాదేవి ఆర్యనాయకమ్ |
| 4. | సి. రాజగోపాలాచారి | 14. | ఎ. పి. బెంథాల్ |
| 5. | మౌలానా అబ్దుల్‌కలామ్ ఆజాద్ | 15. | యశోధర దాసప్ప |
| 6. | రాజకుమారి అమృతకేర్ | 16. | మంగళదాస్ పక్వాసా |
| 7. | శంకర్రావు దేవ్ | 17. | గోవిందవల్లభ పంత్ |
| 8. | జగ్‌జీవన్‌రమ్ | 18. | డి ఆర్. డి. తాతా |
| 9. | డా॥ పట్టాభిరామ్ | 19. | కస్తూర్‌భాయ్ లాల్‌భాయ్ |
| 10. | ఘనశ్యామ్‌దాస్ బిర్లా | 20. | ప్రఫుల్లచంద్రఘోష్ |

దేశమంతటా సంచారం చేసి నిధిని పోగుచేయడం అసాధారణమైన విషయం. కనుక ప్రతి రాష్ట్రంలో సంఘసేవకు అంకితమైన కార్యకర్తలను సంచాలకులుగా నియమించాలని ట్రస్టీబోర్డు మెంబర్లు నిశ్చయించారు. దీని ప్రకారం బోర్డు కార్యదర్శి, లక్ష్మీదాస్ పురుషోత్తం ఒక సర్క్యులర్ విడుదలచేస్తూ ఈ క్రింది పట్టికను జతపరచాడు.

---

1) గాంధీ స్మారక నిధి రికార్డు పుస్తకాల ఆధారంగా.

| గాంధీ స్మారకనిధి బ్రాంచి | సంచాలకుని పేరు లేదా ప్రతినిధి పేరు (ఉదా. సం॥ 9) | అకౌంటు తెరువవలసిన బ్యాంకు |
|---|---|---|
| 1 ఆంధ్ర | పొట్టి శ్రీరాములు | ఆంధ్రా బ్యాంకు |
| 2 అస్సాం | అమల ప్రభాదాస్ | అస్సాం కో-ఆపరేటివ్ అపెక్స్ బ్యాంక్ |
| 3. విదర్భ | డా॥ అమెర్ మోరే | ఇంపీరియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా |
| 4. హైదరాబాద్ | శ్రీ రామకిషన్ ధూత్ | మర్కంటైల్ బ్యాంక్ ఆఫ్ హైద్రాబాద్ |
| 5. కర్నాటక | తిమ్మప్ప నాయక్ | కెనరా ఇండస్ట్రియల్ అండ్ బ్యాంకింగ్ సిండికేట్ లిమిటెడ్ |
| 6. కేరళ | యస్. శివన్ పిళ్లై | సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా |
| 7 మహారాష్ట్ర | టి. ఆర్. దేవగిరికర్ | బ్యాంక్ ఆఫ్ బరోడా |
| 8 మైసూర్ | యశోధర దాసప్ప | సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా |
| 9 నాగపూర్ | శ్రీ నళిన్ మెహతా | సి. పి. అండ్ బీరార్ ప్రావిన్షియల్ కో-ఆపరేటివ్ బ్యాంక్ |
| 10. పంజాబ్ & హిమాచల్ | ఓం ప్రకాష్ త్రికా | సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా |
| 11. తమిళనాడు | యన్. యం ఆర్. సుబ్బరామన్ | సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా |
| 12 ఉత్కళ్ | మాలతీదేవి | ఒరిస్సా ప్రావిన్షియల్ కో-ఆపరేటివ్ బ్యాంక్ లిమిటెడ్ |
| 13. మధ్యభారత్ | వి. యస్. ఖోడే | బ్యాంక్ ఆఫ్ ఇండోర్ |
| 14 రాజస్తాన్ | సిద్ధరాజ్ఢడ్డా | బ్యాంక్ ఆఫ్ జయపూర్ |
| 15. ఢిల్లీ | బ్రిజ్ కృష్ణ చందీవాలా | మర్కంటైల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా |
| 16. ఉత్తరప్రదేశ్ | బాబా రాఘవదాస్ | సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా(1) |

1) కార్యదర్శి లక్ష్మీదాస్ పురుషోత్తం 25-10-1950 నాటి తన సర్క్యులర్ లెటర్‌కు అనుబంధంగా జతచేసి ఈ పట్టీని ప్రకటించాడు.

ఆంధ్ర రాష్ట్రానికి చెందిన గాంధీ స్మారకనిధి సంఘం ఈ క్రింది కార్యవర్గ సభ్యులతో ఏర్పడింది. (1)

ప్రొ॥ రంగా (చైర్మన్)
వి. రామకృష్ణ (వైస్ చైర్మన్)
బి. వి. సుబ్బారెడ్డి (వైస్ చైర్మన్)
దుగ్గిరాల బలరామ కృష్ణయ్య (సెక్రెటరీ)
పెద్ది రెడ్డి తిమ్మారెడ్డి (సెక్రెటరీ)
శ్రీమతి ద్రోణం రాజ్యలక్ష్మీబాయమ్మ (సెక్రటరీ)
డా॥ బి. వి. యస్. చలపతిరావు (ట్రెజరర్)

కొత్తఢిల్లీలోవున్న గాంధీ స్మారక నిధి కేంద్ర కార్యాలయం వారు ఈ ప్రణాళిక క్రింద నిర్వహించ వలసిన కార్యక్రమాలను గురించి వాటికిగాను ఖర్చు పెట్టవలసిన విధానాన్ని గూర్చి కొన్ని మార్గదర్శక సూత్రాలను సూచించారు.

## రాష్ట్ర కోటాలను బట్వాడా చేయవలసిన విధానం :-

అ) ఖర్చుకు సంబధించిన పరిశీలనా పథకాలను తయారుచేసేటప్పుడు పది సంవత్సరాలలోపల నిధిని ఖర్చుచేయాలి అనే విషయాన్ని గుర్తుంచుకోవాలి.

ఆ) గ్రామీణ ప్రాంతాల్లో 85% చొప్పున, పట్టణ ప్రాంతాల్లో 15% చొప్పున ఖర్చు చేయాలి. పట్టణ ప్రాంతాల్లో చేసే ఖర్చు గ్రామాలకు కూడా ప్రయోజన కారిగా ఉండేటట్లు చూడాలి.

ఇ) ఐదువేలకు మించని జనాభాగల ప్రదేశం గ్రామంగా లెక్కింపబడుతుంది. కొన్ని ప్రత్యేక సందర్భాల్లో ఈ పరిమితి ఏడు వేల వరకు పెంచబడవచ్చు.

ఈ) 1. కార్యకర్తలకు శిక్షణ ఇవ్వడం నిధికి సంబంధించి ముఖ్య కర్తవ్యం. ఇందుకుగాను తగిన మొత్తాన్ని ఖర్చు చేయాలి. శిక్షణ సంబంధ విషయాలు ఉచిత రీతిని బోధించడానికి ప్రస్తుత నిర్మాణ సంస్థలకు పంపాలి సాధ్యమైనవరకు నిర్ణీత శిక్షణాలయాల్లోనే కార్యకర్తలకు శిక్షణ ఇవ్వాలి.

---

1) పొట్టి శ్రీరాములు పర్సనల్ ఫైల్స్, దినచర్య పుస్తకాల నుండి.

2 కార్యకర్తల శిక్షణా బాధ్యతను కేంద్రం నిర్వహించాలా ? రాష్ట్ర యూనిట్లు నిర్వహించాలా? లేక ఉభయులు నిర్వహించాలా? అనేది చర్చనీయాంశం. రాష్ట్రాలకు చెందిన కోటాల్లో మొత్తం నుండి ఇందుకయ్యే ఖర్చు భరించాలని లోగడ నిర్ణయించబడింది అవకాశం చూసుకొని కేంద్రం కొన్ని కేంద్రీయ శిక్షణాలయాలను సెలక్టు చేసినట్లయితే రాష్ట్ర యూనిట్లు అక్కడికి తమ సొంత ఖర్చులతో శిక్షణ పొందడానికి తమ యూనిట్ల నుండి కార్యకర్తలను పంపుతాయి.

5. నిర్మాణాత్మక కార్యక్రమాలను కొనసాగించడానికి ఈ నిధి క్రింద అడ్వాన్సుగా ఋణాలు మంజూరు చేయవచ్చు.

6. నిధి యొక్క రాష్ట్ర కోటాల మొత్తం నుండి క్రింద సూచింపబడిన వివిధ కార్యక్రమాల పనులకు ధనాన్ని ఖర్చుచేయవచ్చు

1. ఆకస్మికంగా జరిగే పనులకు రాష్ట్ర కార్యాలయాల పరిపాలనా సంబంధమైన ఖర్చుకు — రూపాయకు రెండణాల వంతున

   గమనిక . వచ్చే మూడు సంవత్సరాల వరకు ఆకస్మిక కార్యాలకు మూలనిధి నుండి ఖర్చు చేయరాదు.

2 వర్కర్ల శిక్షణకు — రూపాయకు ఒక అణా వంతు

3 పని కొనసాగుచుండగా వర్కర్ల భోజనాదికాలకు — రూపాయకు రెండణాల వంతున

4. వర్కర్లకు కావలసిన పనిముట్లు పనిచేయుటకు కావలసిన ఇతర వస్తువులకు — రూపాయకు ఒక అణా వంతున

5. గాంధి సిద్ధాంతాల ప్రచారానికి (పుస్తకాలు, ఉపన్యాస సభలు మొదలైనవి) — రూపాయకు ఒక అణా వంతున

6. స్త్రీలకు, బాలురకు (సాధ్యమైనంతవరకు కస్తూర్బా గాంధీ నేషనల్ మెమోరియల్ ట్రస్టు ద్వారాగాని వారి సహకారంతోగాని ఈఅంశం క్రింద ఖర్చు చేయడం) — రూపాయకు ఒక అణా

7. హరిజనోద్ధరణ కార్యాలకోసం — రూపాయకు అణా

8. ఆదిమవాసుల సంక్షేమం కోసం — రూపాయకు అణా

9 కుష్ఠురోగ నివారణ — రూపాయకు అణా

| | |
|---|---|
| 10. గోసేవ వ్యవసాయం | రూపాయకు అణా |
| 11. ప్రాతిపదిక విద్య | రూపాయకు రెండణాలు |
| 12. గ్రామీణ పరిశ్రమలు | రూపాయకు అణా |
| 13. ఖాదీ వస్త్ర స్వావలంబనానికి | రూపాయకు 3 1/2 అణాలు |
| 14. ఆరోగ్యం - జీవశాస్త్రం | రూపాయకు 3 1/2 అణాలు |

ఈ విధంగా ఖర్చు చేయవలసిన మొత్తాలను నిర్ణయించడం యూనిట్ సంచాలకులకు మార్గదర్శకంగా వుంటుందనే కాని, నిషేధాత్మక ధోరణిలో కాదు ఈ నిర్ణయాల పరిస్థితికి లోబడి సంచాలకులు తమ పథకాలను, బడ్జెట్‌లను తయారుచేసుకోవలసి వుంటుంది.

సంచాలకుడుగా పదవీ బాధ్యతలను స్వీకరించినప్పటినుంచి పొట్టి శ్రీరాములు తన పనులను నిర్విరామంగా కొనసాగించడం ప్రారంభించాడు. ఆంధ్రదేశంలో వున్న ధార్మికసంస్థల పేర్లను వాటి స్థితిగతులను సమగ్రంగా తెలుసుకోవడానికి ఆ సంస్థలకు సంబంధించిన వ్యక్తులతో విస్తృతంగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు. నిర్మాణ కార్యక్రమ సంచాలకుని హోదాలో ఆంధ్రరాష్ట్ర మంతట సంచారం చేసి గడించిన విశేషానుభవం అతనికి ప్రయోజనకారి అయింది.

ఆంధ్ర ప్రాంతానికి చెందిన గాంధీ స్మారక నిధి సంచాలకుడయిన పొట్టి శ్రీరాముల ఆధిపత్యంలోనికి ఈ క్రింది సేవా సంస్థలు వచ్చాయి. అతడు వాటి కృషిని, అభివృద్ధిని పర్యవేక్షించవలసి వచ్చింది. (1)

**ఆంధ్ర ప్రాంతంలో నిర్మాణాత్మక కృషి కొనసాగిస్తున్న సంస్థలు :**

| జిల్లా | సంస్థ పేరు ముఖ్య సేవకుడు | ప్రస్తుతపు పని | ఇతర వివరములు |
|---|---|---|---|
| 1. కృష్ణా | గాంధీ ఆశ్రమం; అంగలూరు ఎర్నేని సుబ్రమణ్యం | 1. గాంధీ స్మారక సేవలు గాంధీ సాహిత్యప్రచారానికి గ్రామ సేవకులకు తగిన శిక్షణ యివ్వడం | 1. పనివారికి, శిక్షణ పొందేవారికి, వసతి గృహాన్ని, పాయఖానా, స్నానశాలలను నిర్మించే ప్రయత్నం చేయడం |

1) పొట్టి శ్రీరాములు గారి పర్సనల్ ఫైల్ నుండి

| జిల్లా | సంస్థ పేరు ముఖ్య సేవకుడు | ప్రస్తుతపు పని | ఇతర వివరములు |
| --- | --- | --- | --- |
| | | 2. ప్రభుత్వం యొక్క గ్రామాభివృద్ధి కృషిని కొనసాగించడం | 2. ఆదర్శ గ్రామాలుగా తీర్చిదిద్దడానికి ప్రయత్నం చేయడం |
| | | 3. హిందీ పాఠశాల | |
| | | 4. కస్తూర్బా గ్రామ సేవా కేంద్రాన్ని నడపడం | |
| | | 5. వ్యవసాయం | |
| | | 6. తేనెటీగల పెంపకం | |
| | | 7. స్వావలంభనం ఖాదీనేత | |
| 2. | గాంధీ సేవాశ్రమం, మండపల్లి మల్లిఖార్జున్ | 1. గ్రామసేవ<br>2. వ్యవసాయం<br>3. హరిజన బాలుర హాస్టల్ | సేవచేయడం |
| 3. | కస్తూర్బా కరుణా నిలయం యనమలకుదురు | 1. పేదబాలికతో ఆశ్రమ జీవితాన్ని గడపడం | సేవచేయడం |
| 4. | మహిళా బేసిక్ ట్రైనింగ్ సెంటర్ తిరువూరు వెలుర్న్తేని దమయంతి | 1. ట్రైనింగ్ స్కూలు<br>2. గోశాల | సేవచేయడం |
| 5 | ఖద్దరు సంస్థానం బెజవాడ, ఉప్పులూరు వెంకట కృష్ణయ్య | 1. దారం వడకడం<br>2. వస్తు వినిమయం<br>3. స్వావలంబన ఖాదీ | సిద్ధాంత ప్రచారానికి కృషి |
| 6. | ఎ. ఐ. యస్. ఎ. మచిలీపట్నం | 1. అమ్మకపు డిపోలు<br>2. ఉత్పత్తి కేంద్రాలు | —<br>— |

| సంస్థపేరు ముఖ్య సేవకుడు | ప్రస్తుతపు పని | ఇతర వివరాలు |
|---|---|---|
| 7. గ్రంధాలయట్రస్ట్,పటమట పాతూరి నాగభూషణం | 1. గ్రంధాలయ నిర్వహణ 2. తెలుగు సాహిత్య పుస్తక ప్రచురణ | విద్యా సంబంధమైన కృషి |
| 8. హిందీ ప్రచార సభ, బెజవాడ వి. రాజగోపాల కృష్ణయ్య | 1. పాఠశాల నిర్వహణ 2. పరీక్ష నిర్వహణ 3. పుస్తక ప్రచురణ | హిందీ ప్రచారం — — |
| 9. హెల్త్‌హోమ్, బెజవాడ సీతారామవధుత | 1 ప్రకృతి చికిత్సాలయం 2. ఆయుర్వేద వైద్యశాల | — — |
| 10. ప్రకృతి, బెజవాడ సంపాదకుడు పుచ్చా వెంకటరామయ్య | 1. మాసపత్రికా నిర్వహణ 2 ఆంధ్రరాష్ట్రం కోసం ఆందోళన నిర్వహించడం | ఆరోగ్యమును పెంపొందించే ప్రకృతి చికిత్సను గురించి ప్రచారం |
| 11. విద్యావనం కోడిపర్రు వెంకటేశ్వరరావు | 1 హిందీ పాఠశాల 2 ప్రకృతి వైద్యం 3 వ్యవసాయం | హిందీ ప్రచారం |
| 12. నాస్తిక కేంద్రం పటమట గో. రా. | 1 వారపత్రిక 2 గ్రంధ ప్రచురణ | నాస్తిక మతప్రచారం |
| 13. హరిజన హాస్టళ్లు | 26 హాస్టళ్లు 735 మంది బాలబాలికలు | — |
| 14. ఆదిమవాసి హాస్టళ్లు ఎ ఐ యస్. ఎ తెనాలి పి. రామకృష్ణయ్య | 2 హాస్టళ్లు 56 మంది బాలబాలికలు | — |

| సంస్థపేరు ముఖ్య సేవకుడు | ప్రస్తుతపు పని | ఇతర వివరాలు |
|---|---|---|
| 2) గుంటూరు | | |
| 1. వినయాశ్రమం<br>గ్రామ సేవా కేంద్రం<br>కొవ్వూరు<br>స్వామి సీతారాం | 1. కస్తూర్బా ప్రసూతిగృహం<br>2. బాల మందిర్<br>3. ఆయుర్వేద పశువైద్యశాల<br>4. దీన పోషణ<br>5. సదావర్తి<br>6. హిందీ ప్రచారం<br>7. ప్రచురణలు<br>8. వస్త్ర స్వావలంబనం<br>9. బేసిక్ స్కూలు | గ్రామాల్లో<br>సమగ్రమైన<br>అభివృద్ధి<br>సర్వోదయ<br>ప్రచారం |
| 2. యోగవిద్య<br>ప్రకృతి వైద్యం<br>పునాదిపాడు<br>కె. రంగదాసు | 1. ఆయుర్వేద ఆసుపత్రి<br>2. వ్యాయామశాల<br>3. ప్రకృతి వైద్యం<br>4. వ్యవసాయం<br>5. గోసేవ<br>6. ఆంధ్రరాష్ట్రానికై ఆందోళన | ఆరోగ్యమును<br>పెంపొందించడం |
| 3 గ్రామ విశ్వవిద్యాలయం<br>తెనాలి,<br>బి నరసింహం | 1. సబ్బులతయారి<br>2. పెయింట్లు<br>3. వార్నీషులు<br>4 ప్రింటింగ్ సిరా | — |
| 4. శారదానికేతనం, గుంటూరు<br>వి. లక్ష్మినారాయణ | 1. సంస్కృత పాఠశాల<br>2. చేతి పనులు | స్త్రీ విద్య |
| 5. ఎ ఐ.యస్ ఎ., తెనాలి<br>పి. రామకృష్ణయ్య | 1. అమ్మకపు డిపో<br>2. ఉత్పత్తి కేంద్రం | — |

| సంస్థపేరు ముఖ్య సేవకుడు | ప్రస్తుతపు పని | ఇతర వివరాలు |
|---|---|---|
| 6. గ్రామసేవా కేంద్రం, పెదరావూరు శ్రీమతి తులశమ్మ, పి. రామకృష్ణ | 1. బాలమందిర్<br>2 అల్లికపు పని<br>3. ఎరువుల తయారి<br>4. నైట్ సాయిల్ కంపోష్టు<br>5 హిందీ ప్రచారం<br>6. వస్త్ర స్వావలంబనం | గ్రామాల్లో సమగ్ర అభివృద్ధి సాధించడం |
| 7. యోగవిద్య ప్రకృతికేంద్రం పునాదిపాడు, కె. రంగదాసు | 1. వ్యాయామశాల<br>2. ప్రకృతి వైద్యం<br>3 వ్యవసాయం | ఆరోగ్యమును పెంపొందించడం |
| 8. ఆయుర్వేద వెటనరీకళాశాల, తెనాలి ఏజెండ్ల శ్రీరాములుచౌదరి | 1 విద్యార్థులకు బోధన<br>2 పశుపోషణ<br>3 వ్యవసాయం<br>4. మందుల తయారీ | పశువుల ఆరోగ్యాన్ని పెంచడం |
| 9. మానవ సేవా సంఘం, కొత్తపాలెం కె. లక్ష్మీనారాయణ | 1. హరిజన హాస్టల్ | గ్రామసేవ |
| 10. మహిళా హిందీ విశ్వ విద్యాలయం వి. వెంకటప్పయ్య | 1. హిందీ పాఠశాల<br>2 కుష్ఠు వ్యాధి చికిత్స<br>3. గాంధీ స్మారకంగా చికిత్స చేయడం శిక్షణ ఇవ్వడం | హిందీ ప్రచారం 30 కుటుంబాలకు ఆశ్రయం కల్పించడం |
| 11. శ్రీకృష్ణాశ్రమం, గుంటూరు కృష్ణంరాజు | 1. పారిశ్రామిక పాఠశాల | 100 మంది రోగులకు ప్రకృతి చికిత్సలో గృహవైద్యశాల |

23)

| సంస్థ పేరు ముఖ్య సేవకుడు | ప్రస్తుతపు పని | ఇతర వివరాలు |
|---|---|---|
| 12. తత్వానంద శిల్పాశ్రమం మంగళగిరి, కామాక్షమ్మ వెంకటేశ్వర్లు | 1. ప్రచురణశాల<br>2. గ్రామసేవ | శాశ్వత సంస్థగా వృద్ధిపరచడం |
| 13. మహాత్మాగాంధి ఆశ్రమం గురజాల, కె. వెంకయ్య | 1. పాఠశాల<br>2. హాస్టల్<br>3. ట్రైనింగ్ స్కూలు | క్షయ, కుష్ఠు వ్యాధులకు వేర్వేరు విభాగాలు తెరవడం |
| 14. అనేక యానాది కాలనీలు | – | – |
| 15. హరిజన హాస్టళ్లు | 45 హాస్టళ్లు 1050 మంది బాలబాలికలతో | – |
| 16. ఆదివాసి హాస్టళ్లు | 9 హాస్టళ్లు, 178 మంది బాలబాలికలు | – |
| 17. కస్తూర్బా గ్రామ సేవా కేంద్రం, బుర్రిపాలెం, శ్రీమతి సరళాదేవి | 1. బాలమందిర్<br>2. వయోజనవిద్య<br>3. సఫాలు (పరిశుభ్రం చేయడం) | గ్రామసేవ |

3) పశ్చిమ గోదావరి జిల్లా :

| సంస్థ పేరు ముఖ్య సేవకుడు | ప్రస్తుతపు పని | ఇతర వివరాలు |
|---|---|---|
| 1. శ్రీరామకృష్ణ ప్రకృతి ఆశ్రమం, భీమవరం, వేగిరాజు కృష్ణంరాజు | 1. ప్రకృతి చికిత్స<br>2. కుష్ఠురోగ చికిత్స<br>3. గాంధీ స్మారకంగా ప్రకృతి వైద్యంలో శిక్షణ ఇవ్వడం<br>4. నీరాను ప్రచారం చేయడం | 1. 30కుటుంబాలకు ఇళ్లు, 30 కుటుంబాలకు గుడిశెలు కట్టించడం<br>2. 100 మంది రోగులకు ప్రకృతి చికిత్సలో గృహ వైద్యం |

| సంస్థపేరు ముఖ్య సేవకుడు | ప్రస్తుతపు పని | ఇతర వివరాలు |
|---|---|---|
| | | 3 శాశ్వత శిక్షణాలయంగా వృద్ధిచేయడం<br>4 క్షయ, కుష్ఠు వ్యాధులకు వేర్వేరు విభాగాలు తెరవడం |
| 2. సర్వోదయ ఆశ్రమం పెదవేగి | 1. భూజీవన ప్రయత్నం | బేసిక్ విశ్వ విద్యాలయంగా వృద్ధిచేయడం |
| 3. మోతె నారాయణరావు పెదవేగి | 1 భూజీవన యత్నం<br>2. చరసాల తయారీ<br>3. కార్టింగు, నూలు వడకడంలో శిక్షణ ఇవ్వడం | ఆదర్శంగా జీవిస్తూ సాధ్యమైనమేరకు నిర్మాణకార్యక్రమం నిర్వహణ |
| 4. బాల సరస్వతీ స్త్రీ సమాజం, తణుకు, దేవులపల్లి సత్యవతమ్మ | 1. సంస్కృత పాఠశాల<br>2 బేసిక్ స్కూల్<br>3. గృహ వైద్యశాల<br>4. గ్రంధాలయం<br>5. ఖాదీ ప్రచారం<br>6. తోటపని | స్త్రీ సేవ |
| 5. వితంతు గృహం, నరసాపురం | వితంతువులకు కొంతకాలం ఆశ్రయమిచ్చి పిదప విలోషం చేయడం | |
| 6. చాగల్లాశ్రమం | వ్యవసాయం | ఎకరం మెట్టభూమి పెంకుటిల్లు |

| సంస్థపేరు, ముఖ్య సేవకుడు | ప్రస్తుతపు పని | ఇతర వివరాలు |
|---|---|---|
| 7 అశ్వినీకుమార్ ఫార్మసీ, నరసాపూర్ వి వెంకటస్వామి నాయుడు | 1 పేదలకు ఆయుర్వేద వైద్యశాల, పాలరూపంలో మందుల ఉచిత పంపిణీ | పురుష సంతానం లేనప్పుడు |
| 8. వ్యాయామశాల, ఏలూరు కమ్మల అప్పన్న వై. రంగనాయకమ్మ | యోగాసనాలు, శరీరాన్ని తోమటం, ఇతర అభ్యాసాలతో రోగాల నివారణ | రెండు ఇళ్ళు ఒకటి పురుషులకు ఒకటి స్త్రీలకు |
| 9. శ్రీరామ మారుతీ సంఘం జోగమ్మ పాలెం అల్లూరు లక్ష్మినారాయణ | 1. ధాన్యపు బ్యాంకు 2. నూలు బ్యాంకు 3. సహకారోద్యమం 4. స్వావలంబనం-ఖాదీ | ఆదర్శ గ్రామంగా రూపొందించడం |
| 10. వీరమందిరం కొవ్వూరు మందేశ్వర శర్మ | 1 వీరమందిరం 2. గిరిజన సంక్షేమం 3. యుగధర్మం | గిరిజనసేవ |
| 11. ఆది ఆంధ్ర లైబ్రరీ, ఏలూరు రాయుడు గంగయ్య | హరిజనసేవ | సేవచేయడం |
| 12. పట్టభద్రుల బేసిక్ ట్రైనింగ్, పెంటపాడు | ప్రభుత్వ సంస్థలు | — |
| 13. ఆశ్రమం, వర రామచంద్రపురం పేరంట్లపల్లి స్వామీజీ | పేద బాలురకు పని ద్వారా విద్యా బోధన | సేవ |
| 14. కస్తూరిబా గ్రామసేవాకేంద్రం పోలవరం, పి. రమణమ్మ | బాలమందిర్ | గ్రామసేవ |

| సంస్థ పేరు, ముఖ్య సేవకుడు | ప్రస్తుతపు పని | ఇతర వివరాలు |
|---|---|---|
| 15. గ్రామసేవా విద్యాలయం గోపన్నపాలెం (ప్రభుత్వ నిర్వహణలో) | గ్రామ సేవకులకు శిక్షణ ఇవ్వడం | గ్రామాభివృద్ధి |
| 16. ఈ జిల్లాలో చరఖా సంఘం ఎలాంటి కృషినీ చేయలేదు. | | |
| 17. హరిజన మరియు ఆదివాస హాస్టళ్లు | 35 హాస్టళ్లు (720మంది బాలబాలికలతో | — |

4) **తూర్పు గోదావరి జిల్లా :**

| | | |
|---|---|---|
| 1. కస్తూరిబా గ్రామసేవా విద్యాలయం సీతానగరం, శ్రీమతి బుచ్చి కృష్ణమ్మ ఆర్. సామ్రాజ్యం | 1. ప్రసూతి శిక్షణ<br>2. గ్రామసేవలో శిక్షణ | గ్రామాలలోని స్త్రీలకు, బాలురకు సేవ చేయడం |
| 2. గౌతమీ జీవకారుణ్య సంఘం | 1. అహింసా ప్రచారం<br>2. ఉచిత వైద్యశాల<br>3. అనాధాశ్రమం<br>4. పేదలకు భోజనం<br>5. దిక్కులేని శవాలకు అంత్యక్రియలు | సేవ చేయడం |
| 3. ప్రకృతి చికిత్సా కేంద్రం ధవళేశ్వరం కె. అచాతరావు | చికిత్స | కొన్ని పక్కాభవనాలు కొన్ని వ్యవసాయక భూములు |
| 4. విద్యార్థి సమాజం కాకినాడ, పాపాయమ్మ | 1. సంస్కృత పాఠశాల<br>2. హిందీ పాఠశాల<br>3. కద్దై మండల్ | స్త్రీ సేవ |

| సంస్థపేరు, ముఖ్య సేవకుడు | ప్రస్తుతపు పని | ఇతర వివరాలు |
| --- | --- | --- |
| 5. హరిజన హాస్టళ్లు | 27 హాస్టళ్లు 698 బాలబాలికలతో | — |
| 6 కస్తూర్బా గ్రామ సేవా కేంద్రం రాజుపాలెం, పురుషోత్తమపట్నం | 1. బాలమందిర్<br>2. వయోజనవిద్య<br>3. సఫాయి | స్త్రీ సేవ |
| **5) విశాఖపట్నం జిల్లా :** | | |
| 1. ప్రేమ సమాజం, విశాఖపట్నం, రెడ్డిపల్లి సత్యనారాయణ | 1. అహింసా ప్రచారం<br>2. ఉచిత వైద్యశాల<br>3. అనాధాశ్రమం<br>4. పేదలకు అన్నదానం<br>5. దిక్కులేని శవాలకు అంత్యక్రియలు | సేవ |
| 2. గాంధీ ఆశ్రమం, అనకాపల్లి, కె. బుచ్చిరాజు | 1. స్వావలంబనం - ఖాదీ<br>2. గ్రంధాలయం | సేవ |
| 3. గ్రామ సౌభాగ్యాశ్రమం, వంటితాడు పి. వీరభద్రస్వామి | కస్తూర్బా గ్రామసేవా కేంద్రం - బేసిక్ స్కూలు | సేవ |
| 4 ప్రకృతి చికిత్సాలయం, వాల్తేరు యోగి రాఘవేంద్ర | చికిత్స | 5 ఎకరాల భూమి ఒక పక్కా భవనం 3 వరుసలలో గుడిసెలు |
| 5. కామాయపేట | 1. స్వావలంబనం-ఖాదీ<br>2. మతసంబంధ ఉద్యమాలు | గిరిజనులతో కొండలమధ్య ఉన్న గ్రామం |
| 6. హరిజన హాస్టళ్లు | 5 హాస్టళ్లు 98 మంది బాలబాలికలతో | — |

| సంస్థపేరు, ముఖ్య సేవకుడు | ప్రస్తుతపు పని | ఇతర వివరాలు |
|---|---|---|
| **6) శ్రీకాకుళం జిల్లా :** | | |
| 1. ఎ ఐ.యస్ ఎ, పొందూరు అండ్ శ్రీకాకుళం | నాణ్యమైన భారీ ఉత్పత్తి కేంద్రాలు | — |
| 2. హిందూ కుష్ఠు నివారణ సంఘం, చీకలపల్లి వి. రామనారాయణ్ | అల్లోపతి చికిత్స | — |
| 3. అనాధసేవా సంఘం, సాలూరు ఆర్. వెంకయ్య | పేదలకు సేవ చేయడం | — |
| 4. మలిపెద్ది కృష్ణమూర్తి | గిరిజనులకు సేవ చేయడం | — |
| **7) నెల్లూరు జిల్లా :** | | |
| 1. సత్యాగ్రహాశ్రమం, పల్లిపాడు | కస్తూర్బా సేవా కేంద్రం | స్త్రీలకు, బాలురకు సేవ చేయడం |
| 2 ప్రభుత్వ బేసిక్ ట్రైనింగ్ స్కూలు, పల్లిపాడు | ప్రాధమికోపాధ్యాయులకు | — |
| 3 అనాధాశ్రమం, నెల్లూరు యస్. చెంగల్వరాయచెట్టి | 120 మంది బాలబాలికలు | — |
| 4. ఆదివాసి కాలనీ సిద్దిపురం- నెల్లూరు వి. రాఘవయ్య | ఆదివాసి జాతిలోని అనేక తెగలు 200 కుటుంబాలు | — — |
| 5. హరిజన బాలుర హాస్టల్, నెల్లూరు ఇ పట్టాభిరామిరెడ్డి | 200 మంది బాలురు | — |
| 6. హరిజన గరల్స్ హాస్టల్, నెల్లూరు అల్లాడి అన్నపూర్ణ | 81 మంది ఆడపిల్లలు | — |

| సంస్థపేరు, ముఖ్య సేవకుడు | ప్రస్తుతపు పని | ఇతర వివరాలు |
|---|---|---|
| 7 యానాది బాలబాలికల హాస్టల్ వి. రాఘవయ్య | 3 హాస్టళ్లు, 180 మంది బాలబాలికలతో | — |
| 8 జిల్లాలోని హరిజన యానాది హాస్టళ్లు | 20 హాస్టళ్లు 608 మంది బాలబాలికలకు ప్రభుత్వ స్కాలర్‌షిప్పులు | ప్రభుత్వం ప్రైవేటు వ్యక్తుల సాయంతో 1600 మంది విద్యార్థులకు వసతి కల్పించబడింది |
| 9 గవర్నమెంటు డెవలప్‌మెంట్ ఫిర్కాలు | 1. బావులు<br>2. రోడ్లు<br>3. పారిశుద్ధ్యం అభివృద్ధి నిర్మాణ కార్యక్రమాలు | — |
| 10. పాఠశాలలో ప్రభుత్వ మధ్యాహ్నపు భోజనం | 1. స్కూళ్లలో 2456మంది బాలబాలికలు | — |
| 11. కస్తూర్బా సేవాకేంద్రం సిద్దిపురం - పల్లిపాడు | 1. బాలమందిర్<br>2. వయోజనవిద్య<br>3. సఫాయి | స్త్రీలకు, బాలురకు సేవ |

8) కర్నూలు జిల్లా :

| | | |
|---|---|---|
| 1. స్వస్తి ఆశ్రమం, బనగానపల్లి స్వామి హంసానంద | ప్రకృతి చికిత్స | సేవ |
| 2. గీతాడివైన్ సర్వీసు, నంద్యాల టి.వి.యస్. రామన్ | 1. మతసంబంధ ఉపన్యాసాలు<br>2 నూలు వడకడం<br>3 6 హాస్టళ్లు 188 మంది బాలురకు | సేవచేయవం |

| సంస్థపేరు, ముఖ్య సేవకుడు | ప్రస్తుతపు పని | ఇతర వివరాలు |
|---|---|---|
| **9) బళ్లారి జిల్లా :** | | |
| 1. హరిజన, ఆదివాసుల హాస్టళ్ళు | 8 హాస్టళ్లు<br>186 మంది బాలబాలికలు | — |
| **10) అనంతపురం జిల్లా :** | | |
| 1. సేవా మందిర్, హిందూపూర్ కె. సుబ్బారావు | 1. బేసిక్ స్కూలు<br>2. హాస్టళ్ళు<br>3. క్రాఫ్టు స్కూలు<br>4. పాలసరఫరా అభివృద్ధి<br>5. గ్రామాలకు సెంట్రల్ స్టోర్ | సేవ చేయడం |
| 2. గ్రామసేవా మందిరం, తిమ్మాపురం హనుమంతరావు | 1. ట్రంకు పెట్టెలు బకెట్లు చేయుట<br>2. హరిజన పాఠశాల<br>3. ఖద్దరు ఉత్పత్తి<br>4. వైద్యశాల<br>5. బాలురకు పాల పంపిణీ<br>6. వయోజనవిద్య | కొంత సేవచేయడం |
| **11) చిత్తూరు జిల్లా :** | | |
| 1. కస్తూర్బా గ్రామసేవా కేంద్రం అంకెసెట్టిపల్లి | 1. బాలమందిర్<br>2. వయోజనవిద్య<br>3. సఫాయి | స్త్రీలకు, బాలురకు సేవ చేయడం |
| 2. హరిజన హాస్టళ్లు | 6 హాస్టళ్ళు<br>80 మంది బాలురతో | |

24)

| సంస్థ పేరు, ముఖ్య సేవకుడు | ప్రస్తుతపు పని | ఇతర వివరాలు |
|---|---|---|
| **12) కడప జిల్లా :** | | |
| 1. ఆనందాశ్రమం, మైదుకూరు వీరబ్రహ్మం | 1. వ్యవసాయం<br>2. ఖాదీ ఉత్పత్తి<br>3. గ్రామసేవ<br>4. ట్రంకు పెట్టెలు వ్యవసాయ పరికరాల తయారీ | సేవ చేయడం |
| 2. సేవాసంఘం, బద్వేలు స్వామి గుప్త | సాధారణ సేవ | సేవ |
| 3. కస్తూర్బా గ్రామ సేవా కేంద్రం చింతకొమ్మదిన్నీ | 1 బాలమందిర్<br>2. వయోజన విద్య<br>3. సఫాయి<br>4. హాస్టళ్ళ (63మంది బాలురతో) | స్త్రీలకు, బాలురకు సేవ చేయడం |

భారతదేశ చరిత్రను మనం సూక్ష్మంగా పరిశీలిస్తే నిస్వార్థ పరులను వేళ్లపై లెక్కించవచ్చు. అలాంటి అసాధారణ వ్యక్తుల్లో ఒకడు శ్రీరాములు. కావలసినంత ఖర్చుపెట్టుకొనే అవకాశం వున్నా ఒక పేదవానిగా జీవించాడు. గాంధీ స్మారకనిధి సంచాలకుడుగా అతడు పొదుపును పాటించాడు. తన అధికారంలో వున్నవాళ్ళ కూడా పొదుపు పాటించేట్లు చూశాడు. సంచాలకుడుగా శ్రీరాములు నెలకు రూ. 150/-లు జీతంగా తీసుకోవచ్చు. కానీ శ్రీరాములు ఒక్క రూపాయ కూడా తీసుకోలేదు. తనకు కావలసినంతవరకే తీసుకొనేవాడు. ఒక పూట భోజనం ఒక ఖాదీ లుంగీ, టవల్, మూడవ తరగతి ప్రయాణపు ఖర్చులు మాత్రమే అతని అత్యవసరాలు. (1) అవసరానికి మించి వచ్చే ధనాన్ని తిరస్కరించడం ఆయనకు అలవాటు. ఒకసారి నెల్లూరు జిల్లా కనుపూరు ఫిర్కాలోని మడమనూరు గ్రామంలో 4-4-1952న జరిగిన ఒక వెల్ఫేర్ కమిటీ సమావేశానికి అనధికార

---

1) పొట్టి రంగయ్య గారితో 1974 నవంబరు 11, 12 తేదీలలో జరిపిన సమావేశం.

సభ్యుడుగా హాజరయ్యాడు. శ్రీరాములు నిబంధనల మేరకు అతని ప్రయాణపు బత్తెం కోసం రూ. 16-8-0 మంజూరయింది. తనకు వాస్తవంగా ఖర్చయింది 1-8-0 మాత్రమే. కనుక మిగతా డబ్బును మినహాయించి పంపవలసిందిగా కలెక్టరుకు లేఖ రాశాడు.

కానీ ఇటువంటి నిస్వార్థమూర్తి కూడా అనుమానించబడి విమర్శలకు గురికావడం శోచనీయం అయిన విషయం. అతని అనుచరులు కూడా అనుమానించిన సందర్భాలున్నాయి. ఆయన ఒక రిష్టువాచీ కొనుక్కొన్నప్పుడు జీతం కూడా తీసుకోనివాడు విలాసవస్తువు నెలా కొనగలిగాడని మిత్రులు అనుమానించారు. తాను అవసరమైన ఖర్చులు పెడుతున్నదీ, లేనిదీ గమనించడమే వారి కర్తవ్యమని శ్రీరాములు సమాధానం చెప్పాడు. సంచారం చేసే వ్యక్తికి గడియారం అత్యవసరమని ఆయన ఉద్దేశ్యం. ఆయన చెప్పిన సమాధానంతో అనుమానించిన వాళ్లు నిరుత్తరలయ్యారు. గాంధీ స్మారకనిధి సంచాలకుడుగా ఆయన దగ్గర వేలకొలది ధనం వుండేది. ఆయన నెల్లూరులో డి.సి. రాఘవయ్యగారింట్లో వున్నప్పుడు ఈ విషయం వాళ్లకు కూడా తెలియదు. చివరకు ఆయన నిరాహార దీక్ష చేయటానికి మద్రాసు వెళ్లిన తరువాత ఈ విషయం తెలిసింది. (1)

పొట్టి శ్రీరాములు గాంధీ స్మారక నిధి కార్యకలాపాలు కొనసాగిస్తూ సంఘంలోని చురుకైన సేవకులతో కలిసి రెండేళ్ల కాలపరిమితి వున్న ఒక శిక్షణా శిబిరాన్ని నడపడానికి ఒక కార్యక్రమాన్ని తయారుచేశాడు. అందులో శిక్షణపొందే వ్యక్తులు గాంధేయులై ఆదర్శ జీవనాన్ని గడపగలుగుతారు. ఆ శిబిరాల్లో ఈ క్రింది కోర్సుల్లో శిక్షణ ఇవ్వబడుతుంది

1. తెనాలి, గాంధీ విద్యాలయంలో ఏజెల్ల శ్రీరాములు చౌదరి గారి పర్యవేక్షణలో ఆయుర్వేద పశు వైద్య చికిత్స శిక్షణ కాలపరిమితి ఆరు మాసాలు.

2. భీమవరం ప్రకృతి చికిత్సా కేంద్రంలో డాక్టర్ వేగిరాజు కృష్ణంరాజు గారి పర్యవేక్షణలో ప్రకృతి వైద్యంలో శిక్షణ. దీని కాలపరిమితి ఆరుమాసాలు.

---

1) 1974 నవంబరు 9వ తేదీన డి.సి. రాఘవయ్యగారితో జరిపిన సమావేశం.

3. గాంధీ ఆశ్రమం కొమరోలులో ఎర్నేని సుబ్రమణ్యం ఆధ్వర్యంలో గ్రామసేవలో శిక్షణ దీని కాలపరిమితి తొమ్మిది నెలలు.

4. నిర్ణయించబడిన మరికొన్ని కోర్సుల్లో మూడు నెలలు అధికంగా శిక్షణ ఇవ్వబడుతుంది. (1) శిక్షణ పొందే అభ్యర్థులు కఠిన నియమబద్ధులై వుండాలి. పొగ త్రాగరాదు. మాంసాన్ని భక్షింపరాదు. అభ్యర్థులు తప్పనిసరిగా ఖద్దరు ధరించాలి. తోటివారిలో సుహృద్భావాన్ని పెంపొందించుకోవాలి.

గాంధీ స్మారక నిధి కేంద్ర కార్యాలయం వారితో కూడా శ్రీరాములు సత్సంబంధాలు కలిగించుకొన్నాడు. వారికి అనేక ఆచరణాత్మక సూచనలు కూడా అందజేశాడు. ఆంధ్ర దేశంలో గాంధీ గృహాల నిర్మాణాత్మక కార్యక్రమాల గుణ దోషాలను సమీక్షిస్తూ, కేంద్ర కార్యదర్శికి జవాబు రాశాడు. కార్యకర్తలు తగినన్ని వనరులు కల్పింపబడితే కృష్ణా జిల్లాలోని గాంధీ ఆశ్రమం, గుంటూరులోని వినయాశ్రమం, అనంతపూర్‌లోని సేవాశ్రమం, కడప జిల్లాలోని ఆనందాశ్రమం, పశ్చిమ గోదావరి జిల్లాలోని సర్వోదయాశ్రమం, విజయనగరంలోని సౌభాగ్యాశ్రమం మున్నగు వాటిని విస్తరణ కేంద్రాలుగా అభివృద్ధి పరచడం తెలిపాడు.

గాంధీజీ సిద్ధాంతాలపై నడుస్తున్న ధార్మిక సంస్థలకు ఆర్థిక సహాయం చేయడానికి తరచుగా వాటిని సందర్శించి సలహాలివ్వడానికి శ్రీరాములు పూనుకొన్నాడు. నిర్మాణ కార్యక్రమం చేపట్టిన వ్యక్తులు సంస్థలు, ఆర్థిక సహాయం పొందడానికి నిర్ణీతమైన పద్ధతిలో తనకు దరఖాస్తులు పంపుకోవాలని ప్రకటించాడు. మైదుకూరు, విజయవాడ, తెనాలి, రాజమండ్రి, నరసాపురం, తిమ్మాపురం, తిలారు, సమిశ్రగూడెం, మద్రాసు, బాపట్ల, హిందుపూర్, గుంటూరు, నెల్లూరు, పిఠాపురం, తాళ్లపాలెం, నందిగామ, మారుటేరు, చేబ్రోలు, బనగానపల్లి, నిడదవోలు, ఆముదాలవలస మున్నగు ప్రదేశాల్లోని ధార్మిక సంస్థల నుండి దరఖాస్తులు పొట్టి శ్రీరాములుకు అందాయి. పొట్టి శ్రీరాములు ఆయా సంస్థలు అందించిన సమాచారం సత్యమైందో, అసత్యమైందో తెలుసుకోవడానికి ముందు జాగ్రత

---

1) గాంధీ స్మారకనిధి సంచాలకుని హోదాలో 1951 అక్టోబరు 5వ తేదీన శ్రీరాములు సాంఘిక సేవా కార్యకర్తలకు పంపిన కరపత్రము.

తీసుకొన్నాడు. ఇందుకు ఆయా ప్రాంతాల గాంధీ అనుచరుల సహాయాన్ని పొందాడు. తన పరిశీలనలో నిజానిజాలు తెలుసుకొన్నాడు. కుష్ఠురోగ నిపుణుడైన డా॥ టి. జె. గంగరాజు యోగ్యతలేని వైద్యుడని అతని నిజాయితీ సందేహాస్పదమని తెనాలిలోని వెంపటి సూర్యనారాయణ గారికి ఉత్తరం రాసి తెలుసుకొన్నాడు. అలాగే మైదుకూరు ఆనందాశ్రమాన్ని గురించి కూడా తెలుసుకొన్నాడు. ఆశ్రమంలో ఎక్కువ సంఖ్యలో జనం నివసిస్తున్నారు. నిర్మాణాత్మక కృషిలో ఎవరూ శిక్షణ పొందలేదు. గాంధీ స్మారకనిధి సంస్థవారు నడుపుతున్న శిక్షణా తరగతులకు అభ్యర్థులను పంపడంలో ఈ ఆశ్రమంవారు శ్రద్ధ తీసుకోలేదు. ఈ ఆశ్రమంలోని వారు ఆశ్రమంలో పనిచేస్తున్నట్లుగానీ, నూలు వడకుతున్నట్లుగాని కనిపించడం లేదని తెలియజేశాడు. (1)

గాంధీ స్మారకనిధి సంచాలకుడుగా పొట్టి శ్రీరాములు అర్హత కలిగిన సంస్థలకు ఆర్థిక సహాయాన్ని కల్పించడమేకాక అపోహలను తొలగించడానికి పత్రికా ప్రకటనలు కూడా చేశాడు. (2)

16-6-1952నాడు జరిగిన సమావేశంలో గాంధీ స్మారకనిధి సంఘం ఆంధ్రలో నిర్మాణాత్మక కృషికిగాను క్రింది మొత్తాలను మంజూరు చేసింది.

1. మశూచి రోగులకు ప్రకృతి చికిత్స ద్వారా సేవచేయడానికి 1952 ఏప్రిల్ నెలలో పశ్చిమ గోదావరి జిల్లా భీమవరాన్ని చుట్టి విద్యార్థులు ప్రయాణం చేసినప్పుడు అయిన ఖర్చులు రూ. 350-00

2. 1952లో గుంటూరు జిల్లా వినయాశ్రమానికి మంజూరైన మొత్తం రూ. 2,000-00

---

1) 1951 ఆగష్టు 5వ తేదీన పొట్టి శ్రీరాములు ఢిల్లీలోని గాంధీ స్మారకనిధి కార్యదర్శికి వ్రాసిన లేఖ

2) 1952 జులై 15వ తేదీన ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, హిందు దినపత్రికలకు శ్రీరాములు వ్రాసిన లేఖ.

3. 1952లో గాంధీ స్మారకనిధి శిక్షణా కేంద్రంగా అభివృద్ధి పరచడానికి కృష్ణా జిల్లా కొమరోలు గాంధీ ఆశ్రమానికి ఇవ్వబడిన గ్రాంటు రూ. 12,000-00

4. 1952 సంవత్సరానికి కొండ ప్రాంతంలో ఇరువురు ప్రచారకులను నియమించడానికి పశ్చిమ గోదావరి జిల్లా కొవ్వూరులోని ఆంధ్ర శ్రామిక ధర్మరాజ్య సభకు ఇచ్చిన గ్రాంటు రూ. 2,400-00

5. 1952లో విద్యార్థులను వార్ధా శిక్షణా సంస్థలకు పంపడానికి ఇచ్చిన గ్రాంటు రూ. 3,000-00

6. 1952లో నేత విభాగాన్ని నెలకొల్పడానికి పశ్చిమ గోదావరి జిల్లా తణుకు లోని బాలసరస్వతీ స్త్రీ సమాజానికి ఇచ్చిన గ్రాంటు రూ. 300-00

7. 1952లో నూలు వడకడానికి కాకినాడ హరిజన హాస్టలుకు ఇచ్చిన గ్రాంటు రూ. 400-00

8. 1952 లో నెల్లూరులో ఆంధ్ర రాష్ట్ర ఆదిమజాతి సేవక సంఘానికి ప్రచారం ఆఫీసు ఖర్చులు కొత్త హాస్టళ్లను ప్రారంభించడం మొదలైన వాటికి ఇచ్చిన గ్రాంటు రూ. 8,020-00

**1952 ఫిబ్రవరిలో మంజూరైన మొత్తాలు :**

9. కుట్టుపని, సంగీతం, నూలు వడకే విభాగాలకు నెల్లూరు హరిజన బాలికల హాస్టలుకు ఇచ్చిన మొత్తం రూ. 1,175-00

10. సర్వోదయ సేవాదళం ప్రణాళిక క్రింద కేటాయించబడిన మొత్తం (ఈ స్కీము విరమించబడింది) రూ. 6,000-00

11. భీమవరంలో ప్రకృతి చికిత్స ద్వారా కుష్ఠురోగ చికిత్సకై ఇచ్చిన గ్రాంటు రూ. 6,000-00

12. గుంటూరు జిల్లా గురజాలలోని మహాత్మాగాంధి ఆశ్రమానికి నూలువడికే విభాగాన్ని ఏర్పాటుచేయడానికి రూ. 350-00

13. 1952 కృష్ణా జిల్లా మండపల్లి గ్రామ సేవకుడైన మల్లిఖార్జునకు ఇచ్చిన నెలసరి అలవెన్సు రూ. 600-00

**గత సంవత్సరము నుండి**

14. కృష్ణా జిల్లా కొమరవోలు గాంధీ ఆశ్రమం గ్రామ సేవకులకు 1952లో శిక్షణ ఇవ్వడానికి, క్యాంపులను నిర్వహించడానికి అయిన ఖర్చు రూ. 7,400-00

మొత్తం రూ. 50,595-00

సం/–
పొట్టి శ్రీరాములు,
సంచాలక్

సంవత్సరాల పర్యంతరం అవిశ్రాంతంగా శ్రమించినపట్టికి తలపెట్టిన నిర్మాణాత్మక కార్యక్రమాల్లో ప్రగతిని సాధించలేకపోయాడు శ్రీరాములు అందుచేత అతనికి బాధ కలిగింది ఈ విషయాన్ని బాగా ఆలోచించాడు. ఆలోచించిన మీదట ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం లేకపోవడం వల్లనే వారికి నిర్మాణాత్మక కార్యక్రమాల పట్ల శ్రద్ధ లేదని గ్రహించాడు. వినోభాజీ భూదాన యజ్ఞం దేశమంతటా నిర్విఘ్నంగా సాగుతున్నా ఆంధ్రలో సంతృప్తిగా జరగకపోవడానికి కూడా ఇదే కారణమని గ్రహించాడు. గాంధీ ట్రస్టు కస్తూర్బా ట్రస్టులు దేశమంతటా అభివృద్ధి దశలో వుండగా ఆంధ్రలో మందకొడిగా సాగుతున్నాయి. (1) ఇదేవిధంగా మద్రాసు నగరంలోని ప్రజలకు ఇతరులకు ఆయన ఇలా విజ్ఞప్తి చేశాడు.

"నేను నిర్మాణాత్మక కృషి చేసేటప్పుడు ఎన్నో ఇబ్బందులకు గురి అయ్యాను. ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం లేనందువల్లనే ఆ ఇబ్బందులు ఎదురయ్యాయని గ్రహించాను ఆంధ్ర రాష్ట్రం ఏర్పడందే నిర్మాణ కార్యక్రమ కృషి కొనసాగదనే నిర్ణయానికి వచ్చాను. నిర్మాణ కార్యకర్తలు దేశంలో ఎక్కడైనా ఆచరణాత్మకంగా ప్రభుత్వ విధానంతో సంతృప్తిపడరనే విషయం నాకు తెలుసు. అయినా ప్రభుత్వంలో వున్న వ్యక్తులు వారికి తెలిసినవారు కావడంవల్ల వారి సానుభూతి వీరికి ఉన్నందువల్ల

1) 1951 సెప్టెంబర్ 10వ తేదీన పొట్టి శ్రీరాములు ప్రజలకు చేసిన విన్నపము.

నిర్మాణ కార్యకర్తలు ఎంతో కొంత కృషి చేయగలుగుతున్నారు. కానీ బహు భాషలు మాట్లాడే ప్రజలున్న మద్రాసు వంటి ప్రాంతాల్లో నిర్మాణ కార్యకర్తలు గాలికి వదిలివేయబడ్డారు. ఈ విషయం ఆంధ్ర ప్రాంతంలో మరింత కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది.

అందువల్ల శ్రీరాములు సంచాలక పదవిని విరమించి ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కోసం పోరాడాలని వెంటనే ఒక నిర్ణయానికి వచ్చాడు. వెంటనే 16-10-1952 నాడు గాంధీ స్మారక నిధి ఎకౌంట్స్ ఇన్‌స్పెక్టరైన శ్రీ యన్.యన్. యాజికి పదవీ బాధ్యతలను అప్పగించాడు. యాజికి అతడు అప్పగించిన ఫైళ్ళు వస్తువులు ఈ క్రింది విధంగా వున్నాయి.

1. రూ. 118-11.3 నిలువ వున్న నగదు పుస్తకం
   (బ్యాంకు నిలువ రూ 39-10-0)
2. లెడ్జర్ - (ఆవర్జ)
3. జర్నల్ (చిట్టాపద్దుల పుస్తకం)
4. పోస్టల్ రిజిష్టర్లు – 4
5. రబ్బరు స్టాంపులు – 5
6. మురిగిపోయిన నిల్వ ఫర్నీచరు, ఒక రెమింగ్‌టన్ టైపుమిషన్
7. ఫైళ్ళు

ఆదివాసి ఫైల్, సెంట్రల్ ఆఫీసు కేంద్ర కార్యాలయంలో జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలు, కేంద్ర కార్యాలయ జమల పుస్తకం, సిఫార్సు చేయబడ్డ దరఖాస్తులు, తిరస్కరించబడ్డ దరఖాస్తులు, హరిజన సేవక సంఘం ఫైలు, స్కీముల ఫైలు, వసూళ్ళ కమిటీ ధోత్రేజీ అండ్ ట్రైనీలు (1) నెలసరి వివరాల ఫైలు, గాంధీ ఆశ్రమం కొమరవోలు (కృష్ణా) సలహాబోర్డు కార్యక్రమాలు. సభ్యుల సర్క్యులర్స్ ఫైలు, పత్రికల నుండి కత్తిరింపబడిన కాగితాలు, సాధారణ ఉత్తర కుష్ఠువ్యాధి నుండి విముక్తి (డా॥ రాజు, చిలకలపల్లి, డా॥ వార్వేకర్ అండ్ టి. జగదీశన్)

1) పొట్టి శ్రీరాములు పర్సనల్ ఫైల్స్ నుండి సేకరించబడినది

